# బ్రహ్మానంద వాణి

(శ్రీరామకృష్ణ పరమహంస మానసపుత్రుడగు
శ్రీ బ్రహ్మానందస్వామి దివ్యోపదేశములు)

మూలము :

శ్రీ ప్రభవానందస్వామి

అనువాదము :

చిరంతనానందస్వామి




శ్రీ రామకృష్ణ మఠము
మైలాపూరు :: మద్రాసు-600004

# విజ్ఞప్తి

'బ్రహ్మానంద బోధనలు' (శ్రీ బ్రహ్మానంద స్వామి జీవితోపదేశములు) అను పేర నిదివఱకు మాచేఁ బ్రకటింపఁబడియున్న గ్రంథము నిపుడు 'బ్రహ్మానంద వాణి', 'బ్రహ్మానంద చరిత్ర'యు నని రెండు వేర్వేఱు పుస్తకములుగాఁ బ్రకటించి యున్నాము. పాఠకుల యుపయోగార్థమై ప్రస్తుత 'బ్రహ్మానంద వాణి' యందు స్వామి సంగ్రహ చరిత్ర చేర్పఁబడినది. ఐనను 'బ్రహ్మానంద చరిత్ర'ను గూడ చదివినచో, స్వామి మహత్త్వమును వ్యక్తిత్వ విశేషములును బాగుగాఁ దెలియఁగలవు.

శ్రీ రామకృష్ణమఠము
మైలాపూర్, మద్రాస్-4
డిసెంబరు, 1971

ప్రకాశకులు.

# మున్నుడి

నావికునకు దిక్సూచియంత్రమువలె సద్గురువరేణ్యుల జీవితోపదేశములు మానవకోటికి జీవయాత్రయందు మార్గదర్శకములు. పరమగమ్యమగు పరంజ్యోతిని ప్రాపించుటకు వీరల దివ్యజీవితోపదేశములే సాధకుల కెల్లరకును దోడునీడలు. వీరి మహోపదేశములు ఆత్మానుభవచంద్రికలు. జీవితము మూఁడునాళ్ళ ముచ్చటయేనా? పరలోకము కలదా? భగవంతుఁడనువాఁడు నిజముగాఁ గలఁడా?—యనునట్టి సమస్యల కన్నిఁటికిని ఆత్మద్రష్టలగు వీరల చరిత్రోపదేశములే మనకు సరియగు సమాధానము నొసఁగఁగలవు. జగదేకపూజ్యుఁడగు శ్రీరామకృష్ణపరమహంసకు కాళీవరప్రసాదలబ్ధమానసపుత్రుఁడగు శ్రీ బ్రహ్మానందస్వామి యిట్టి మహనీయులలో ప్రధానగణ్యుఁడు.

“అధ్యాత్మవిద్యా విద్యానామ్” అనునట్లు సమస్తవిద్యలకును శిరోభూషణ మనఁదగు బ్రహ్మవిద్య స్వామి కెట్లు కరతలామలకమై యొప్పెనో శిష్యుల కాతఁ డొసరించిన యిందలి బోధలవలన వెల్లడికాఁగలదు.

సాంకేతిక (పారిభాషిక) పదములతో నిండియుండి జటిలమైయున్న ప్రాచీనవేదాంతశాస్త్రగ్రంథము లనేకములు ఆధునికులగు సాధకులకును సామాన్యపాఠకులకును అందుపాటులో నుండుట లేదు. శ్రీ బ్రహ్మానందస్వామి బోధనలు అట్లుకాక ఆధ్యాత్మికతత్త్వములను, సాధనయందలి

రహస్యములను అరఁటిపండొలిచి చేతికి అందిచ్చినట్లు విశదీకరించును.

భక్తులకును శిష్యులకును స్వామి యనేకసందర్భములలోఁ జేసిన యుపదేశములు వంగభాషలో 'ధర్మప్రసంగ' యను పేర గ్రంథరూపము నొందియున్నవి. మూలరూపమున నైననేమి, అనువాద రూపమున నైననేమి, దేశదేశాంతరములలో, ఖండఖండాంతరములలో వ్యాప్తి నొందియున్న యీ గ్రంథము సాధకుల కెల్లరకును దోడునీడయై యుండఁదగిన పవిత్రగ్రంథ రాజము. స్వామి దివ్యవాక్కులు తమ మహోన్నతభావముల పరిమళముచే, సరళమృదుల పదజాలమనెడి సోయగముచే, అంతరార్థములనెడి తేనియలచే నెల్లరియుల్లములను బల్లవింపఁజేయుచుండును.

ఈ గ్రంథమునకు మూలము శ్రీ ప్రభవానందస్వామిచేఁ గూర్పఁబడి, మద్రాస్, శ్రీరామకృష్ణమఠమువారిచేఁ బ్రకటింపఁబడియున్న **The Eternal Companion—Brahmananda—His Life and Teachings** అను గ్రంథము. శీర్షికల క్రమమున సందర్భానుసారముగ ఇందుఁ గొన్ని మార్పులు చేయఁబడినవి. ఆవశ్యకమగు తావులందు శాస్త్రప్రమాణములు పాదదీపికలు (Foot notes) గాఁ జేర్పఁబడినవి.

చిరంతనానందస్వామి.

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ!

# శ్రీ బ్రహ్మానందస్వామి సంగ్రహచరిత్ర

శ్రీ బ్రహ్మానందస్వామి శ్రీ రామకృష్ణ పరమహంస మానసపుత్రుఁడు. "అమ్మా! సదా నాకొకఁడు తోడునీడయై యుండఁగోరెదను. నిర్మలహృదయుఁడు, సదా నీపాదపద్మములనే నమ్మికొనియుండువాఁడును అగు నొకబాలుని నాకడకుఁ గొనిరమ్మా" అని పరమహంస జగన్మాతను (కాళిని) ప్రార్థించెను. అంత నొకనాఁ డాతఁ డొక దివ్యదృశ్యమును గాంచెను. "ఇదిగో, నీపుత్రుఁడు" అని జగన్మాత యాతనియొడిలో నొక బాలునిఁ గూర్చుండఁ బెట్టఁగా, పరమహంసశరీరమంతయు కంపించెను. తనకు పుత్రుఁడు గలుగు టెట్లు? ఆభావమే యాతనికి మరణసదృశము. తాను అస్ఖలితబ్రహ్మచారిగదా! కాని లోకుల రీతిని దాను పుత్రునిఁ గనఁబోవుట లేదనియు, ఆబిడ్డఁడు తన (పరమహంస) మానసపుత్రుఁ డనియుఁ దనకు జగజ్జనని బోధపఱుప నాతఁడు శాంతినొందెను. మఱియొక దివ్యదృశ్యమున, గంగానదిపై వికసితశతపత్రకమలమున, పాదములఁ జిఱుగజ్జియలతో నృత్యముచేయుచుండిన యిరువురు బాలురను—గోపాలకృష్ణుని, తన కిదివఱకు జగన్మాత చూపిన బాలుని—శ్రీరామకృష్ణుఁడు గాంచెను. అన్నృత్యమును గని యాతఁడు సమాధిస్థితి నొందెను.

బ్రహ్మానందస్వామి బాల్యనామము రాఖాల్ చంద్ర ఘోష్. వంగదేశమున ఇరువదినాలుగు పరగణాలను జిల్లాలో ఆనందమోహన ఘోష్, కైలాసకామినియు నను పుణ్యదంపతులకు క్రీ. శ. 1863-వ సం॥ జనవరి 21-వ తేదీని రాఖాల్ జన్మించెను. వీరు కాయస్థక్షత్రియులు. తండ్రి జమీందారు; తల్లి సాధ్వీమతల్లి, కృష్ణభక్తురాలు. కాని రాఖాల్ బాల్యముననే ఆమె గతింప, సవతితల్లి యయ్యును ప్రేమపూరితురాలగు నామెచే రాఖాల్ పెంపఁ బడియెను.

సుందరాకారుఁడు, దృఢశరీరుఁడునై రాఖాల్ పెంపొందు చుండ, తండ్రి ఆనందమోహనుఁడు నెలకొల్పిన పాఠ శాలలో రాఖాల్ విద్యాభ్యాసముచేయసాగెను. ధీమంతుఁడును నవనీతకోమలహృదయుఁడును అగు రాఖాలుని స్వభావము గ్రహించి ఉపాధ్యాయుఁడు పిల్లలను గొట్టుట మానివేసెను. రాఖాల్ తమయింటిసమీపమందలి కాళికాలయావరణమునఁ దోడిబాలురతోఁ గూడి కాళిని పూజించును; కుటుంబమున దుర్గాపూజలలో విశేషశ్రద్ధాభక్తులు చూపును; సమీపమందలి యొకతోఁటకుఁ బోయి తన్మయుఁడై చెలికాండ్రతో శ్రీకృష్ణ కాళీసంకీర్తన మొనరించును.

పదేండ్లప్రాయమున రాఖాల్ కలకత్తాలోని యొక ఆంగ్లోన్నతపాఠశాలలోఁ బ్రవేశించి చదువుకొనుచు, దానికి

సంబంధించిన వ్యాయామసాధకసమాజమున జేరి మహో
త్సాహముతో మల్లయుద్ధము, కుస్తీ, గరిడి మున్నగు సాధ
నల నభ్యసింపసాగెను. నాఁడు నరేంద్రనాథ్ అను నామ
మునఁ దోడిబాలురకును, కాలక్రమమున విశ్వమానవకోటి
కిని నాయకుఁడైన శ్రీవివేకానందస్వామిని రాఖాల్ కలసి
కొనిన దీ వ్యాయామసమాజముననే. ఇరువురును సమవయ
స్కులే. ఇరువురకును అద్భుతమైత్రి కుదిరెను. ఇరువు
రును నాఁడు ప్రఖ్యాతి చెందిన బ్రాహ్మసమాజమున సభ్యులై
ప్రార్థనాదులకుఁ బోవుచుండెడివారు.

ఆధ్యాత్మికచింతచే రాఖాల్ బడిచదువు నలక్ష్యముచేయు
చుండుటఁ గాంచి, యాతనిదృష్టి మఱలించుటకై తండ్రి
యాతనికి బాల్యముననే వివాహ మొనరించెను. కాని అదృష్ట
వశమున ఈ వివాహమే శ్రీ పరమహంస సాన్నిధ్యమునకు
హేతుభూతమై రాఖాలున కెంతయో తోడ్పడెను. రాఖాల్
బావమఱదియగు మనోమోహనమిత్రుఁడును అత్తయగు
శ్యామసుందరీదేవియు ఇదివఱకే శ్రీరామకృష్ణుని మహా
భక్తులు. ఈ మనోమోహనుఁడే రాఖాలును 1881-వ సం॥
నడుమ శ్రీ రామకృష్ణుని సన్నిధికిఁ దోడ్కొని వెడలెను.
తన దివ్యసందర్శనములవలన శ్రీ రామకృష్ణుఁడు రాఖాలును
గుర్తించి, ఆతనిపై అపార ప్రేమానురాగములు చూప
సాగెను. రాఖాల్ అపురూపమైన చనవుతో గురుదేవుని
సేవించువాఁడు.

ఎంతటి వాత్సల్యము చూపినను, తన ప్రియపుత్రుని శిక్షణమున శ్రీ రామకృష్ణుఁడు అఖండశ్రద్ధ వహించెను. ఒకనాఁ డాతఁడు రాఖాల్ తన సమక్షమునకు వచ్చియుండ, "నీ మోమున ఒకవిధమైన మాలిన్య మావరించినట్లు కని పించుచున్నది. ఏమైనను తప్పు చేసితివా, చెప్పు"మని, తుదకు "హాస్యమునకు అసత్యమాడితిని" అని రాఖాల్ వలన విని, "ఎన్నఁడును అబద్ధములాడకు" మనియు "సత్యారాధ నమే ముఖ్యమైన ఆధ్యాత్మిక సాధన" యనియు హెచ్చ రించెను. తన ప్రియపుత్రుఁడు లీలలందును బొంకులు లేని వాఁడై " యుండవలయునని శ్రీరామకృష్ణుని యాశయము.

రాఖాలునకు గురుదేవుఁడు మంత్రోపదేశ మొసర్ప, దాని వలన రాఖాల్ తన యిష్టదేవతాస్వరూపమును దర్శించెను. ఐనను రాఖాల్ ఒకనాఁడు ధ్యానసమయమున విశేషచిత్త విక్షేపము నొందఁగా, శ్రీ రామకృష్ణుఁ డచటికి వచ్చి సంగతి విని, "నాలుక జాపు"మని, తన వ్రేలితో నాలుకపై నేమియో వ్రాసి యవలీలగా అవరోధమును దొలఁగించెను.

రాఖాల్ అహర్నిశము భగవన్నామమును స్మరించు చుండుట గాంచి శ్రీ రామకృష్ణుఁడు బ్రహ్మానందపర వశుఁడై, ప్రియశిష్యున కనేక యోగరహస్యములను దెల్పెను. ఐనను గురుదేవుఁ డాతనికి లౌకికవాంఛా వేశ మున్నదని గ్రహించి, భార్యయొద్ద కపుడపుడు పంపుచుండు

వాఁడు. అచిరకాలముననే భార్యయు సహకరింప, రాఖాల్ పూర్ణవిరక్తుఁ డయ్యెను. రాఖాల్ తన యోగశక్తిచే ఇతరుల మనోభావములను అవలీలగా గ్రహించి తన సిద్ధులను వినియోగించుచుండువాఁడు. కాని యోగసిద్ధుల నెంతమాత్రము లక్షింపరాదని గురుదేవుఁడు తీవ్రముగా మందలించెను.

దైవవశమున 1885-వ సంవత్సరము నడుమ శ్రీ రామకృష్ణునకు కంఠమున బాధ యంకురించి, యది క్రమముగా 'క్యాన్సర్' (రోహిణి)గాఁ బరిగణింప, నరేంద్రాదులగు నితర సోదరశిష్యులతోఁ గూడి రాఖాల్ అఖండ శ్రద్ధాభక్తులతో గురుదేవుని సేవింపసాగెను. రాఖాల్ శక్తిసామర్థ్యములను గంభీరస్వభావమును గని గురుదేవుఁ డొకనాఁడు, "రాఖాల్ ఒక మహారాజ్యము నేలఁగలిగిన వివేకసామర్థ్యములు గలవాఁడు" అని ప్రశంసించెను. గుణగ్రహణపారీణుఁడును, సోదర శిష్యబృందమునకు నాయకుఁడును అగు నరేంద్రుఁ డందలి యంతరార్థమును గ్రహించి, "రాఖాలు నింతటినుండి మన మందఱము 'రాజా' యని సంబోధింత" మని పలుక, సోదర శిష్యులెల్లరును ఆమోదించి రాఖాలునెడ విశేష ప్రేమగౌరవములను జూపసాగిరి. నాఁటినుండియు నాతనిని 'రాజా' యనియు 'మహారాజు' అనియుఁ బిలుచుచుండిరి.

రాఖాలునకు క్రమముగా భావసమాధిస్థితులును, అనేక దివ్యదర్శనములును, యోగసిద్ధులును గలుగసాగెను. కాలాంతరమున అద్వైతానందస్వామి యను నామమున ప్రసిద్ధుఁడైన శ్రీరామకృష్ణశిష్యుఁ డొకనాఁడు కొన్ని కాషాయవస్త్రములను, జపమాలలను సన్న్యాసులకు సమర్పించుటకై గొనివచ్చి, గురుదేవున కర్పింప, నాతఁడు వానిని స్వయముగా రాఖాల్ నరేంద్రాదిబాలశిష్యుల కొసఁగెను.

ఎంతటి యుత్తమవైద్యచికిత్సలను, ఉపచారములను ఒనర్చినను, నానాఁటికి శరీరస్థితి క్షీణింప, గురుదేవుఁడు కలకత్తాలో కాశీపురవనభవనమున 1886-వ సం॥ అగస్టు 16-వ తేదీని మహాసమాధి (నిర్యాణము) నొందెను. అనంతరము రాఖాల్ సోదరశిష్యులతోఁ గూడి బారా (వరాహ) నగర మను తావునఁ దా మేర్పఱచుకొనిన మఠమున శాస్త్రీయముగా సన్న్యాసస్వీకార మొనర్చెను. రాఖాల్ బ్రహ్మానందస్వామి యయ్యెను. తీవ్రవైరాగ్యసంపన్నులై వారు తపశ్చర్య లొనర్చుచుండిరి. తీర్థయాత్రలు చేయుచు నింకను విశేషతపమొనర్చుటకై బ్రహ్మానందస్వామి జగన్నాథమునకు వెడలి భిక్షాటనముచేయుచుండ, బలరాంబోస్ (వసువు) అను శ్రీ రామకృష్ణశిష్యుఁడగు జమీందారు అచటఁ దనభవనమునఁ దనతో నదుపాయముగా నుండఁబట్టుపట్టెను. జీవితపరమావధిని సాధించుటకై దృఢసంకల్పుఁడగు

తాపసి సౌఖ్యసౌకర్యములను లక్షించునా? బ్రహ్మానంద స్వామి యటనుండి మఠమునకు మఱలివచ్చి, ఉత్తర హిందూస్థానమున తపమొనర్చుటకై బయలుదేఱ, మఠమున నాయకుఁడగు నరేంద్రనాథుఁడు, తమమహారాజున కెచ్చట నేమి యిబ్బంది గలుగునోయని సుబోధానందుఁ డను సోదరశిష్యునిఁ దోడుగాఁ బంపెను. అతనితో కాశికిని నర్మదాతీరమందలి ఓంకారనాథమునకును వెడలి బ్రహ్మానందస్వామి తీవ్రతపమాచరించెను ఆనదీతీరమున స్వామి యొకప్పుడు ఆఱుదినముల పర్యంతము నిరంతరసమాధి నిమగ్నుఁడై యుండెను. అటనుండి పంచవటి కేఁగి యచట సంకీర్తనచేయుచు నొక్కచట్టున మూఁడుదినముల వఱకును సమాధినిమగ్నుఁడై యుండెను. ఎవ్వరైనను ధన మీయఁబోయినను స్వామి స్వీకరించువాఁడు కాఁడు. అటనుండి ద్వారకాబృందావనములకు యాత్రల నొనర్చి బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై నిరంతరతపోనిష్ఠలో మహారాజు అన్నపానములమాటయే మఱచుచుండ, సుబోధానందుఁడు ఆశ్చర్యచకితుఁడగువాఁడు. మహనీయుఁడును పరమహంస ప్రియుఁడును అగు విజయకృష్ణగోస్వామి యీసమయమున మహారాజును దర్శించి, "స్వామీ! ఆధ్యాత్మికజీవితమునఁ గోరఁదగినదంతయు గురుదేవులు మీ కొసఁగియేయుండిరి గదా? మీ రింకను ఇంతటితపశ్చర్యల నవలంబింపనేల?" యని ప్రశ్నింప, బ్రహ్మానందుఁడు చిఱునవ్వునవ్వి,

"ఆయనవలన నేను పొందినదానిని స్థిరాప్తిగా నొనరించు కొనఁగోరెదను" అని సమాధానించెను. ఇట్టిదిగదా మహర్షుల సాధనపరాయణత!

అనంతరము సుబోధానందుని వీడి, సోదరశిష్యుఁడును మహాయోగియు నగు తురీయానందునిఁ గలసికొని, మహారాజు ఉత్తరదేశమున అనేకపుణ్యక్షేత్రములను సందర్శింప సాగెను. బృందావనమున నుండిన కాలమున అర్ధరాత్రమున లేచి తెల్లవాఱు పర్యంతము జపధ్యానముల నాచరించువాఁడు. అపు డాతఁడు పొందిన దివ్యానుభవములు వర్ణనాతీతములు.

కాలచక్రము అతి శీఘ్రముగాఁ దిరిగెను. 1893-వ సం॥న శ్రీ వివేకానందస్వామి అమెరికాలో చికాగో విశ్వ మత మహాసభయందు అద్వితీయ విజయోపేతుఁడై హిందూ మత (సనాతనధర్మ) విజయధ్వజస్థాపన మొనర్చిన సంగతి లేఖాదులమూలమున బ్రహ్మానందస్వామికిఁ దెలియవచ్చెను. స్వామి తన మహాతపఃఫలితముగా బ్రహ్మానంద సామ్రాజ్యమున సుప్రతిష్ఠితుఁడై యున్నాఁడు. లోకకల్యాణార్థ మాతఁడిక శ్రీ రామకృష్ణసంస్థయందలి మహాబాధ్యతలను నిర్వహింపవలసియున్నది. అంతరాత్మప్రేరణమున నాతఁడు కలకత్తాయందలి బారా (వరాహ) నగరమునుండి ఆలంబజారునకు మార్పఁబడియుండిన తమ మఠమునకు మఱలెను. అది క్రీ. శ. 1894-వ సంవత్సరాంతము.

పిమ్మట రెండేండ్లకు శ్రీ వివేకానందస్వామి అమెరి నుండి దిగ్విజయ యాత్రతో కలకత్తాకు విచ్చేసెను. స్వాగతార్థమైన బహిరంగమహాసభలో స్వామిని బ్రహ్మానందస్వామియే పుష్పమాలాలంకృతు నొనర్చె. "గురువత్ గురుపుత్రేషు" అనుచు, వివేకానందుఁడు బ్రహ్మానందునకు పాదాభివందన మాచరించెను. అంతట బ్రహ్మానంద మహారాజు సమయోచితముగా, "జ్యేష్ఠభ్రాతా పితృసమః" అనుచు వివేకానందస్వామికి ప్రణమిల్లె, వారల పరస్పర ప్రేమ గౌరవములు దేవతలకు సైతము దర్శనీయమై విరాజిల్లెను.

భారతీయ సముద్ధరణోద్యమమునకై అమెరికా దేశీయ భక్తు లొసఁగిన ధనము నంతయు, "ఇంతటినుండి దీనికి మన మహారాజే ధర్మకర్త" యనుచు వివేకానందస్వామి బ్రహ్మానందస్వామి చేతికి అందించెను.

రాఖాల్ నరేంద్రులను బండారులతోఁ బోల్చుచు, "నరేంద్రుఁడు ఒరనుండి తీసిన జ్ఞానఖడ్గ మైనచో, రాఖాల్ జగన్మాత యొడిలోని బిడ్డ" యని శ్రీ రామకృష్ణుఁడు కొనియాడియుండెను. వివేకానందస్వామి తన సందేశమును లోకమునకు భేరీనినాదమువలె, వేదాంత సింహగర్జనము వలెఁ బ్రకటింప, బ్రహ్మానందస్వామి ప్రశాంతముగను అజ్ఞాతముగను గురియుచు, నానా కుసుమములను వికసింపఁ జేసి దివ్యఫలసస్యములను ఒనగూర్చు మంచువలెఁ దన

మౌనజీవితముల మూలమున ఆత్మప్రభావమును వ్యక్తీక రించెను. వివేకానందుఁడు నవీన భారతీయజాగృతికి పునా దులను నిర్మించినచో, బ్రహ్మానందుఁడు వానిపై మహాభవన మును నెలకొల్పెను. వివేకానందుని ధీరవీరవ్యక్తిత్వము ఎవ్వనినైనను జడస్వభావమునుండి మేల్కొల్పఁగల్గినచో, బ్రహ్మానందుని యంతరవలోక నాయత్తదృక్కులు వానికి తరణోపాయము చూపఁగల్గెను. "మన 'రాజా' మహో న్నతాధ్యాత్మికశక్తికి పెన్నిధి"యని వివేకానందస్వామియే వక్కాణించెను. ఇరువురును ఈశ్వరకోటిలోని వారనియు, నిత్యసిద్ధులనియు, తన యాంతరంగికు లనియు గురు దేవుఁడు ప్రవచించెను 1902-వ సంవత్సరారంభమున వివేకానందుఁడు బ్రహ్మానందుని శ్రీ రామకృష్ణమఠసేనా సంఘ (Sri Ramakrishna Math and Mission) సర్వాధ్యక్షు నొనరించెను.

నలువది యేండ్లైనను నిండకమునుపే దైవవశమున 1902-వ సంవత్సరమున వివేకానందస్వామి పరమపదింప, సంస్థనిర్వహణభారమంతయు బ్రహ్మానందస్వామియే వహింపసాగెను. అంతకు ముందుగనే కలకత్తాలోని బేలూరులో ప్రధానమఠమును, మద్రాసున నొకమఠమును, హిమాలయములలో మఱియొకటియు నెలకొల్పఁబడెను. అమెరికాలో న్యూయార్క్, శాన్‌ఫ్రాన్సిస్కోలలో వేదాంత కేంద్రములు వెలసెను.

భవననిర్మాణమున, క్షామనివారణాది సేవాసంఘకార్య నిర్వహణమున, విద్యావిధావమున, గ్రంథప్రకటనమున, అది యిది యననేల, సర్వకార్యములందును మహారాజు పదుపదేశము లొసఁగుచుఁ దనశక్తిసామర్థ్యములను బ్రకటించసాగెను. మఠసేవాసంఘకార్యదర్శియు మహారాజు సోదరశిష్యుఁడును అగు శారదానందస్వామి ఆతనియభిప్రాయములను శిరసావహించువాఁడు. సేవాసంస్థలలోఁ బేరుపొందిన కాశీయందలి రామకృష్ణసేవాసంఘనిలయమునకు మహారాజు మూలశిలాస్థాపన మొనర్చెను; బెంగుళూరున శ్రీ రామకృష్ణాశ్రమమునకు ప్రారంభోత్సవము జరిపెను. అచటి పూజామందిరమునకు హరిజనులను నిమ్నజాతివారును వచ్చుట గని హర్షించి, స్వయముగా హరిజనులగూడెమునకు వెడలి వారిని ప్రోత్సహించి యాశీర్వదించెను.

కేరళదేశమందలి తిరువనంతపురమునను, ఒరిస్సాలోని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమగు భువనేశ్వరమునను శ్రీరామకృష్ణాశ్రమములకు మహారాజు శంకుస్థాపన మొనర్చెను. 1917-వ సంవత్సరమున చెన్నపట్టణమందలి సుప్రసిద్ధ శ్రీరామకృష్ణసేవాసంఘ విద్యార్థినిలయమునకు నూతనభవన శంకుస్థాపన మొనర్చెను. మహారాజుపర్యవేక్షణప్రోత్సాహములచే దేశములోఁ బలుతావులందు అనేకవైద్యశాలలు, సేవాశ్రమములు, శాశ్వతధార్మికసంస్థలును ప్రతిష్ఠితమైనవి.

ఈమహాకార్యముల నడుమ మహారాజు తీర్థయాత్రల కేఁగుచు, అందందు మహాతపమొనర్చుచు, దేవతాదర్శన మొనరించుచు, అశ్రుధారలతో దేహస్మృతిరహితుఁడై న నిదర్శనము లెన్నియో కలవు. శిష్యుల నాతఁ డిట్లు హెచ్చరించును: "భగవత్సాక్షాత్కారమే జీవితపరమోద్దేశ్యము. ఆనందసాగరనిమగ్నులై అమృతస్వరూపులు కండు. భక్తి జ్ఞానముల నొంది మానవులయందలి మాధవుని సేవింపుఁడు. కర్మము జీవితపరమావధి కాదు; నిష్కామకర్మము భక్తి సాధనము....కర్మ మొనర్పుఁడు, తోడ్తోడనే ఉపాసన సాగింపుఁడు."

శిష్యులను, ఉపదేశార్థులను అనేకసంవత్సరములు శోధించిన పిమ్మటఁ గాని స్వామి వారలకు ఉపదేశించువాఁడు కాఁడు. కాని కాలక్రమమున నాతఁడు మహోదారహృదయముతో అర్థితుల కనేకులకు మంత్రోపదేశముచేయుచు, అనేకులను శిష్యులుగా స్వీకరింపసాగెను. స్వప్నమునఁ గొందఱు మహారాజువలన మంత్రదీక్ష నొందువారు.

మహారాజు సర్వదా అఖండధైర్యసంపన్నుఁడు. ఒకప్పుడు ఱంకెలువేయుచుఁ బరుగెత్తుకొనివచ్చు నొకపిచ్చియెద్దును, మఱియొకప్పు డొకపెద్దపులియు గంభీరముగా నిలిచియుండిన మహారాజును సమీపించి తొలఁగిపోయిన వేఁట!

సహజముగా గంభీరవదనుఁడయ్యు, మహారాజు హాస్య రసప్రియుఁడు. శ్రీరామకృష్ణుని మానసపుత్రుఁడగు నీతఁడును గురుదేవునివలెనే సమాధిస్థితినుండి బాహ్యప్రజ్ఞ నొందునపు డీతనియందలి హాస్యరసము ప్రదీప్తమై గోచరించెడిది. కన్నులు మూసికొని ధ్యానించు శిష్యునిచెంతఁ గొన్నిఫలములనో, మధురాహారములనో పెట్టించి, యాతఁడు లేచి వానిని గాంచినంతనే, "సరి, నాయనా! నీతపఃఫలములు సిద్ధించినవా?" అని మహారాజు చమత్కరించును. ఇటు లాతఁడు హాస్యరసముతో రంగరించి వేదాంత బోధ చేయును.

దీనజనసేవాతత్పరుఁడును తనసోదరశిష్యుఁడును అగు శ్రీ అఖండానందస్వామితో మహారాజు ఒకప్పు డొకమంచి 'తమాషా' చేసెను. తనను బేలూరుమఠమున నుతికొన్నాళ్ళుండుమని మహారాజు చెప్పినను, తన యాశ్రమమునకు వెళ్ళక తప్పదనిన అఖండానందునితో మహారాజు, 'సరిలే!' యని వేకువజామున అతనిని స్టేషనునకు పల్లకీ నెక్కించి తీసికొనివెళ్ళుటకై కొందఱు బోయీల నేర్పఱచి, వారి చెవిలో రహస్యముగా నేమియో చెప్పెను. బోయీలు తమ 'ఓం బాయి' నినాదములతో తెల్లవారుపర్యంతము తెరల మఱుఁగున నున్న అఖండానందస్వామిని బేలూరుమఠావరణముచుట్టును త్రిప్పిత్రిప్పి, సూర్యోదయమునకు మఠము ముంగిట పల్లకీ దింపిరి! ఎదుట వెంటనే మహారాజు కళల

ప్రశ్నలతో ప్రత్యక్షము కాఁగా సోదరశిష్యు లిరువురును ఆలింగన మొనర్చుకొని పసిబాలకులవలె నవ్వుకొనిరి!

ఇటు లొకవైపున హాస్యచతురుఁడై యుండియు మఱి యొకవైపున మహారాజు బాహ్యప్రజ్ఞావస్థలో సైతము దివ్య దర్శనములను గాంచఁగల్గునంతటి భగవద్భావప్రపూర్ణుఁడై యుండెను. శ్రీ రామకృష్ణ శిష్యుఁడగు శ్రీ విజ్ఞానానంద స్వామి మహారాజునుగూర్చియు అతని దివ్యదర్శనములను గూర్చియు నిట్లు వచించెను: "దేవతలు పురాణకల్పితులు కారు; వా రుండుట వాస్తవము. ఏకమై యొప్పు భగవానుని యనేకాంశములే, అనేక కళలే దేవతాస్వరూపములను దాల్చుచున్నవి. మహారాజు దేవతలను గాంచి వారితో సంభాషించెడివారు, కావున నా కీ విషయము తెలియును."

"చక్కఁగాఁ బండి తీయనిరసముతో నిండియుండియు, పైకి ఆకుపచ్చఁగనే కాన్పించు నొకజాతి మామిడిపండు వంటివాఁడు రాఖాల్" అని శ్రీ రామకృష్ణుఁడు పలుకును.

అవసానసమయమునకుఁ గొన్నిదినములకు ముందు మహారాజు తీవ్రవ్యాధిగ్రస్తుఁడై యుండినను, అతని వద నము దివ్యతేజోమయమై దీపించెడిది. సందర్శింపవచ్చిన

భక్తులను, శిష్యులను ఎల్లరను సన్నిధికిఁ బిలిచి ప్రతి వ్యక్తిని ఆశీర్వదించుచు, ప్రతివారితోడను ఒక్కొక్క దివ్యప్రేమమయవాక్కు పలికెను. తన దివ్యానుభవములను ఇఁక దాఁచక, తన యలౌకిక దర్శనములను ఆ యోగీంద్రుఁడు వర్ణింపసాగెను. ప్రశాంతముగా నిట్లు పలికెను: "ఆహా! బ్రహ్మానందసాగరము! ఓం! పరబ్రహ్మమునకు నా ప్రణామములు! ఓం! పరమాత్మునకు నా ప్రణామములు!"

ఏ గోపాలకృష్ణునకుఁ దా నొకానొక పూర్వజన్మమున నెచ్చెలియో, అట్టి గోపాలకృష్ణ దివ్యదర్శనముల నొందుచు, వానిని బ్రహ్మానందస్వామి కన్నులకుఁ గట్టినట్లు వర్ణింప సాగెను. అతఁ డిట్లు పలికెను: "....బాలకృష్ణునితో నృత్యము చేయఁగోరుచున్నాను. నా క్రీడ యిపుడు సమాప్తమైనది. చూడుఁడు! అదిగో, బాలకృష్ణుఁడు నన్ను బుజ్జగించుచున్నాఁడు! తనతో నన్ను రమ్ము, రమ్మని పిలుచు చున్నాఁడు! వచ్చుచున్నా నోయి!...."

1922-వ సం॥ ఏప్రిల్, పదియవ తేదీ సాయంకాలమున బ్రహ్మానందస్వామి బ్రహ్మానందసాగరమున విలీనమయ్యెను. కలకత్తా, బేలూరు మఠాలయావరణమున స్వామి శరీరమునకు అంత్యక్రియలు జరుపఁబడెను. అచటనే బ్రహ్మ

నంద మందిరమను నొక దివ్యాలయము వెలసియున్నది. అందు స్వామి ధ్యానస్థితుఁడై యున్నట్లు చలువరాతి విగ్రహము సుప్రతిష్ఠితమై యలరారుచున్నది.

అమెరికాయందలి దక్షిణ కాలిఫోర్నియాలో వేదాంత సంఘాధ్యక్షుఁడైన శ్రీ ప్రభవానందస్వామితో శ్రీ రామకృష్ణ శిష్యుఁడగు శ్రీ శివానందస్వామి శ్రీ బ్రహ్మానందస్వామి మహత్త్వమునుగూర్చి పలికిన యీ క్రిందివాక్కులు చిరస్మరణీయములు: “నీవు భగవత్పుత్రుని సందర్శించియున్నాననుమాట మఱవకుము. భగవంతునిఁ గాంచియున్నావని గ్రహింపుము.”

# బ్రహ్మానందబోధనలు

## ౧

## రత్నాల వర్తకునికే రత్నము విలువ తెలియఁగలదు *

శ్రీరామకృష్ణ జన్మదిన బహిరంగోత్సవము నకు మఱునాఁడు, అది 1916-వ సంవత్సరము, మార్చి నెల, 14-వ తేది సాయంకాలము. ప్రాచీన బేలూరుమఠభవనమున గంగానది కభిముఖముగా నున్న వసారాయందలి బెంచిపై శ్రీ రామకృష్ణశిష్యులగు శ్రీ ప్రేమానంద స్వామియు శ్రీ అఖండానందస్వామియు నాసీనులై యుండిరి. సమీపమున నున్న మఱియొక బెంచిపై నితర శిష్యులును బ్రహ్మచారులును అనేకులు గూర్చుండియుండిరి. ఆ బృందమును

* శ్రీ ఓంకారేశ్వరానందస్వామి వ్రాసియున్నదాని ననుసరించి యీ ప్రకరణము క్రోడీకరింపఁబడియున్నది.

నందలి అచలానందస్వామి శ్రీ ప్రేమానంద స్వామి కిట్లు విన్నవించెను :

"స్వామీ! శ్రీ గురుదేవుని (శ్రీరామ కృష్ణుని) గూర్చి తాము మాకేదైనను సెల వీయవలయునని నా ప్రార్థన. ఆయనను గూర్చియు ఆయన యుపదేశములనుగూర్చియు కథామృత మునఁ (Gospel of Sri Ramakrishna) జదువుట కంటెను తమముఖతః ఆలకించుట మాకు విశే షాత్సాహోద్ధారకము, మఱియు దివ్య ప్రేరణ జనకము."

అంతట శ్రీ ప్రేమానందస్వామి యిట్లు చెప్పసాగెను : "శ్రీ గురుదేవుని యుపదేశ ములు బహు అల్పముగమాత్రమే కథామృత మున వ్రాయబడియున్నవి. అందును పునరుక్తి విశేషము. అప్పుడప్పుడు 'మ.' శ్రీ గురు దేవుని సందర్శించుచు, తాము వినినరీతిని వ్రాసి కొనుచుండువారు. కాని శ్రీరామకృష్ణులు మరియొకరీతిని, తమ శిష్యుల మనస్తత్త్వము లనుబట్టియు వారివారి విభిన్నగ్రహణ శక్తి

సామర్థ్యములను బట్టియు బోధించువారు. తమ యతిశిష్యుల కాయన ఏకాంతముగ తత్త్వ బోధ లొనరించిరి. గృహస్థశిష్యులు గదినుండి వెళ్ళినంతనే ఆయన లేచి, తలుపు గడియవేసి, త్యాగవైరాగ్యములను గూర్చి మాకు ఉజ్జ్వల వాక్కులతో బోధించువారు. విషయభోగములు తుచ్ఛములనియు హేయములనియు మా లేత మనస్సున నాటుకొనునట్లు ఆయన యుపదేశింప బూనును. సంసార మెంతటి నిస్సారమో, మరు భూమివలె తాపభూయిష్ఠమో, ఎండమావుల వలె భ్రాంతి సంతాపజనకమై దప్పికనుమాత్ర మెట్లు తీర్పఁజాలకుండునో తన కృపావిశేషమున నాతఁడు మాకు విశదీకరించును. నికృష్ట శారీర సుఖముల వెంట మా మనస్సు పరుగులెత్తకుండు టకుఁగాను నెత్తురు, మాంసము, ఎముకలు, మల మూత్రములు మున్నగువానితోఁ గూడుకొని యున్న మానవశరీరముయొక్క తత్త్వమెట్టిదో వివేచించు విధానమును ఆతఁడు మాకు బోధిం చును. జగత్తునంతయు మోహింపఁజేయుచున్న మహా మాయా ప్రభావమునుగూర్చి తెలుపుచు,

మానవుఁడు తన దివ్యత్వమును మఱచి, "పునరపిమరణం పునరపి జననమ్" అను నటుల బడేపదే మాయాజాలమున నెట్లుపడిపోవుచున్నాఁడో ఘూకు వివరించును. ప్రాపంచిక భోగములకై మతిమాలిన యీ ప్రాఁకులాటలో, ఈ యుబలాటనములో సుఖాభాసయు రసాభాసయు నే కాని మఱేమియు లేదని నరుఁడు తన హృదయాంతరాళమున గ్రహించియే యుండును. ఐననేమి? ముట్టెనుండి బొడబొడ రక్తము కాఱుచున్నను ముండ్లతుప్పలను దినుట మానని లొట్టిపిట్టవలెఁ దానెంతటి బాధపడుచున్నను గూడ విషయభోగముల కోసమెగఁబడుచునే యుండును. తన కామసంతృప్తి నిమిత్తము నరునకు కనకము కావలయును. కామకాంచనములు! జగత్తనఁగా నింతకంటె నేమున్నది? సంసారకూపములోనికి మానవుని లాగివేయునవి కామకాంచనపాశములే కదా ? ఈ పాశముల నెవ్వఁడు విడుల్చివైచుకొనునో వాఁడేఁ ఉత్తీర్ణుఁ డగుచున్నాఁడు. తన వర్తనముననే కాక, భావమునందు సైతము కామము నెవ్వఁడు విసర్జించునో వాఁడే సమస్త

ప్రాపంచిక సుఖత్యాగి. వాఁడే నిజమైన విరాగి. సన్న్యాసి. కాషాయ వస్త్రధారణమునఁ గాని, మత్స్యమాంసాది విసర్జనమునఁగాని సన్న్యాసము ఇమిడియుండునట్టిది కాదు.

"విభిన్న సంప్రదాయముల వారగు సాధకులు దక్షిణేశ్వరమున శ్రీ గురుదేవుని సందర్శింప వచ్చుచు, ఆయనతో సంభాషించి వారెల్లరును మహాసంతృప్తి నందుచుండువారు. ప్రతివాని కిని వాని ప్రత్యేకమార్గముననే ముందడుగాయన సూచింపఁగల్గుచుండుటయుఁ బ్రతివ్యక్తియుఁ దన ప్రత్యేక సంప్రదాయమున శ్రీ గురుదేవుఁడు సిద్ధుఁడని భావించుచుండువాఁడు. శ్రీ రామ కృష్ణుని ఆశయములు ఆకసమంతటి విశాలమును సాగరమంతటి గంభీరము ననియు నాతనికి వివిధ సంప్రదాయములును మార్గములును అన్నియుఁ గొట్టినపిండి యనియు వారెఱుఁగరైరి. వాని నన్నిఁటిని ఒకటి వెంబడి నొకటిగా నవలంబించి యాయన ప్రతిమార్గమూలముగను ఒకే గమ్యముసు బ్రాపించియుండెఁగదా ?

## రత్నాల వర్తకునికే రత్నము విలువ తెలియఁగలదు

"భగవత్ సాక్షాత్కారమే జీవిత పరమార్థమను విషయము నెన్నఁడును మఱవకుఁడు. ఆ పరమగమ్యమును బ్రాపించుటకే మీరు సంసారమును త్యజించియున్నారు. ప్రేమవికాసమును భక్తివికాసమును గాంచుటకై తీవ్ర ప్రయత్న మొనర్పుఁడు. భగవంతుఁడు మన ప్రాణములకు ప్రాణము, మన యాత్మకు ఆత్మ ఆతఁడు మన హృదయేశ్వరుఁడు, మనకు అత్యంతాప్తుఁడు. అనురక్తహృదయులై భగవంతుని కోసము పరితపింపుఁడు. భగవదవతారమూర్తికి అంతరంగకోటిలోనివారును అనుచరులునగు శ్రీ బ్రహ్మానందస్వామి మున్నగు నిత్యసిద్ధుల సంసర్గ సంసేవనముల నెడి మహాభాగ్యము నందియున్న మీ రెంతటి ధన్యాత్ములు! ఈ సదవకాశమును జాఱవిడువకుఁడు. మీరు పౌరుషోపేతులు! దేవతలు కండు! మీ జీవితముల నితరులకు ఒజ్జబంతులుగా నొనర్పుఁడు!"

ఇట్లని శ్రీ ప్రేమానందస్వామి కొంచెము సేపూరకుండి మరల నిట్లు వచింపసాగెను :

"మేము గతించిన పిమ్మట జనులు తండోపతండ ములుగా ఉపదేశార్థము యువకులగు మీ యొద్దకు వత్తురని నాకు విస్పష్టముగా గోచరించు చున్నది."

ఒక యువసన్న్యాసి : "కాని, స్వామీ, అదెటు సంభవము? తండోపతండములుగా జనులు రావలసియున్న పక్షమున, మీ జీవిత కాలముననే రావలయును."

శ్రీ ప్రేమానందస్వామి యిట్లు సమాధానిం చెను : "మాకంటె నీవు తక్కువవాఁడ వనుకొనఁ బోకుము! నీవు శ్రీ మాతృదేవి యనుగ్రహము నందియున్నావు. జనులు మా పాదధూళినిఁ గైకొన వచ్చుచున్నంత మాత్రమున మేము ఘనులమైతి మని భావించుచుంటివా? కాము! మొదట మేము శ్రీ రామకృష్ణునిఁ గాంచితిమి, పిమ్మట సంసారమును విడనాడితిమి; ఆయనను జూడ కుండఁగనే సంసారమును త్యజించిన నీవే నిజ ముగా ఘనుఁడవు."

యువసన్యాసి: "కాని స్వామి, శ్రీరామ కృష్ణులు మిమ్ము ఘనుల నొనర్చియున్నారు."

శ్రీ ప్రేమానందస్వామి : "కాదు! నాయనా! శ్రీరామకృష్ణులు మమ్ము ఘనులను జేయలేదు. ఆయన మమ్ము 'అనామ'కులను జేసినారు. మీరును 'అనామకులు' గావలసియున్నది. అభిమానమును అహంకారమును మీ మనఃఫలకమునుండి తుడిచివేసికొనుఁడు. 'అహంకారము అంతరించినంతనే అన్ని బాధలును తుదముట్టును' అని శ్రీరామకృష్ణులు వచించువారు. 'నేను గాను, నేను గాను, ప్రభూ! సర్వమును నీవే.' నాగమహాశయుని జీవితమును దిలకింపుఁడు! ఆయనయందహంకారము లవలేశమును లేదయ్యె. గిరీశచంద్రఘోషు మహాశయు లిట్లు అనుచుండువారు : 'మహామాయ తన జాలమున నాగమహాశయుని, వివేకానందుని బంధింపఁబూనెను ; కాని నాగమహాశయుఁడు (పరమ నైచ్యానుసంధానమున) పరమాణు వు కంటెను పరమాణువై మాయాజాలమునఁ బట్టువడఁడయ్యె; ఇఁక వివే

కానందుఁడో, (సర్వాత్మభావమున) మహాత్త్రకంటెను మహత్తరమగు పర్యంతము అఖండాత్మస్వరూపమే తానగుపర్యంతము పెరిగిన కతన మహామాయ యాతనిఁ దనవలలో వైచుకొనఁ జాలకపోయెను.'

"ఈ మాయాజాలము దేనితోఁ గూడుకొని యున్నదో మీకుఁ దెలియునా ? శబ్దస్పర్శాదులు, కామకాంచనములు, పేరుప్రతిష్ఠలు, అహంకార మమకారములు—ఇత్యాదులతో, వీని యన్నిటితోడను మాయ మానవుని బంధించుచున్నది. ఈ మాయాజాలమునుండి వెలువడుఁడు ; వెలువడితిరా, మనస్సు తిన్నగా భగవత్పాదపద్మములపైఁ బ్రాలును. 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' అనునటుల సమస్త బంధమోక్షములును మనస్సుననే యున్నవి.

"లౌకికుఁడు విషయసుఖములచే, పేరుప్రతిష్ఠలచే, కామకాంచనములచే వ్యామోహితుఁడై యున్నాడు, సాంసారిక భోగసురాపానమత్తుఁడై యున్నాడు. మీరును మత్తులగుఁడు, నిష్కామ

కర్మాచరణానందముచే, భగవత్ప్రేమామృతా
స్వాదనముచే, భక్తిపారవశ్యముచే, సమాధి
సంజనిత బ్రహ్మానందముచే మత్తులగుఁడు!"

ఇంతలో శ్రీ బ్రహ్మానందస్వామి వచ్చి
శ్రీ ప్రేమానందస్వామి సరసను నిశ్శ
బ్దముగాఁ గూర్చుండెను: శ్రీశివానందస్వామి
వచ్చి వారికెదురుగానున్న యొక బెంచిపై నాసీను
డయ్యెను. యువసన్న్యాసులును బ్రహ్మచారు
లును ఇంచుమించుగా అఱువదిమంది వచ్చి
స్వాములచుట్టును ఉపవిష్టులైరి. శ్రీ రామకృష్ణ
మానసపుత్త్రుఁడును ఆతని కత్యంతాప్తుఁడునునగు
శ్రీ బ్రహ్మానందస్వామి సాన్నిధ్యమున నేమి, శ్రీ
రామకృష్ణునకు అంతరంగకోటిలోని వారగు
శ్రీ ప్రేమానంద శివానందస్వాముల సాన్నిధ్య
మున నేమి, ఎల్లరమానసములును దివ్యానంద
సంభరితము లయ్యెను, ఎల్లరును పారమార్థిక
చింతానిమగ్నులైరి. సమస్తప్రకృతియు నిశ్శ
బ్దమై యున్నట్లు తోఁప, వారల హృదయ
సీమలందు ప్రశాంతి రాజ్యమేలుచుండ, సమీప

మున గంగానది తన దివ్యతోయములతో మెల్లగాఁ బాఱుచుండెను.

కాల మెట్లు కడచుచుండెనో తెలియని యా మహా నిశ్శబ్దతను గొంతసే పైనపిమ్మట జగన్నాథమునందలి సుప్రసిద్ధశంకరమఠమును గూర్చియు నందలి సాధువులనుగూర్చియు సమావేశమున నొక జిజ్ఞాస వెలువడియెను. అంతట గోష్ఠి యొక విషయమునుండి మఱియొక విషయమునకు బ్రాఁక, శ్రీ బ్రహ్మానందస్వామి యిట్లు వచింపసాగెను : "నేనొకప్పుడు జగన్నాథమున నుండగా, రంగస్వామి యను నొక సాధువును గలిసికొంటిని. ఆతఁడు తొంబది యైదేండ్ల వృద్ధుఁడు, మహావిరాగి. సదా భగవద్భక్తిపరవశుఁడై యుండువాఁడు. ఆలయమున మొదట భగవంతునకు నివేదింపబడిననేకాని యాతఁ డే యాహారమును గ్రహించువాఁడు కాఁడు. ఒకప్పు డాతఁడు తీవ్రవ్యాధిగ్రస్తుఁడై యుండ నే నాతని కొక యౌషధము నీయఁబూనితిని, కాని యాతఁడు స్వీకరింపఁడే! ఆతని యాచారమును గ్రహించి

యుండిన నేను గొంచెము పాలు జగన్నాథునకు నై వేద్య మొనర్చునట్లు ఆలయార్చకునితో నేర్పాటుచేసి యాపాలలో ఔషధముఁ గలిపి తిని ; రంగస్వామి యా పాలను భగవత్ప్రసాద ముగా స్వీకరించెను.''

మతప్రచారకుఁడును ప్రసిద్ధరచయితయు నగు నొకా నొక వ్యక్తినిఁగూర్చి ప్రసంగము వెలు వడియెను. అంతట శ్రీ శివానందస్వామి యిట్లు వచింపసాగెను :

"కాని సాంసారిక చింతానిమగ్నుఁడై యున్న యాతఁడు మతమునుగూర్చి — పరమార్థమును గూర్చి-యేమి గ్రహింపఁగలఁడు ? త్యాగవైరా గ్యములకు ఆలవాలమగునట్టి జీవితము గడపని వాఁడు ఉపదేశకుఁడు గాఁజాలఁడు. వైరాగ్యము- సంగరాహిత్యము—పారమార్థిక జీవన ప్రథమ నియమము. పాండిత్యము గలవాఁడు పుస్తక ములు వ్రాయుఁగాక, లేక ఉపన్యాసము లిచ్చుఁ గాక, కాని హృదయమున వైరాగ్యము లేనిదే, తాను జేయు నుపదేశములను స్వయముగా అవ

లంబింపనిదే, వాని వాక్కులు నిష్ప్రయోజనము లై పోవును. ఏలన, ఆ వాక్కులు శక్తిహీన ములు, వానివలన జనులకుఁ గలుగు నావేశము తాటియాకుమంటవలె రప్పున లేచి చప్పునఁ జల్లారిపోవును.

"కొలఁదిమందిమాత్రమే బ్రాహ్మసమాజము నకు వచ్చుచుండ, అనేకులు బేలూరుమఠమునకు వెళ్లుచున్నారని బ్రాహ్మసమాజ ప్రచారకుఁ డొకఁడు మొఱలిడుచుండినట్లును, జనుల నాక ర్షించుటకుఁ గాను యువతులగు పాటకురాండ్ర మేళమును దమ సమాజమున నేర్పాటుచేయుట మంచిదని యందుమీఁదట నొకవ్యక్తి సూచించి నట్లును మొన్న నేను వినియుంటిని. శ్రీశివనాథ శాస్త్రి మహాశయుఁ డీసంగతి విని, బ్రాహ్మ సామాజికులు మఱింతగా బేలూరుమఠ సన్న్యా సుల త్యాగవైరాగ్యములను తమ జీవితములకు అనువర్తింపఁజేసికొనినచో, వారును జనుల నాక ర్షింతురని పలికెనఁట."

శ్రీ బ్రహ్మానందస్వామి : శివనాథశాస్త్రి మహాశయుఁడు నిష్కపటహృదయుఁడు, సత్య

సంధుఁడు, నిజమైన ముముక్షువు. ఇపుడు భువనేశ్వరమున నివసించుచు నియమనిష్ఠల నవలంబించుచున్నాఁడు. ఆత్మప్రబోధము కొంత యీవఱకే కలిగినది. ఏమైనను శ్రీరామకృష్ణదేవ సంసర్గభాగ్యము నొందియున్న వ్యక్తి గదా! బ్రాహ్మసమాజమున మఱియొక మహానాయకుఁడు శ్రీ విజయ (కృష్ణ) గోస్వామి. ఆయన విడనాడుటచే ఆ సమాజమునకు గొప్ప నష్టము వాటిల్లినది.

శ్రీ శివానందస్వామి : "ఒకనాఁడు స్వామిజీ, (శ్రీవివేకానందస్వామి) అఖండానందస్వామియు నేనును గంగానదిపైఁ బయనించుచుంటిమి. స్వామిజీ మహర్షి దేవేంద్రనాథ ఠాకూరును గూర్చి విశేష ప్రశంసాపూర్వకముగా ముచ్చటించుచుండిరి. అంతలో అకస్మాత్తుగా మహర్షి యొక్క నావ మాకుఁ గొంతదూరమున గోచరించినది. గౌరవసూచనార్థము మే మాయనను సమీపించితిమి. మేము శ్రీ రామకృష్ణదేవుని శిష్యులమని కనుఁగొనినంతనే పట్టరాని యానంద

మున ఆయన పదేపదే యిట్లు పలుకసాగిరి: 'ఆహా! శ్రీ రామకృష్ణదేవుని ప్రేమ యెంతటి మహత్తరము! ఏమి యఖండభక్తి!' అంతట మహర్షి యుపనిషత్తులనుండి కొన్ని ఘట్టములను బఠింపుడని స్వామిజీనిఁ గోర, స్వామిజీ పఠించిరి. కొంతసేపు విని యాయన యిట్లనిరి: 'ఉపనిషత్తులలోని భక్తి ఘట్టములు నాకు అవగాహనమగును, నేను వానిని గొనియాడెదను; అద్వైత భావములతో నాకు నిమిత్తములేదు.'"

చర్చలను గొంతసేపు వినినపిమ్మట శ్రీ ప్రేమానందస్వామి యిట్లు పలికెను: "శివనాథశాస్త్రి మహాశయుఁడు గాని, బ్రాహ్మసమాజమునందలి విద్యాధికులగు నిరంతర సభ్యులు గాని శ్రీ గురుదేవుని సందర్శింపవచ్చునపు డాయన కేవలము పసిపిల్ల వానివలె నొక్కొ-కప్పు డిట్లు అడుగుచుండువారు: 'నాస్థితి నిజముగా మతిపోయినవాని స్థితివంటిదా? భగవచ్చింతచే నేను పిచ్చివాఁడనై పోతినా?' గురుదేవుఁ డొక పిచ్చివాఁడని నిజముగా భావించినవారు కొందఱు లేకపోలేదు!"

## 16 రత్నాల వర్తకునికే రత్నము విలువ తెలియఁగలదు

శ్రీ బ్రహ్మానందస్వామి : "రత్నాల వర్తకునికే రత్నము విలువ తెలియఁగలదు. ఒకప్పు డొక పేదవాని కొక రత్నము దొరకెను. దాని విలువ తనకుఁ దెలియక పోవుటచే ఆతఁడు వెల నిశ్చయించుకొనుటకై దానిని కూరలబజారునకుఁ దీసికొని వెళ్ళెను. కూరగాయల వర్తకుఁడు దానిని జూచి, 'దీనికిమ్మత్తుగా ఐదుకానుల వంకాయల నిచ్చెద'ననెను. కాని పేదవాఁడు దాని విలువ మైదణాలై యుండునని యూహించి, 'మైదణాల వంకాయల నిచ్చెదవా?' యనెను. కూరల వర్తకుఁడు నిరాకరింప దాని నాతఁడు బియ్యపు వర్తకునియొద్దకుఁ దీసికొని వెళ్లఁగా, ఆతఁ డొక బస్తాబియ్య మిచ్చెదననెను; కాని పేదవాఁడు నాలుగు బస్తాలు కోరెను. అనంతర మాతఁ డొక కంసాలియొద్దకు వెళ్లఁగా, కంసాలి వందరూపాముల నిచ్చెదననెను. ఈ మదింపు పేదవానికి మఱింత యాశ పుట్టింప నాతఁ డా రత్నము ౹జముగా విలుగలదని గ్రహింప నారంభించుటచే దాని నొక రత్నాల వర్తకునియొద్దకుఁ దీసికొని వెళ్ళెను. రత్నాలవర్తకుఁ డిరువదివేల రూపా

యల నిచ్చెదననెను, గాని యదియుఁ దనకు సంతృప్తికరము గాకుండుటచేఁ బేదవాఁడు దాని నా పట్టణమందలి పేరు మోసిన రత్నాల వర్తకునియొద్దకుఁ గైకొని వెళ్లెను. ఆతఁడు దానిని జూచినంతనే దాని నిజమైన విలువ కనుఁగొని వెంటనే పదిలక్షల రూపాయల నిచ్చెదననెను. సంగతి సందర్భము లీ విధముగా నుండును. సాధుసత్తముని యోగ్యతను నిర్ణయించుటనిన మాటలా? అది దానిని గ్రహించువాని యోగ్యతను శక్తిసామర్థ్యములను బట్టి యుండును. కొందఱిచే శ్రీ రామకృష్ణులు సాధు సత్తములు గను మఱికొందఱిచేఁ బిచ్చివాఁడుగను బరిగణింపఁబడిరి. కాని యెఱుకగలవారు ఆయనను సాక్షాద్భగవదవతారమూర్తిగా గ్రహించిరి."

## భగవంతునికోసము పరితపించితివా, తప్పక నీకాతఁడు కానవచ్చును

శిష్యుఁడు : స్వామీ! శ్రీ రామకృష్ణదేవులు లోకులను గూర్చి యెట్లు భావించువారు? ఆయ ననుగూర్చి మాకుఁ గొంత తెలుపవలయునని మా ప్రార్థన.

స్వామి : శ్రీ గురుదేవులు సర్వభూతములను భగవత్స్వరూపములుగఁ గాంచువారు. శిష్యుల యెడ ఆయన అపారప్రేమను గాంచి స్వామిజీ (వివేకానందస్వామి) ఒకప్పు డాయనతో నిట్లనిరి : "మీరు మమ్మందఱను ఇంతగాఁ బ్రేమించుచుందురుగదా? ఇట్టి ప్రేమపాశము వలన మీకును జడభరతుని గతియే కలుగుట సంభవింపదా?"* గురుదేవు లిట్లు సమాధా

---

* జడభరతుఁడు పూర్వజన్మమున రాజై యుండఁదన పెంపుడు లేడియెడ ప్రేమపాశబద్ధుఁడై మఱు జన్మమున స్వయముగా లేడియై పుట్టెనను భాగవతకథ యిందు సూచితము. 'యద్భావం తద్భవతి – ఎట్లు భావింతువో అట్లగుదు'వనియు దేనియందును మమకారము కూడదనియు గ్రాహ్యము.

నించిరి : నిజమే, ప్రాకృతవిషయములను గూర్చి-ఐహిక విషయములనుగూర్చి - చింతాసక్తుఁడగు వానికి అట్టి గతియే కలుగును. కాని మీలో నున్న నారాయణుని నేను ప్రేమించుచున్నానని మీరు గ్రహింపవలసియున్నది. మీలో నెవరి యందుఁ గానిండు, పురుషుఁడనియో, స్త్రీ యనియో నే నెన్నఁడైనను ఆసక్తుఁడ నగుచున్న పక్షమున, మీ గొడవ పూర్తిగా వెంటనే విసర్జింతును.'' శ్రీరామకృష్ణుఁడు తన బాలశిష్యులకు సన్న్యాసబోధలు తలకెక్కించుచుండె నని లోకులాయననుగూర్చి తఱచు లేనిపోని విమర్శలు చేయుచుండ, అట్టి విమర్శలు తమ చెవినిఁ బడునెడ, ఆయన యిట్లు సమాధానించువారు : "ఎవరైనను సంసారులై యుండుటకు నా కెంత మాత్రము ఆక్షేపము లేదు. అదిగాక సన్న్యాసులు కండనియు, కామకాంచనములను విడిచి పెట్టుఁడనియు అడ్డమైన పురుషులకును స్త్రీలకును నేను జెప్పుట లేదు. కొంత ఆత్మప్రబోధము ఈవఱకే యెవరికిఁ గలిగియుండునో వారికి మాత్రమే సన్న్యాసమును గూర్చి తెలుపుదును.

ఈ యువకులు మొదట వివేకవైరాగ్యముల నల తెలుచుకొని, పిమ్మట, ఇచ్ఛవచ్చినచో, సంసార మునఁ బ్రవేశింపవచ్చునని నాయభిప్రాయము.'' తమయొద్దకు వచ్చుచుండువారి కనేకులకు నిజ ముగా ఆయన యిట్లు చెప్పుచుండువారు : "మొదట సంసారమున దిగి సంసారానుభవము సంపాదించి, సంసారమనిన, ఇఁక మీకు బాధగా నున్నప్పుడు నివారణోపాయమునకై నా వద్దకు రండు.'' సర్వమనస్తత్త్వములకును సరిపడు నట్లా యన బోధలు వేర్వేఱుగా నుండెడివి.

తురీయానందస్వామి కుఱ్ఱవాఁడై యుండగా, కామచింతలను విడనాడు టెట్లని యొకప్పుడు శ్రీ రామకృష్ణదేవు నడిగెను. శ్రీ గురుదేవు లిట్లు సమాధానించిరి: "కామమును విడనాడు టయా? నీవు కామమును విడిచిపెట్ట నేల? విడిచి పెట్టఁబూనుటకుబదులు నీవు ని కామమును వృద్ధి చేసికొనవలసియున్నది!'' ఆయువశిష్యున కీ యుపదేశము వింత గొలిపెను; కాని యాతఁ డేమియు మాటాడ లేదు. గురుదేవు లంతట

నిట్లు వివరించిరి: "నీ కామచింతలను, కామక్రోధా
దుల నన్నింటిని భగవంతునివైపు మరల్పుము."*

---

* "తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభిమానాదికం
తస్మిన్నేవ కరణీయమ్" —నారద భక్తి సూత్రములు, 65

శా. "కామోత్కంఠత గోపికల్ భయమునం
గంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్
సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తి నేము
నిదె చక్రిం గంటి మెక్కైనను
ద్దామధ్యానగరిష్ఠుడైన హరిఁ
జెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"
—శ్రీమదాంధ్రభాగవతము, సప్తమస్కంధము, 16

ఆ. "అలుకనైనఁ జెలిమినైనఁ గామంబున
నైన బాంధవమున నైన భీతి
నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ
జేరవచ్చు వేఱుసేయఁ దతఁడు."
—శ్రీమదాంధ్రభాగవతము, 7-16

తలంచుగా ఆయన తమ్ము సూచించుచు నిట్లు వచించువారు; "దీనిని నీవు ప్రేమించినపక్షమున సర్వము సిద్ధించును. భగవంతునిఁగూర్చి నీ వెంత తీవ్రముగాఁ బరితపింతువో భగవంతుఁ డంత విశేషముగా నీకు వ్యక్తమగుచుండును."

శ్రీ రామకృష్ణుల మనస్తత్త్వమున అనేక తృష్ణలు లిమిడియుండెడివి. జ్ఞానమునుగూర్చి ప్రసంగించినపుడెల్ల శుద్ధ బ్రహ్మజ్ఞానియై ప్రసంగించువారు. ప్రేమను, భక్తినిఁగూర్చి ప్రసంగించునపుడో, శుద్ధప్రేమియై మహాభక్తుఁడై ప్రసంగించువారు. కేవలలౌకికజ్ఞానముః నిస్సారమనియు, మిథ్యాభూతమనియు ఆధ్యాత్మికజ్ఞానమును, భగవత్ప్రేమానురాగములను బడయుటకై మానవుఁడు తీవ్రప్రయత్నమొనర్పఁదగునని యు ఆయన మా మనస్సున బాగుగా నాటుకొనఁ జేసిరి.

శిష్యుఁడు: గురుదేవుని సమాధిస్థితినిఁగూర్చి మాకుఁ గొంత తెలుపఁగోరెదను.

స్వామి: గురుదేవునిసమాధిస్థితు లనేకవిధ ములుగా నుండెడివి. కొన్నిఁటిలో ఆయన శరీరము బిఱ్ఱబిగిసికొనిపోయి ప్రానువలె నిశ్చలముగా నుండెడిది. ఇట్టి సమాధిస్థితినుండి సామాన్యబహిః ప్రజ్ఞను బొందుటాయనకు సులభమైయుండెడిది; కాని సమాధిగాఢమైయుండు నితరసమయము లలో బాహ్యస్మృతి నొందుటకుఁ జాలసేపు పట్టుచుండెడిది. అట్టి సమయములం దాయన లోఁతునీటిలో మునిఁగి పైకి వచ్చు వ్యక్తివలె దీర్ఘనిశ్వాసము నిగుడ్చువారు. అంతఁ గొంత సేపటివఱ కాయన తూలుచు, మద్యపాయివలె వ్యవహరించువారు, అపు డాయన మాటలు సైతము ముద్దమాటలై అస్పష్టముగా నుండెడివి. కాని క్రమముగా సామాన్యస్థితికి వచ్చువారు.

నీవు ప్రచారముచేయునపుడెల్ల, ఉపన్యసించు నపుడెల్ల (శ్రీ) రామకృష్ణదేవుని యుపదేశము లను ఉదాహరించుచుందువు. ఆయనవాక్కులు వేదశాస్త్రములపైఁ దమ దివ్యతేజమును బఱపుచు వాని యంతరార్థమును వెల్లడించుటకుఁ దోడ్పడును.

శ్రీ రామకృష్ణదేవులు కపటము నెంత మాత్రము సహింపఁజాలకుండెడివారు. మనః పూర్వకముగా భగవంతునిఁ బ్రేమించువారనిన, భజించువారనిన, ఆయన కెంతయో ప్రీతి. "హృదయపూర్వకముగా భగవంతు నెవ్వఁడు ప్రార్థించెనో వాఁడు శీఘ్రముగా సమస్తదోష విముక్తుఁడగు"నని ఆయన వచించువారు.

గురుదేవునిరాత్రు లనేకము సమాధిస్థితి యందో, భగవన్నామసంకీర్తనమునఁనో, స్తోత్ర మునసో గడచుచుండెడివి. ఆయన యెన్నఁడో కాని రాత్రి గంటకంటె నెక్కువ నిద్రించువారు కారు. గంటకంటె నెక్కువసేపు సమాధినిమ గ్నులై యుండుట తఱచు కనఁగొనువాఁడను. ఒకొక్కప్పుడు మాతో మాటలాడఁ బ్రయ త్నించువారు; కాని, మాటలు వచ్చెడివికావు. అనంతర మిట్లు వచించువారు: "చూచితిరా, సమాధిస్థితిలో నుండఁగా మీతో మాటలాడఁ గోరెదను; కాని యట్లు చేయఁ బ్రయత్నించునపు డెల్ల నావాగ్బంధనమైనట్లు తోఁచును." సమాధి

స్థితినుండి సామాన్యజాగ్రదవస్థకు వచ్చునెడ, అనేకసమయములలో, ఏ యదృశ్య వ్యక్తి తోడనో సంభాషించునట్లు గానుపించుచుండువారు.

ఆయన యిట్లు అనుచుండువారు: "భగవంతునిఁ గాంచుటకై మీరు వానినిమిత్తము పరితపింపవలయును." ఇట్లని యీ కథ చెప్పెడివారు:

"ఒక సాధకుఁడు తనగురుని సమీపించి, 'భగవత్ప్రాప్తిమార్గము నాకుఁ జూపుఁడు' అని యడిగెను. గురువు శిష్యునిచేయిఁ బట్టుకొని యొక నదియొద్ద కాతనిఁ గొనిపోయి. చల్లగా నాతని తలఁబట్టి నీటముంచి, కొంతసేపటు లుంచెను. కొంత తడవునకుఁ జేయి విడువ, శిష్యుఁడూపిరికై నోరు తెఱచుచు, గిజగిజలాడుచుఁ బైకి వచ్చెను. అంతట విస్మితుఁడై గురువిఁ దిలకింప, గురువు మందహాసమొనర్చుచు నాతని నిట్లడిగెను: 'సరె, నీటిలో నున్నపుడు నీ కెటులుండెను?' 'అయ్యా, చెప్పెడిదేమున్నది? ఊపిరికోసము గిజగిజ కొట్టుకొంటిని!' అని శిష్యుడు

బదులు చెప్పెను. అంతట గురు వాతని కిట్లు బోధించెను: 'మంచిది, ఊపిరికోసము నీ వెట్లు పరితపించితివో అట్లు భగవంతునికోసము పరితపించితివా, తప్పక నీ కాతఁడు కానవచ్చును.''

వివేకానందస్వామి నవయౌవనవంతులై యుండఁగా మొదట శ్రీ రామకృష్ణదేవుని సన్నిధికి వచ్చినప్పుడు ఆయనతోఁ దఱచు వాదించుచుండువారు. స్వామిజీ యపుడు నిరాకారతత్త్వమునమాత్రమే విశ్వాసియై యుండి శ్రీరామకృష్ణుల దివ్యదర్శనములు కేవల మాయన చిత్తవిభ్రాంతులుగా గణించి స్వయముగా ఆయనతో సైత మట్లు చెప్పిరి. దేవతామూర్తులకు ప్రణామమాచరింప భక్తులు ఆలయమునకు వెడలునపుడు వారినిగూడ స్వామిజీ నిందించువారు. గురుదేవుని శిష్యులలో ననేకుల కిది యాగ్రహకారణమయ్యెను; కాని స్వయముగా గురుదేవు లెంత మాత్రము కలఁతనొంద లేదు. ఆయన నరేంద్రునిపై నెన్నఁడును కోపపడనోపకుండిరి.

'నరేన్' (నరేంద్రుఁడు; వివేకానందస్వామి పూర్వనామము నరేంద్రనాథదత్)నకు నరేనే,

సాటి; ఆతనితో నెవ్వరును సరిపోల్పఁదగరు' అని యాయన వచించువారు. అనంతర మాయన స్వామిజీకి భగవానుని సగుణనిర్గుణాంశములం దన్నిఁటను సాక్షాత్కారము గలిగింప, స్వామిజీ కాలాంతరమున నిట్లు వచించువారు: సాకారు నిగాఁగాని, నిరాకారునిగాఁగాని, భగవంతుని నీవెట్లు భావించినను, వానియందే బుద్ధి నిలువుము; భగవన్నిష్ఠుఁడవై యుంటివా, భగవత్ప్రాప్తినొందుదువు!'

శిష్యుఁడు: స్వామీ, శ్రీ రామకృష్ణులను గలిసికొనినవారు భగవత్సాక్షాత్కారమునకై నియమనిష్ఠల నవలంబింప నక్కఱలేదని యనేకుల యభిప్రాయము. ఆయన నెఱిఁగియుండుటయే చాలును. మహాభక్తులగు రామదత్త మహాశయులుకూడ ఈ యభిప్రాయమే కలిగి యుండిరి.

స్వామి: రామదత్తమహాశయుల సంగతి వేఱు. ఆయన కాయనే సాటి. ఆయన నిజమైన విశ్వాసము గల వ్యక్తి. ఆ విశ్వాసము క్రమ

ముగా బలీయమై యావజ్జీవితము ఆయనయందు విలసిల్లెను. ఏ కొలఁదిమందికో, వ్రేళ్ళపై లెక్కింపఁదగినవారికో, అట్టి విశ్వాసముండును. జనసామాన్యవిషయమున అది కేవలము నాలుక చివరిమాట.

శిష్యుఁడు: శ్రీ మాతృదేవిని (శ్రీ శారదా దేవిని) దర్శించినవారును సాధుసేవ చేసినవారును నగు భక్తులు తమ సాధనల నిఁక సాగింప నక్కఱ లేదని తలఁచుచున్నారు.

స్వామి: మాతృదేవిని దర్శించినంతమాత్రమునను సాధుసేవ చేసినంతమాత్రమునను సరి పోదు. వివేకవైరాగ్యముల నవలంబించుటయు ధ్యానపరాయణమగు జీవనము గడుపుటయు అత్యావశ్యకము.

## ౩

# శ్రీ రామకృష్ణవివేకానందవాక్కులు పరస్పరభిన్నములు కావని గ్రహింపుము

స్వామి: భగవద్భక్తిని బడసి సాక్షాత్కారమునందుటయే మానవజీవితపరమోద్దేశ్యము; లేనిచో జీవితము కేవలము నిరర్థకము. వట్టి బూటకము. ఆహారనిద్రాదులు మానవజన్మమునకు పరమలక్ష్యములు కావు, ఇవి కేవలము పశుస్వభావమునకుఁ జెందునట్టివి. మానవశరీరమున భగవానుఁడు విశేషముగా వ్యక్తమగుచుఁ బ్రకాశించుచున్నాఁడు, — ఈ తత్త్వమును గ్రహింపఁబూనుము.

ఆహా! యువకులగు మీరు నియమనిష్ఠల నవలంబించుచు భగవదర్పితజీవితము గడుపుటకు వలయు సదుపాయములను బడయుటకుఁగాను ఈ మఠనిర్మాణమునకై స్వామిజీ (శ్రీవివేకానంద స్వామి) తమ గుండెనెత్తురు ధారపోసిరిగదా! మీజీవితము సులభతరముచేయు తన సంతత ప్రయత్నమున ఆ మహనీయుడు తీవ్రాతితీవ్ర

పరిశ్రమములోనై స్వయముగా తన ఆయుర్దాయ
మును క్షీణింపఁజేసికొనెను గదా! ఆహా! సమస్త
మానవకోటియందును ఆయన కెంతటి యపా
రము, అగాధమునైన ప్రేమ!

స్వామిజీ మూలమున శ్రీ రామకృష్ణుల
తత్వము లోకమునకు వెల్లడియైనది. ఈయుభ
యుల వాక్కులును బోధలును పరస్పరభిన్న
ములు కావని గ్రహింపుము. జనసామాన్యబుద్ధికి
శ్రీ రామకృష్ణుని యౌన్నత్యము అందనిదగు
టచే ఆయన జీవితోపదేశములను వివేకానంద
స్వామి యెల్లరకును అవగాహనమగునటు లొన
రించిరి.

వివేకానందవాఙ్మయమును శ్రద్ధగా పఠింపుము.
ఆయన బోధలను గ్రహింపనిదే శ్రీ రామకృష్ణ
తత్వమును గ్రహింపఁబూనుట నిష్ప్రయోజనము.
ఈయుభయుల యుపదేశములను పఠించుచు,
మననముచేయుచుఁ దోడ్తోడ నేనిష్ఠతో జపధ్యా
నముల నాచరించుచుండుము. ఇపుడు నీవు
యువకుడవు, యౌవనమే జీవితమున ఉత్తమదశ.

శ్రీరామకృష్ణ వివేకానందవాక్కులు-గ్రహింపుము

నీ మనోబుద్ధులు సత్క్రమమార్గమున వర్తించు నట్లు నియమించుకొనుము; మనస్సంయమము చేకూరినంతనే నీవిఁక దేనినిగూర్చియు భయ పడనక్కఱలేకుండును మనస్సు అరికట్టుకొన గలిగితివా, సాధనపథమున విశేషముగా పురో గమించితివన్నమాటయే. మనస్సును పెడదారినిఁ బోవఁ బ్రయత్నించునపుడెల్ల, వివేకమను కొరడా నుపయోగించి దానిని మరలించు చుండుము.

## ౮

# ఆత్మపరీక్ష చేసికొనుము

శిష్యుడు: స్వామీ, నేను సాధనచేయుచున్నాను, కాని నాకు దానిలో (జపతపములలో) రుచి కలుగకున్నది. నేనేమి చేయవలయును?

స్వామి: ఒక్కసారిగా రుచి కలుగుట సాధ్యమా? కాదు. అందులకు తీవ్ర ప్రయత్నము చేయుము. అభిరుచిని సాధించుటకై నీశక్తి సామర్థ్యములనన్నింటిని కేంద్రీకరింపుము. భగవదితరవిషయములందు నీశక్తి సామర్థ్యములను వ్యర్థము చేయకుము. మనఃపూర్వకముగా బూనుకొనుము. ఇతరవిషయముల నెంతమాత్రమును లక్షింపకుము. సాధన సాగింపుము! పురోగమింపుము! నీవు పొందు వికాసముతో ఎన్నఁడును తృప్తిపడియుండకుము. నీలో నీవు తీవ్రమైన—ప్రచండమైన—అసంతృప్తిని గలిగించుకొనఁ బ్రయత్నింపుము. ఇట్లను కొనుము: "నే నేమి వికాసమునొందుచున్నాను? ఏమియు లేదు!" గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) జగజ్జననితో

నిట్లు మొఱలిడువారు : "అమ్మా, మఱియొక దినము గతించినది, కాని నిన్నుఁ గనలేదు !"

సత్కార్యాచరణమున నెంతకాలము విని యోగించితివో, నిరర్థకవిషయములలో నెంత వ్యయించితివో, ధ్యానమున నెంతసేపు గడిపితివో, ప్రాలుమాలికతనమున నెంతవ్యర్థ పుచ్చితివో, పరుండబోవునపుడు ప్రతిరాత్రియుఁ గొంచెము సేపు పర్యాలోచించు కొనుము. ధ్యానావలంబనమున, బ్రహ్మచర్యావలంబనమున మనస్సును దృఢపఱచుకొనుము.

శ్రీమంతులు తమ యిండ్లలో కావలివానిని బెట్టుకొందురు; దొంగలను, పశువులు మొదలగు వానిని ఆవరణములోనికి రానీయకుండుటయే వాని పని. మనస్సే మానవుని కావలివాడు. మనస్సు ఎంతదృఢమైన, అంతమంచిది. మనస్సు 'తంటాలమారిగుఱ్ఱము' వంటిది. అట్టి గుఱ్ఱము తన రౌతును బెడత్రోవను బట్టింపగలదు. కళ్ళెమును బిగించి గుఱ్ఱమును నిరోధింపగలవాఁడే సరియైన త్రోవను బోఁ గల్గును. సాధన చేయుము,

ముందంజ వేయుము! 'ఇల్లలుకగనే పండు గయైనదా?' కాషాయవస్త్రమును ధరించినంతనే, లేదా, ఇల్లు, వాకిలి విడిచిపెట్టినంతనే, సర్వము సిద్ధించినదనుకొనుచుంటివా? ఇంతవఱ కాధ్యాత్మి కానుభవ మేమైనను పొందితివా? కాలము పరుగి డుచున్నది. ఉత్తరక్షణమును సైతము వ్యర్థము చేయకుము. మహా చెప్పిన, జపతపములను తీవ్రముగా మఱి మూడునాలుగేండ్లపాటు అవ లంబింపగలుగుదువు. అటుపిమ్మట, మనస్సును శరీరమును దుర్బలమై పోవ, విశేషమేమియు సాధింపజాలకుందువు. శ్రద్ధలేనిదే ఏమి సిద్ధింప గలదు?

"మొదట ముముక్షుత్వమును శ్రద్ధాభక్తు లను గలిగి యుండనిండు, అంతట సాధనలను ప్రారంభింత" మనుకొనుచున్నావు కాబోలును. అట్లు పొసగునా? ప్రాతఃకాలము కాకముందే పగటిని గనగలమా? భగవంతుడు ప్రత్యక్ష మగునప్పుడు శ్రద్ధాభక్తులును ప్రేమయు పరి వారమువలె వానిని వెంబడించును.

తపస్సును నియమనిష్ఠలును లేనిదే యేవై నను సిద్ధింపఁగలదా? అవతారమూర్తులు సైత మెంతటి తీవ్రతపస్సు చేయవలసివచ్చినదో తెలియదా? శ్రమపడనిదే ఎవరైనను ఏమైనను సాధింపగలిగిరా? బుద్ధశంకరాదులు తమ జీవిత మున నెంతటి బ్రహ్మాండమైన తపోనియమనిష్ఠల నవలంబించిరో! ఎంతటి తీవ్రవైరాగ్యమో వారిది!

నిజమైన విశ్వాసము మొట్టమొదటనే కలు గవలయునన్నఁ గలుగదు. మొదట అనుభూతి, తరువాత విశ్వాసము. మొదట సాధకుడు తన నమ్మికను—"గ్రుడ్డినమ్మిక" యేయనుకొందము—గురూపదేశములందు, లేదా, ఎవరో యొక మహాత్ముని యుపదేశములందు—ఉంచవలయును, ఉంచిననే పురోభివృద్ధి నొందును.

ముత్తెపుఁజిప్పను గూర్చి శ్రీరామకృష్ణులు చెప్పెడి సామ్యమును నీవెఱుఁగవా? స్వాతివర్ష పుఁజినుకొకటి పట్టువడుటకై సాగరోపరిభాగ మునఁ దనచిప్పలను విరివిగాఁ దెఱచుకొని

ముత్తెపుఁజేప దేలియాడుచుండును. చినుకు ఒకటి లభించినంతనే యది సముద్రగర్భమునకు బోయి దానిని జక్కని ముత్తెముగా నొనరించును. నీగురుకృప యనెడి వానచినుకు నీకు లభించియున్నది; కావున ముత్తెపుఁ జేఁపవలె నీ వానందసాగరమున మునిఁగి బ్రహ్మసాక్షాత్కారమనెడి ముత్యమును నిర్మింపుము.

ఆత్మవిశ్వాసమును బూనుము. ప్రయత్నము లేనిదే ఆధ్యాత్మిక జీవనమున విజయము నందఁజాలవు. ఏదియో యొక నిష్ఠను—సాధనను—అవలంబించి కనీసము మూఁడు నాలుగేండ్లయినను దీక్షతో కృషిచేయుము. ప్రత్యక్షముగా, అపుడు నీకెట్టి వికాసమును గలుగనిచో, తిరిగి వచ్చి నా చెంపలు వాయింపుము!

రజస్తమస్సుల నతిక్రమించి సత్త్వగుణనిష్ఠుఁడ వైననే కాని, జపధ్యానము లనునవి యసాధ్యములు. తరువాత సత్త్వమునుసైత మతిక్రమించి, పునరావృత్తిరహితమైన తురీయావస్థను బొందవలసియున్నది.

మానవజన్మ మెంతటి పావనము! మహా పుణ్యఫలము! మానవుఁడు మాత్రమే భగవంతునిఁ గనుఁగొనఁగలఁడు. భగవత్సాక్షాత్కారమే మానవుని పరమప్రాప్యము— ముఖ్యోద్దేశ్యము — కావలయును. బ్రహ్మప్రాప్తికై తీవ్రప్రయత్నమొనర్చి యీ జన్మముననే ముక్తినొందుము.

స్థూలావస్థనుండి సూక్ష్మావస్థను, అందుండి కారణావస్థను పిమ్మట నంతకంటెను శ్రేష్ఠమగు మహాకారణమును తుదకు సమాధిస్థితిని బొందునట్లు క్రమక్రమముగా మనస్సు నుద్ధరింపవలయును. భగవానునకు సంపూర్ణాత్మార్పణము గావించుకొనుము. భగవంతుఁడే సర్వము. "సర్వం ఖల్విదం బ్రహ్మ — సమస్తము బ్రహ్మమే." సర్వము వానిదే.

లాభనష్టములనుగూర్చి లేనిపోని యంచనాలు వేయుచుఁ గూర్చుండకుము—తటపటాయింపకుము. పట్టుమని కొంతసాధన చేయకుండ, ఒక్కదినముననే ఆత్మార్పణ సాధ్యమగునా!

అది సిద్ధించినచో, సర్వము సిద్ధించినదన్న మాటయే. అందులకై తీవ్ర ప్రయత్నము చేయ వలయును. అస్తిత్వము శాశ్వతము. మానవా యుఃప్రమాణము మహా చెప్పిన, నూరేండ్లు. శాశ్వతజీవనమును దానితోఁబాటు శాశ్వతా నందమును బొందఁగోరెదవేని, ఈ నూరేండ్ల సుఖములను విడనాడుము.

## దేవుఁడు కలఁడు

స్వామి: భగవత్పాద పద్మముల నాశ్రయింపుము, వీడకుము. సదా భగవంతునే స్మరించుచుండుము. లౌకిక చింతలతో నీకాలమును వ్యర్థము చేసికోకు. మనస్సుయొక్క బహిఃప్రవృత్తి నరికట్టి దానిని భగవంతునిపై నిలుపఁ బ్రయత్నింపుము. ప్రయత్నము—తీవ్రప్రయత్నము—చేయుము. ఆధ్యాత్మిక జీవనము ఎట్టి యానందము-ఎట్టి చమత్కృతి- కలదో, నీకపుడు బోధపడును? ఇహమున నే—ఈ జన్మమున నే—నీవు మాయను దాఁటవలయును. ఆధ్యాత్మిక సాధనకు దిగిన నే కాని-ఆత్మనిష్ఠ నవలంబించిన నే కాని-ఇది సుసాధ్యము కాదు. విశ్వాసము-దృఢవిశ్వాసము-కలిగి యుండవలయును. ఏ సంశయమును నీమనస్సునఁ బ్రవేశింపనీయకుము.

శిష్యుడు: సంశయము వచ్చినచో?

స్వామి: బ్రహ్మసాక్షాత్కారము నొందు నంతవఱకు సంశయములు వచ్చుచు నేయుండును.*

సంశయములు మనస్సును కలంచునపుడు భగవంతు నాశ్రయించి వానిని ప్రార్థింపుము. ఇట్లు భావింపుము: "దేవుఁడు కలడు. నా మనోమాలిన్యములవలన నేను వానిని గనఁజాలకున్నాను. వానికృపవలన, నా మనస్సు పరిశుద్ధమైనంతనే, వానిదర్శనలాభము నందగలను."

మనస్సు వానిని గనఁజాలదు, తెలిసికొనజాలదు. ఈ 'మర్త్యమనస్సు'నకును మానవబుద్ధికిని భగవంతుఁడు అతీతుఁడు, నీకు గోచరించునట్టి యీ బాహ్య ప్రపంచము మనఃపరి

* "భిద్యతే హృదయగ్రంథిః, ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి, దృష్ట ఏవాత్మ నీశ్వరే."
—ముండకోపనిషత్తు.

(బ్రహ్మ సాక్షాత్కారము నొందునపుడు అజ్ఞానము నశించును, సమస్త సంశయములును విచ్ఛిన్నములగును, సర్వకర్మములును క్షయమగును.)

కల్పితము, మనఃపరిమితము. మనస్సే దీనికికర్త. దీనిని కల్పించినది. తనపరిమితిని—అవధిని— అది దాటిపోజాలదు.

మనకుఁ దెలిసిన యంతఃకరణము వెనుక— దాని కాధారభూతమై సూక్ష్మాంతఃకరణము బీజరూపమున వెలయుచున్నది. జపధ్యానముల వలనను, ప్రార్థనవలనను ఈయంతఃకరణము వికాసమునొందును, అంత నూతనదృష్టి— దివ్యదృష్టి— కలుగును. సాధకుఁడు అనేకాధ్యాత్మికతత్త్వములను దర్శింపవచ్చును. కాని యిది పరమావధికాదు. ఈ సూక్ష్మాంతఃకరణము సైతము భగవంతునిఁ బ్రాప్తింపఁజాలదు. పరమాత్మను గనఁజాలదు. కాని యది నిన్ను వానికి సన్నిహితునిఁ జేయును. ఈ స్థితిలో సాధకునకు సంసారము నిస్సారముగాఁ దోఁచును. అపుడాతడు భగవచ్చింతా నిమగ్నుఁడై యుండును.

తరువాత లభించునది సమాధి. సమాధ్యనుభవము వర్ణనాతీతము—సదసదతీతము. ఈ దివ్యానుభవమున సుఖముగాని, దుఃఖముగాని,

తేజముగాని, చీకటిగాని, ఉండదు సర్వము అఖండాద్వితీయబ్రహ్మము—అనిర్వచనీయము.

శిష్యుడు: స్వామీ! మా సాంసారికవిధులను మేమెట్లు నిర్వర్తింపవలయును?

స్వామి: న్యాయబుద్ధితో వానిని నిర్వర్తించు చుండుము, కాని, భగవంతునిచేతిలో నీవొక ఉపకరణమవని సదా మది నుంచుకొనుము. కర్మాసక్తుడవై యుండరాదు. భగవంతుడే కర్తయని మనఃపూర్వకముగా—నీ హృదయాంతరాళమున—దెలిసికొనియుండుము

సదా వానియందే మనసు నిలిపియుంచుము. నిజమే, కర్మమొనర్చుచు నీవు నీమనస్సును భగవంతునియందు లగ్నముచేయజాలక పోవచ్చును. అహంకారము తల యెత్తవచ్చును. కాని, యెన్నడును అపజయముల నెంచి యధైర్యపడకుము. నీ ప్రయత్నములను ఇనుమడింపుము. ప్రారంభమున అపజయములు (ఎవరికైనను) తప్పవు. కాని, ఆత్మవిశ్వాసము కలిగియుండుము, అధైర్యము నొందకుము. నీ యాద

ర్యమును అనుభవములోనికిఁ గొనివచ్చుటకు గట్టిప్రయత్నము చేయుము. ఎన్నిమారులైనను ప్రయత్నింపుము. 'హత్వా వా, జిత్వా వా'— జయింపనైనను జయింపవలయును, తత్ప్రయత్నమున మరణింపనైనను మరణింపవలయును— ఇదియే నీ సూత్రమై యుండవలయును.

"ఈ జన్మముననే నేను భగవంతునిఁ గనవలయును"- ఇదియే నీ మూలమంత్రము కావలయును. భగవత్ప్రాప్తికి నీకుఁ దోడ్పడనియెడల ఈ శరీరము వలనఁగాని, ఈ మనస్సువలనఁగాని, ఏమి ప్రయోజనము? ఒకవేళ ప్రయత్నముననే నీవు మరణింపవలసివచ్చుచో, దాని నెన్నటికిని లక్షింపకుము.

# భగవత్సాక్షాత్కారమే పరమాదర్శము

శిష్యుడు: స్వామీ! (లక్ష్మీనారాయణాది) దేవతలు పురాణకల్పితులా, లేక, యథార్థముగాఁ గలరా! పూజాది కర్మకాండము నెడ నాభావము ఎట్లుండవలయును?

స్వామి: ఈ దేవతలందఱును కేవలము ఒకే భగవత్తత్త్వము యొక్క నానాకళలై—నానా రూపములై వెలయుచున్నారు.

తమతమ మనోభావముల ననుసరించి మానవులనేక రీతులుగ భగవంతు నుపాసించుచుందురు. భిన్న మనోభావములను తృప్తిపఱచుటకై భగవత్ప్రాప్తికిఁగాను వేదశాస్త్రములు నాలుగు ప్రత్యేక మార్గములను సూచించుచున్నవి.

ఒక మార్గము కర్మకలాప సంబంధమైన ఉపాసన—అనఁగా, విగ్రహమునఁగాని, ప్రతీకమునఁగాని, భగవంతునారాధించుట.

జపప్రార్థనల మూలమున భగవంతు నుపాసించుట యింతకంటె విశిష్టమార్గము. సాధకుడు

తన యిష్టదేవత యొక్క దివ్యరూపమును ధ్యానించును. తన యిష్టమూర్తి నాతడు ప్రార్థించును. వానినిగూర్చి జపించును.

ఇంతకంటెను విశేషము ధ్యానయోగము. ధ్యానము అనఁగా భగవంతునిఁగూర్చిన నిరంతరభావప్రవాహము.* ఈ విధమైన ఉపాసన నవలంబించునపుడు సాధకుఁడు తన యిష్టదేవతా స్వరూపసందర్శనమున నిమగ్నుఁడై యుండును. ఇందు ప్రార్థనగాని, జపముగాని యుండదు. కాని ద్వైతభావము నిలిచియుండును: 'భగవంతుఁడు కలఁడు, నేనును గలను.'

* "ధ్యానం చ తైలధారావ దవిచ్ఛిన్న — రూపమ్" అనునట్లు ఒకపాత్రనుండి మఱియొకపాత్రలోనికిఁ బోయఁబడు చమురువలె తత్వమునుగూర్చి, లేదా, ఇష్టదైవమునుగూర్చి తెంపులేని భావప్రవాహమే ధ్యానము.

## ౨

# ఈజన్మముననే భగవంతునిఁ గని తీర వలయునని సంకల్పింపుము

స్వామి: నేఁ డనేకులు తమ జీవితమును దేశసేవార్థము, మానవసేవార్థము సమర్పింప వలయునని భావించుచున్నారు. ఆధునికవిద్యా ప్రభావమున ఈ భావము దేశీయుల తలకెక్కి యున్నదని నా నమ్మకము. స్వయముగా సుశీల వ్రతుఁడు కానిదే యెవ్వఁడును ఇతరులకు మేలు చేయఁజాలఁడు. భగవంతుని శరణుపొంది, భగ వత్ కృపాపాత్రుఁడైనవాఁ డెన్నడును దప్పటడుగు వేయఁజాలడు అట్టివాని జీవితమే లోక కల్యాణసాధనభూతము. వాని ప్రతికార్యమును ప్రతివాక్కును—వేయేల, వాని జీవనవిధానమే విశ్వకల్యాణ హేతుభూతమై విరాజిల్లును. "మొదట మూలస్తంభమును బట్టుకొను" మని శ్రీగురుదేవులు వచించువారు. అనఁగా మానవ జీవితపరమ ప్రాప్యుఁడగు భగవంతుని సాక్షాత్కరించుకొనుమని భావము. మాధవునియందు గాఢ

విశ్వాసమును బూని మానవసేవ యొనర్పుము. భగవత్సాక్షాత్కారము నొంది భగవన్నిమిత్త మాత్రుఁడై యొప్పునట్టివాఁడు స్వయముగా శాంతినొంది యితరులకు శాంతి నొసఁగూర్పఁ గలుగును.

"తన యనుంగు బిడ్డలగు భక్తుల హృదయమున భగవానుఁడు నెలకొనియుండును." అని శ్రీగురుదేవులు వచించువారు కావున మనము నిర్మలహృదయులమై యుండవలయును; నిర్మల హృదయమే భగవన్నిలయము. అపవిత్రహృదయమునకు భగవంతుఁ డతిదూరస్థుడు. మన హృదయము నిర్మలమై, అద్దమువలె స్వచ్ఛమై వెలయునపుడే పూర్వ సంస్కారము లన్నియు నిర్మూలమైనపుడే-భగవంతుఁడం దధివసించును. అపుడే భగవంతుఁ డచట ప్రత్యక్షమగును.

నిర్మలమానసము భగవానుని విస్పష్టముగా ప్రతిబింబింప జేయును. అద్దము మలినమై యున్నచో, దేనినీ ప్రతిఫలింప జేయజాలదు. మలిన హృదయమున భగవత్ప్రతిబింబము భాసింపదు. మీరందఱును నిపుడు చిరతప్రా

యమువారు. మీయం దేమాలిన్యమును లేదు. మీ హృదయసింహాసనమును భగవంతునికై సంసిద్ధ మొనర్పుఁడు. మఱి దేనికిని అందు దావుండరాదు. నిర్మలులై శాంతిచిత్తులై యుండుడు. ఈజన్మముననే భగవంతునిఁగనుఁడు

పవిత్రగ్రంథములను వీడి చెత్తపుస్తకములను జదువుచు మీ కాలమును వ్యర్థముచేసికొనకుడు. భగవంతునియందు భక్తివిశ్వాసములను బురికొల్పని గ్రంథములు నిరర్థకములు. అవి పాండిత్య పటాటోపమునకు మాత్రమే వినియోగించును. నాయనా! దుర్లభమగు నీమానవజన్మమును ధన్య మొనర్చుకొనఁగోరెదవేని, ఆత్మకల్యాణము నందఁగోరెదవేని, భగవన్నామము నాశ్రయించి ధ్యానసాగరనిమగ్నుఁడవుకమ్ము. ఊరక పైపైనఁ దేలుచుండక తదీయ రత్నాకరమున మునుఁగుము.

సంగరాహిత్యమే మానవ జీవితాదర్శమని లోకమునకుఁజాటుటకై శ్రీ రామకృష్ణదేవు లీ యుగమున నావిర్భవించియున్నారు. మాన

వుఁడు విషయసుఖముల వెంటఁ బరువులిడుచు పశుప్రాయుఁడై పోవుచున్నాఁడు. నీ జీవితము సార్థక మొనర్చుకొనఁ గోరెదవా, భగవంతుని శరణుపొందుము. మాయాసుఖములనువీడి నీ 'జన్మహక్కు'గు శాశ్వతానందము నరయుము. దానిని సంపాదింపుము.

త్యజింపుము! సంసారమోహమును పరిత్యజింపుము! భగవత్ప్రాప్తికై సమస్తము విడనాడుము. వానిని నీవాని నొనర్చుకొనుము. "నీవే తండ్రివి, నీవే తల్లివి, నీవే మా నెచ్చెలివి, నీవే మా సర్వస్వము."*

తుచ్ఛలౌకికభోగములను విడనాడి భగవంతుని ధ్యానించుచు, చింతించుచు దినములు గడపిననే మన మానవజీవితమును ధన్య మొనర్చుకొని యథార్థసౌఖ్యము నందఁగల్గుదుము.

---

* శ్లో. "త్వమేవ మాతా చ పితా త్వ మేవ,
త్వమేవ బంధుశ్చ సఖా త్వ మేవ;
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ,
త్వమేవ సర్వం మమ దేవదేవ !"

మనుష్యత్వము, ముముక్షుత్వము, మహాపురుషసంశ్రయము—భగవత్సాక్షాత్కారము నొందుట కీ మూఁడును ప్రధానసాధన భూతములు.*

భగవదనుగ్రహమున నీ కీమూఁడును లభించియున్నవి. వీనిని సద్వినియోగ మొనర్చి నీ జీవితము వ్యర్థము కాకుండునట్లుద్ధరించుకొనుము తాత్కాలిక సుఖములకై దేవులాడకుము. శాశ్వతానందము నరయుము. మఱియొక మానవజన్మమున నీకు మోక్షేచ్ఛ యుండ వచ్చును గాని నీ విపుడు పడిసియున్న మహాపురుష సాంగత్యము లభింపక పోవచ్చునను విషయము మాత్రము విస్మరింపకుము. ఇది మహాదుర్లభము, అనేకజన్మార్జితపుణ్యఫలము. అనన్యసామాన్య భాగ్యముచే శ్రీ రామకృష్ణ ప్రశిష్యబృందమునఁ జేరి శ్రీరామకృష్ణదేవుని

---

* శ్లో. "దుర్లభం త్రయమేవైత ద్దైవానుగ్రహ హేతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః."
—వివేక చూడామణి.

ప్రాపు నొందితివి. కొఱగాని పనులు చేయుచు నీ జీవితమును వ్యర్థము చేసికొనకుము.

శ్రద్ధ! గురువాక్యములం దత్యంత శ్రద్ధ గలిగి వర్తించినచో, సర్వము సాధింపఁ గల్గుదువు. గురువాక్యములందు శ్రద్ధ లేనిచో పారమార్థిక జీవనము నిష్ఫలమగును. పిల్లిపిల్ల తనతల్లి నాశ్రయించునట్లు భగవంతు నాశ్రయింపుము. ఆశ్రయించితివా, భగవంతుఁడే నీ యండయై, తోడునీడయై నిన్నుఁ గాపాడును.

జ్ఞానసాగరమున నీ తెలివి నిన్ను ఎంతవఱకుఁ గొనిపోగలదు? భగవంతుఁడు అవాఙ్మానస గోచరుఁడు. గురుని శరణుపొందుము. తన విజ్ఞానముచే బాధ్యతాభిజ్ఞతచే, ఆతఁడు నీకంటె నెన్నియోమడుఁగులు నీ స్థితిగతులను జక్కఁగా గ్రహించి సమస్త భ్రమప్రమాదములనుండియు నిన్నుఁగాపాడును, సద్గురుచరణాశ్రితుఁడగువాని కేహానియుఁ బాటిల్లఁ జాలదు. మానవుఁడు భగవంతునిఁ గనుఁగొను పర్యంతము అనేక భ్రమప్రమాదముల కగ్గమగుచుండును. కాని,

యాతఁడు గురుని శరణుపొందెనా తప్పుల కవ కాశము తక్కువగును. "తండ్రి తన బిడ్డచేయి పట్టుకొనియుండెనా, బిడ్డ పడిపోవునను భయ ముండ" దని శ్రీ గురుదేవులు వచించునారు తెలియక నీవు తప్పుల పాల్పడినను, నీకు ఆశ్రయ భూతుఁడగు గురువు వానినన్నిటినిఁ దుడిచి వేయును.

త్యాగముతోడిదే శాంతి. త్యజింపుము, వైరాగ్యముఁ బూనుము. శ్రేయస్సిద్ధిని, శాంతిని బడయఁగోరెదవా, భగవదర్థము సమస్తము త్యజింపుము. మనస్సు రాగద్వేషాధీనమగు చుండును. కాని, మానవుఁడు దానిని నిగ్రహింప వలయును. సంకల్పబల మున్నచో, నిస్సంగియై నరుఁడు నారాయణునిఁ గాంచఁగలుగును.

సన్న్యసమునకును నీవస్త్రధారణమునకును నిజముగానెట్టి సంబంధమును లేదు. కావిగుడ్డలను గట్టినంతనే కామ కాంచనత్యాగివని చెప్ప వలనుపడదు. సన్న్యసము—త్యాగము—ప్రకటనార్థముగాదు. స్వార్థమనునదేమియు లేక

భగవంతునకు పూర్తిగ ఆత్మార్పణ మొనర్చు కొనియుండువాఁడే నిజమైన సన్న్యాసి. "సర్వేశ్వరా! ఈ నాశరీరము, మనస్సు, బుద్ధిని— సర్వము నీకు సమర్పించుచున్నాను. ఇవన్నియు నీవే. వీనిని నీ యుపకరణములుగా నొనర్చు కొనుము." నిరంతరము భగవంతు నిట్లు ప్రార్థింపుము : "పరమేశ్వరా! నాకు శుభాశుభ ములనెట్టివో తెలియదు; నేను నీవాఁడను, పాల ముంచినను నీట ముంచినను నీ దేభారము." భగవంతునిఁ బ్రార్థింపుము! సదా, సర్వదా ప్రార్థించుచుండుము. భగవంతుఁడే నీయనన్య గతియని నమ్ముము.

నీవు మదినుంచుకొనవలయు మఱియొక ముఖ్య విషయమిది: భగవత్సాక్షాత్కారమే మానవ జీవిత పరమావధియని భగవదనుగ్రహమున నీవు గ్రహించియున్నావు. జనులు నిన్ను భూషింతురు గాక, దూషింతురుగాక; గౌరవింతురుగాక, తృణీ కరింతురుగాక; లోకమున నీకు సముచితస్థానము లభించుఁగాక, లభింపక పోవుఁగాక; శరీరము నిలు

చుఁగాక, పతనమగుఁగాక—నీ యాదర్శము లను, నీ నియమములను లేశమును విడకుము. "ఎట్లైనను సరియే, ఈ జన్మముననే భగవత్సా క్షాత్కారము నొందితీరవలయును" అని నిశ్చ యించుకొనుము. నీజీవితము నిట్లు నియమించుకొనఁ గలిగినచో, శ్రీరామకృష్ణ భగవానునివత్సవని గ్రహింతును; సాధు సాంగత్యమున నీ జీవితము ధన్యమొనర్చుకొంటివని గ్రహింతును.

ఈ సందర్భమున మఱియొక విషయమును స్పష్ట మొనర్పవలసియున్నది. గురువనఁగా నెవ్వరు? గురువు బ్రహ్మజ్ఞానియై యుండవల యును. తనకే దారి తెలియనివాఁడు ఇతరులకు దారి చూపుట యెట్లు పొసంగును? మంత్రములు సదా ప్రభావోపేతములనుటకు సందియము లేదు, కాని స్వయముగా జ్ఞానహీనులై మత ధర్మముల పేర స్వలాభ పరాయణులై యుండునట్టి గురునామకులవలన మంత్రోపదేశము నొంది నచో, అయ్యది నిజమైన శాంతినిగాని, జ్ఞాన మునుగాని కల్గింపఁజాలదు. శ్రీరామకృష్ణపరమ

హంస శిష్యులయొద్దకు—అతని వత్సలయొద్దకు—వచ్చియున్న నీవు నిజముగా ధన్యుఁడవు! శ్రద్ధా భక్తులుగలవాఁడును నిష్కపటియు నగువాఁడు శ్రీరామకృష్ణ దేవునియందఁ జేరవలసినదే. ఈ యుగమున నిజమైన శాంతి మఱెచ్చటను లభింపఁజాలదు. శ్రీరామకృష్ణ భగవానుఁడు తన జీవితమున మూర్తీభవింపఁజేసిన పరమాదర్శము ననుసరించువాఁడు శాశ్వతానందమున కధికారియై యొప్పును. భగవత్ప్రాప్తి సాధనములగు వివిధ మార్గములన్నియు శ్రీరామకృష్ణ దేవుని శిష్యులకుఁ దెలియును. నీ యదృష్టవశమున నేమార్గము నీ కుపదేశింపఁబడియున్నదో, ఆ మార్గముననే పురోగమింపుము; మఱియు మనఃపూర్వకముగ గురునిఁ బ్రార్థింపుము. ఆతఁడు భౌతిక శరీరముతో నున్నను, లేకున్నను గూడ నీకు దారిఁజూపును. నిజమైన గురువు శరీరపతనానంతరము అదృశ్యలోకమున నెలకొనియుండ తన శిష్యులందఱును ముక్తులగు పర్యంతము వారికిఁ దోడునీడయై యుండును'

"సాధనచేయుము! నాయనా, తీవ్రసాధన

చేయుము. సమస్త సంశయములను విడిచిపుచ్చి నీ గురూపదేశము ననుసరించి సాధనలందు నిమగ్నుఁడవగుము. నీ పారమార్థికతను బ్రకటింపక సదా గుప్తముగ సాధనచేయుచుండుము. ఏకాంతమగు నొకమూలకో, వనమునకో వెళ్ళి రహస్యముగ నీహృదయకుహరమున ధ్యానింపు" మని శ్రీ గురుదేవులు వచించువారు. కొంత కాలముపాటు కొంచెము ప్రయత్నించితివా, ధ్యానాయత్త జీవన మెంతటి వినోదకరమో నీకుఁ దెలియఁగలదు. సంపూర్ణమగు మనఃపరివర్తనము నందెదవు. బ్రహ్మజ్ఞానిప్రాపు నొంది యున్న నీ వాందోళన పడనక్కఱలేదు. తప్పక విజయము నొందుదువు.

౮

# దేహమే దేవాలయము

స్వామి: సమాధి సాధారణముగా రెండు విధములని చెప్పఁబడుచున్నది. మొదటి విధమగు సవికల్ప సమాధిస్థితియందు సాధకుని ప్రత్యేక వ్యక్తిగత ప్రజ్ఞ నిలిచియున్నను, భగవంతుని దివ్యరూప సాక్షాత్కారము భాసించుచుండును. రెండవవిధమైన నిర్వికల్ప సమాధి స్థితియందు సాధకుఁడు తన వ్యక్తిత్వభావమును గోల్పోయి, భగవద్రూప దర్శనము నతిక్రమించును. సమస్త ప్రపంచమును అపుడు అదృశ్యమగును. ఆనంద సమాధి యను మఱియొక విధమైన సమాధిస్థితియుఁగలదు. సామాన్యమానవుఁడీదివ్యానుభూతినిఁ బొందినయెడల, వాని మనశ్శరీరములు ఆ మహోత్కృష్ట బ్రహ్మానందమును భరింపఁజాలవు. అతఁ డిఁక నిరువది యొక్క దినములకంటె జీవింపఁజాలఁడు.

మాకు బోధించుచు, శ్రీ గురుదేవులు (శ్రీరామకృష్ణులు) ఒకనాఁడు శబ్దబ్రహ్మ సాక్షాత్కార

మునుగూర్చి సాంతముగా వివరించిరి. దీనిని నాఁటి నామధ్యాహ్నధ్యాన విషయముగా గ్రహించితిని. ధ్యానస్థితుఁడనై యుండ, అకస్మాత్తుగా శబ్ద బ్రహ్మ సాక్షాత్కారము నందితిని.

శ్రీ గురుదేవు లొకప్పుడు నాతో నిట్లు పలికిరి : "ఆలయమున నేను ధ్యానించుచుండ, మాయావరణములు ఒకదాని వెంబడి నొకటిగా నాయొక్క నుండి విడిపోయినవి. కోటి సూర్య ప్రకాశమును మించిన దివ్యజ్యోతిని అమ్మ నాకుఁ జూపించినది. ఆ జ్యోతినుండి యొక దివ్యస్వరూపము వెలువడినది. అపు డారూప మా తేజము లోలీనమై పోయినది. రూపరహితమైనది రూపము నొంది, మఱల రూప రహితతత్త్వమున లీనమై పోయినది."

దేహమే దేవాలయము. అందే పూజాధ్యానములను ఆచరింప వలయును. సహస్రారమున ప్రజ్ఞ లయించినప్పుడు, మనస్సు అందుండి వెలువడ నిచ్చగింపదు. ఈ విశాల బహిఃప్రపంచమున నేమున్నదో, అది యంతయు నీయందే

కలదని నీకపుడు అనుభూతమగును. "ఆలయమున దేవునిఁ గాంచినవాఁ డిఁక నందుండి వెలువడఁ" డని యొక సామెత కలదు.* తన హృదయ దేవాలయమున దేవునిఁ గాంచిన వాఁడు ముక్తి నొందునని దీని యంతరార్థము. బాహ్యప్రపంచమున నిర్మింపఁబడు దేవాలయములు ప్రారంభదశయందలి సాధకులకు సాహాయ్యభూతములు. మానవశరీర మనెడి మహోత్తమ దేవాలయము నకు అవి కేవలసాంకేతికములు, ప్రతీకములు.

కనుబొమల నడుమ జ్ఞాననేత్రమనెడి కన్ను గలదు. అది తెఱచుకొనినపుడు, ఆనందనిర్ఝరి వెలువడును. సమస్త ప్రపంచమును ఆనందమున లయమైనట్లు తోఁచును.

---

* "రథం తు వామనం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే-శరీరమను రథమున ఆత్మయను వామనునిఁ గాంచిన వానికిఁకఁ బునర్జన్మము లేదు." అని యిట్టిదే మఱియొక లోకోక్తికలదు.

౮

# భగవంతునే యన్వేషింపుము

దుఃఖము నెవ్వరును గోరరు. ఎల్లరును సుఖమునే కోరుదురు. కాని సంసార మోహితుఁడగు మానవుఁడు సర్వానంద నిలయమగు భగవంతుని వీడి, సాంసారిక పుత్తళికలగు నిరర్థకవిషయముల వెంటఁబడి పరువులెత్తుచుండును. నిజమైన యానందమును గోరుదువేని నీవీయాట బొమ్మలఁ ద్రోసివైచి భగవంతునకై పరితపింపుము. నిన్నాతఁడు తన యంకమునఁ జేర్చుకొనుటకై పరుగిడివచ్చును. ఆటబొమ్మలగు సాంసారిక విషయములను లక్షించితివా, నీకు అవియే లభించును. భగవంతుని లక్షించితివా, నీకాతఁడు పట్టువడును.

"ఆకులను లెక్కింపక మామిడిపండ్లను దినుము." భగవత్ప్రాప్తియే జీవితపరమార్థము. మొదట వానినిఁ జేరుము. జననమరణ రహస్యమును దెలిసికొనుము. అజ్ఞాననిద్రనుండి మేల్కొనుము. అమృత సాగర నిమ

గ్నుఁడవై మరణాతీతుఁడవు గమ్ము. భగవంతు నిఁగూర్చి నిరంతర ప్రార్థనచేయుము.

భగవంతున కనేక నామరూపములు గలవు: మఱియు నాతఁడు నామరూపరహితుఁడు. వానిని బూజింపుము. భగవచ్చింతా నిమగ్నుఁడవు కమ్ము. వానిని నీ వేరూపమున అర్చించినను, ఏ నామమున అనుసంధానించినను, ఒక్కటియే. మనఃపూర్వకముగా నుపాసించుచో, నీవు వాని భవ్యదర్శనము నొందుదువు. "పంచదార యప్పమును నీ వెట్లు పట్టుకొని తినినను తీయఁగనే యుండు"నని శ్రీగురుదేవులు వచించువారు. శ్రద్ధావంతుఁడవై యగాధ (సచ్చిదానంద) సాగరమున మునుఁగుము. బాగుగా మునిఁగి వెదకినచో శాశ్వతనిధి నీ కైవసమగును. ప్రయత్నించినంతనే భగవంతునిఁ గనఁజాలనిచో నిరుత్సాహివి గాకుము. సముద్రమున అమూల్య మణులపారముగ నున్నవి. కాని యొక్క సారి మునిఁగినంతనే నీవు వానిని గనుఁగొనఁ జాలక పోవచ్చును. ధ్యాన సాగర నిమగ్నుఁడ వగు

టకై యోరిమితోఁ బ్రయత్నింపుము. సకాల మున నీకు వాని యనుగ్రహము తప్పక కలుగును. నీ వొక ప్రముఖుని సందర్శింపఁ గోరు దువనుకొనుము. అతని పరిజనుల సాయమున నీవు సందర్శనము నేర్పఱచు కొందువుగదా - ఇట్లే భగవదనుగ్రహము నొందుటకు సాధు జన సాహాయ్యము నరసి యనేక సాధనల నొనర్ప వలసియుందువు

భగవంతుఁడొక్కఁడే కల్ల నాప్తుఁడని తెలిసి కొని పరితప్త హృదయుఁడవై వాని కృపా సంద ర్శనములకై ప్రార్థింపుము. బిడ్డవలె వాని నిమి త్తమై విలపింపుము. నీయందుండి యతఁడెంతో కాలము దాగియుండఁజాలడు.

నావికుని దిక్సూచీ యంత్రమువలె మనస్సు నేకాగ్ర మొనర్పుము. ఓడ యేదిక్కునకుఁ బయనించినను దిక్సూచీ యంత్ర మెప్పుడును నుత్తర దిశనే చూపుచు నోడసక్రమ మార్గమునఁ బయనింప సాహాయ్య భూతమగుచుండును. మనస్సు భగవంతుని లక్షించునట్లు నియమించు కొనుము; జీవననౌక నిరుపద్రవముగ సాగిపో

గలదు. ఇటులాచరించు మానవుఁడు దుష్ట సంస
ర్గమునఁ బడినను దన శ్రద్ధా భక్తులను గోల్పో
వకుండును. భగవానునిఁ గూర్చి విన్నంతనే
యానందోన్మత్తుఁ డగును. చెకుముకిఱాయి
నీటిలో వేలకొలఁదిఁ యేండ్లుగఁ బడియుండగాక,
బయటికిఁ దీసి ఱాతితోఁ గొట్టి నంతనే నిప్పు
రవ్వలను వెలిగ్రక్కును.

గాలిచే నిటునటు నెగురఁ గొట్టబడుచుండు
రాలిన యాకువలె నేకాగ్రచిత్తుఁడగు మాన
వుడు భగవంతుఁడు తన్నుంచిన చోటనే సంతృ
ప్తుఁడై యుండును. అతనికి స్వేచ్ఛ యనునదే
మియునుండదు. అతఁడు సంసారమున నున్నను
దోడ్తోడనే జ్ఞానానంద సాగరమున నిమగ్నుఁడు
కాఁగలడు.

శుద్ధమనస్సు పొడయగ్గిపుల్ల వంటిది. దానిని
నీవు గీసినయంతనే బుస్సున నంటుకొనును. కాని
యది నెమ్ముకొనెనా, యెంత గీసినను వెలుఁగనే
వెలుఁగదు. ఇటులనే మనస్సు సంసార మాలి
న్యము నొందెనా, దానిని మఱల పూర్వపునిర్మ
లస్థితికిఁ దెచ్చుటెంతయు దుస్సాధ్య మనిపించును.

# ౧౦

## భగవత్కృపను కనుఁగొనుము

భగవన్నామస్మరణచే నీ మనశ్శరీరములు నిర్మలమగును, భగవన్నామ ప్రభావమున గాఢ విశ్వాసముఁ బూని భగవంతునిఁగూర్చి ధ్యానింపుము. భగవన్నామము కీర్తించినచో, భవబంధములు విచ్ఛిన్నములై పోవ నీవు నిర్భయుఁడ వగుదువు; ముక్తినొందుదువు.

భగవత్కృపను బడయుటయే, భగవంతునిఁ గనుఁగొనుటయే సమస్త సాధనలయొక్కయు పరమ ప్రయోజనము. మనస్సును గప్పియున్న కామకాంచన పంకిలమును గడిగివేయవలయును. హృదయము పరిశుద్ధముకానిదే భగవత్కృప ప్రకాశితము కాదు.

శ్రీ గురుదేవులు చక్కని దృష్టాంతము దెలుపువారు: మట్టితోఁ గప్పబడియున్నంతవఱకు సూదంటుఱాతిచే సూది యాకర్షింపఁబడదు. మట్టి కడిగివేయఁబడినంతనే సూది సహజముగ సూదంటుఱాతివైపున కాకర్షింపఁబడును. ఈశ్వర

చింతాధ్యానములచే మనో మాలిన్యము కడిగి వేయఁబడును. తత్క్షణమే భగవంతుఁడను దయాస్కాంతము మానవాంతఃకరణమను సూదిని తనవైపున కాకర్షించుకొనును. మనస్సు నిర్మలమైనంతనే భగవత్కృప ప్రవహింపసాగును. భగవత్కృపయే భగవానునిఁ బ్రకాశితు నొనరించును.

స్వప్రయత్నముచే మానవుఁడు భగవంతుని; కనుఁగొనఁగలఁడా? బుద్ధి వానిని గ్రహింపఁగలదా? వాని కాత్మార్పణ మొనర్చుకొనుముఁ. వానిని శరణుపొందుము; ప్రేమింపుము. భగవత్ప్రాప్తికై పరితపింపుము. తదేకచింతచే భగవదున్మత్తుఁడవగుము.

భగవంతునిఁ గనుఁగొనుటయే పరమపురుషార్థము. తన్నిమగ్నుఁడవగుట నేర్చుకొనుము. రజఃప్రవృత్తియు కార్యపరతయుఁ గాదు మన గమ్యము. నిష్కామకర్మము భగవచ్చింతానిమగ్నతయు కేవలము సాధనము. ధ్యానింపుము, లోఁతునకుఁ బొమ్ము. లోఁతునకుఁ బోయినకొలఁ

దియు భగవంతుఁ డొక్కఁడే యథార్థమనియు మిఁగిలినదంతయు మిథ్యయనియు గ్రహింపఁగలవు. ఎన్నఁడును నాఁగక సదా ముందంజ వేయు చుండుము. ని సాధనలవలనఁ గొంచె మాధ్యాత్మిక ప్రబోధము కలిగినంతనే యదియే గమ్యమను కొనఁబోకుము. వికాసము! అధికాధికతర వికాసము! బాగుగా లోఁతునకుఁ బొమ్ము. ప్రత్యక్షముగ, ముఖాముఖముగ, భగవంతునిఁ గనుఁగొని వానితో నీవు సంభాషింపవలయును.

వాదములును గ్రంథపఠనములునుజాలును! ఇకఁ నీ మనశ్శక్తి సామర్థ్యములను గూడఁగట్టుకొని వానిని భగవంతుని వైపునకే మరల్పుము. ఇతర విషయములను లక్షింపకుము. ఆనందసాగర నిమగ్నుఁడ వగుము.

క్షణిక సుఖములకై శాశ్వత బ్రహ్మానందము నొడ్డివేయకుము. బ్రహ్మానందము నొక్కపరి రుచి చూచితివా, విషయ సుఖములు రసహీనములై తోఁచును.

నీ కట్టెదుట ననేకమైన యింద్రియాకర్షక

విషయములు గ్రసించుచున్నవి; కాని కడసారి
నీవు కన్నులు మూసికొనినంతనే యవన్నియు
నేమయిపోవుచున్నవి? ఈ విషయ భోగములు
తమస్సునుండి మహా తమస్సునకు మానవునీడ్చి
కొనిపోవుచున్నవి. ఏ మార్గమును నీ వవలంబిం
తువు? తమస్సునఁ బడఁద్రోయు మార్గమా? జ్ఞాన
జ్యోతినిఁ గాంచు మార్గమా?

ఆహా! నాయనలారా, అల జ్ఞానపథమును
మీరు రవంత గాంచియున్నారు. ఇఁక తమో
మార్గమువైపునకు మరలకుఁడు. విషయాకర్ష
ణలు బలీయము లనుటకు సందియము లేదు. వానికి
మీరు లొంగితిరా, యవి మనస్సులో ననివార్య
మైన దుష్ట సంస్కారములను బుట్టింప, మనస్సు
మీ యెఱుక లేకయే మి మ్మధోగతి నొందిం
చును. భగవంతున కాత్మార్పణ మొనర్చు
కొనుటయే విషయాకర్షణలనుండి సురక్షితముగ
బయల్పడు నుపాయము. భగవద్బలమున బలీ
యుఁడవై యుండుము. ఈ బలమే నిన్ను మాయా

జాలమునుండి తొలఁగించును. * భగవత్కృప గాంచినవాఁడే యీ సంసారము నతిక్రమింపఁ గలఁడు.

---

* క. "బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!"

— శ్రీమదాంధ్ర భాగవతము, ప్రహ్లాదచరిత్ర, 7-264.

# ౧౧
# భగవంతుని శరణుపొందుము

స్వామి: "పతివ్రతకుఁ దనప్రాణేశ్వరునిపై నుండెడి ప్రేమ, లౌకికునకు సాంసారిక విషయము లందుండెడి రాగము, లోభికిఁ దాను గూడఁబెట్టు కొనిన బంగారముపై నుండెడి మక్కువయు నను నివి మూఁడును ముప్పిరిగొన్నచో నెట్టి యను రాగ మమరునో, అట్టి యనురాగము గాఢముగాఁ గల్గియున్న నరుఁడు నారాయణునిఁ జూచు"నని శ్రీ గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) వచించు వారు. దీని యర్థమేమో నీకుఁ దెలియునా? సకలమైన కోరికలను విడి, మనస్సు భగవంతుని కోసము తీవ్రముగాఁ బరితపించునప్పుడే నరుఁడు నారాయణునిఁ జేరి వాని దివ్యదర్శనము నొందు నని దీని తాత్పర్యము. "ప్రాయశ్చిత్తములు, బాహ్యాచారనిష్ఠలు మున్నగు వాని నన్నిఁటిని

విడిచిపెట్టి నన్నే శరణుపొందుము'' అని గీతలో భగవానుఁడు తెలుపుచున్నాఁడు. *

మనఃపూర్వకముగా భగవంతుని శరణు పొందుము. సదా నిర్మల—నిష్కపట—హృదయముతో, ఇట్లు ప్రార్థింపుము: ప్రభూ! నాకేది మంచిదో, ఏది చెడ్డదో, తెలియదు. పూర్తిగా నిన్నే నమ్మియున్నాను. పారమార్థిక జీవనమునకు నాకు వలయుదాని నంతయు నీవే అనుగ్రహింపుము. మహోత్తమ లాభముగలుగుమార్గమున నన్ను నడిపింపుము సదా నిన్ను స్మరించుటకును ధ్యానించుటకును వలయు మనోబలవిశ్వాసములను అనుగ్రహింపుము.''

* శ్లో. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి
మాశుచః.''
—గీత, 18-66.

(సమస్త ధర్మాధర్మములను, అనఁగా, ప్రాయశ్చిత్తములు, బాహ్యాచారనిష్ఠలు మున్నగువాని నన్నిఁటిని వీడి నన్నే శరణుపొందుము; నిన్నెల్ల పాపములనుండియు విముక్తునిఁ జేసెదను, శోకింపకుము.)

త్రికరణశుద్ధిగా భగవంతునకు ఆత్మార్పణము గావించుకొనుట నిజముగా అంత తేలికగాదు.

"భగవంతుని శరణుచొచ్చియున్నాను, నాదేమియు లేదు, నాసర్వస్వము వానిదే. వాఁడెట్లు చేయించిన అట్లు చేయుచున్నాను" అని యనేకులు చెప్పుచుందురు. కాని వారి దైనందిన జీవితచర్యలను బరిశీలించితిమా, వారు చెప్పెడి దొకటియు, చేసెడిది మఱొకటియు నని మనకు, దెలియఁగలదు. ఏదైనను మంచి చేసిన యెడలఁ "ఓహో! నే నెంతటి ఘనకార్యమును సాధించితినో" యని గర్వోద్రిక్తులై, ఘనతనంతయు తమకే ఆపాదించుకొనుచుందురు. కాని లేశము కష్టము సంప్రాప్తించినంతనే, "ఆహా! భగవంతుఁడు నా కెంతటి విపత్తు కలుగఁజేయుచున్నాఁడు!" అని దోషమునంతయు భగవంతునిపైఁ బెట్టుచుందురు. లోకులనేకు లిట్లే కాలక్షేపము చేయుచుందురు.

బాహ్యావేష భాషాదులను జూచి జనుల గుణగణములను మనము గణుతించుచుందుము, కాని

భగవంతుఁడు వారి హృదయాంతరాళమును గమనించును. నిష్కపటచిత్తుఁడై ప్రార్థించు వాని కడకు భగవంతుఁడు పరుగెత్తుకొని వచ్చును. ఇది నిస్సంశయము. నిర్మల హృదయుఁడవై యుండుము. నీ మనస్సును మాటలును ఏకమై యుండవలయును. భగవంతుని శరణు పొందుము.

వేలకొలఁది, లక్షలకొలఁది జనులలో, ఏ ఒక్కఁడో నిజముగా భగవత్ప్రాప్తిని గోరుకొనును. మఱి యిట్టివారిలో, ఏ కొలఁదిమంది మాత్రమో ఆ కోరికను— ఆ పరితాపమును— నిలుపుకొందురు. * మహాదృష్టవశమున నీవు వానిని దెలిసికొనవలయుననెడి కోరిక గలిగి యున్నావు గావున, దానిని తీవ్రమొనర్చు

* శ్లో "మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే,
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః,"
—గీత, 7-3,

(వేలకొలఁది జనులలో మోక్షార్థ మొకఁడు ప్రయత్నించుచున్నాడు; అట్టి ముముక్షువులలో ఒకానొకఁడు నన్ను (అనగా పరమాత్మను) యథాస్థితిగఁ దెలిసికొనుచున్నాడు.)

కొనుము. నీవు కూర్చుండియున్నను, పరుండి యున్నను, భుజించు చున్నను, పనిచేయు చున్నను, భగవంతునిట్లు ప్రార్థింపుము,—నిరంతరము ప్రార్థింపుము: "ప్రభూ! నీ యనుగ్రహము నొంద నన్ను సమర్థునిఁ జేయుము; నీ యనుగ్రహమును దెలిసికొనుటకు నాకు శక్తినొసఁగుము. నన్ననుగ్రహింప నీవు సంసిద్ధుడవని నాకుఁ దెలియును.

పరమ సత్యస్వరూపుఁడగు భగవంతుని శరణుపొందఁ గోరువా రెందఱు? మానవుడు అవివేకియై తన తెలివితేటల నెంతయో నమ్ముకొని యుండును. భగవత్తత్త్వమును గ్రహింపఁజాలక మానవుడు భగవంతుఁడే లేఁడని చెప్పవచ్చును. తన తెలివి యెంతటి అస్థిరమైనదో కొంచెమైనను గ్రహింపనేరకున్నాఁడు. నేఁడు తాను నిజమనుకొనునది రేపు తనకే భ్రమగాఁ దోఁచును. ఐనను, ఈక్షణమునఁదన కేది సత్యమని తోఁచునో, అదియే పరమసత్యమనియు—పరమార్థమనియు ఎల్లరును దాని నంగీకరింపవలయుననియుఁ దలఁచుచున్నాఁడు.

ఎన్నెన్ని మాత్మరీతుల మానవుఁడు మాయా మోహితుఁడు కాఁదగియున్నాఁడో, అల జగన్మాతకే యెఱుక!

భగవత్సాక్షాత్కారము నొందిన వారెవ్వరును అనంతము, అఖండము, అప్రమేయమునగు భగవత్తత్త్వమునకుపరిమితి నారోపింపఁబూనరు. భగవంతుఁడు— పరమాత్మ—వారికి ప్రత్యక్ష తత్త్వము కాని, కేవలము ఊహాసంబంధమైన—అభిప్రాయ సంబంధమైన— విషయము కాదు. భగవంతుడు కలఁడు. ఆతఁడు అనంత ప్రేమమూర్తి, అవాఙ్మానసగోచరుఁడు. తన యనంత కృపా కటాక్షమున భగవంతుఁ డెవ్వనికి సాక్షాత్కరించునో, వాఁడే వాని మాయలను— వాని తత్త్వమును—గ్రహించును. వాని సందర్శనము నొందిన మానవునకు అఖండ జ్ఞానము కలుగును, సమస్త సంగపాశములును విచ్ఛిన్నమైపోవును. సాక్షాత్కారము నొందిన వాఁడు తాను భగవంతుని వాఁడననియు, భగవంతుఁడు తన వాఁడనియు నిశ్చయముగా నెఱుఁగును.

ఔను, బ్రహ్మ సాక్షాత్కారము నొందిన వానికి అఖండ జ్ఞానోదయమగును. ఐహికాము ష్మిక రహస్యము లన్నియు వాని కట్టెదుటఁ దెఱచిన గ్రంథములు.

మనము తెలివితేట లనుకొనునది అజ్ఞానము నకు మాఱుపేరు. మానవుఁడు ఇహమున అఖం డానందము నందఁగోరుచో, తా నెవ్వఁడో, ఎందులకు జన్మించెనో, ఈ జీవితోద్దేశమేమో, తెలిసికొనఁ దలచుచో, బ్రహ్మజ్ఞానము నొందఁ బూనుఁగాక!

పిల్లలు ఆటలలో నొక స్తంభమును బట్టుకొని దాని చుట్టును దిర్దిర తిరుగుచుందురు; పట్టువద లినచో, బళ్ళునఁ దలక్రిందుగాఁ బడుదుమనియు హాని కలుగుననియు వారికిఁ దెలియును. మనము కూడ నిట్లే భగవంతుని ఆశ్రయించుకొని, ఆతఁడే మనజీవనమూల స్తంభమని తెలిసికొనియుండవల యును. భగవంతుని ఆశ్రయింపుము, ఆశ్రయిం చితివా, ఇఁక నేప్రమాదము నుండదు. జ్ఞాన మార్గముకాని, భక్తి మార్గముకాని, కర్మమా

ర్గముకాని, నీ వేమార్గ మవలంబించినను సరియే, భగవంతునిఁ బొందుదువు. నీ జీవితము ధన్యమై వెలయ మానవకోటికి నీవు వరప్రసాద మై యొప్పెదవు*.

---

శ్లో. "స్నాతం తేన సమస్త తీర్థ
సలిలే సర్వాఽపి దత్తావని
ర్యజ్ఞానాం చ సహస్రమిష్ట
మఖిలా దేవాశ్చ సంపూజితాః
సంసారాచ్చ సముద్ధృతాః
స్వపితరస్త్రైలోక్య పూజ్యోఽప్యసౌ
యస్య బ్రహ్మవిచారణే క్షణమపి
స్థైర్యం మనః ప్రాప్నుయాత్."

శ్లో."కులం పవిత్రం జననీ కృతార్థా
వసుంధరా పుణ్యవతీ చ తేన,
అపారసం విత్సుఖ సాగరోఽస్మి
ల్లీనం పరే బ్రహ్మణి యస్య చేతః."

—సూతసంహిత.

బ్రహ్మవిచారమున నెవ్వని మనస్సు క్షణమైనను స్థైర్యము నొందునో అట్టి మహనీయుఁడు సమస్తపుణ్య తీర్థములందును స్నానమొనర్చినవాఁడును, సమస్తవసుంధ

భగవంతుఁడు కల్పతరువు. నరుఁడు వానిని దేనికై యర్థించునో దానిని బడయును. కాని సచ్చిదానంద సాగరమును గనుఁగొనఁబూనుటకు బదులు సంసార పంకమునఁ గూలఁబడి మాన

రము దానమొనరించినవాఁడును, సహస్రయజ్ఞముల నాచరించినవాఁడును, సకలదేవతలను పూజించినవాఁడును, తన పితురులను సంసారబంధవిముక్తుల నొనరించినవాఁడును. త్రిలోకపూజ్యుఁడునై వెలుఁగొందుచున్నాఁడు.

పరబ్రహ్మమనెడి యఖండసచ్చిదానంద సాగరమున నెవ్వనిమనస్సు లీనమగునో, అట్టి పుణ్యపురుషునిమూలమున వాని కులము, లేదా, వంశము పావనమై యొప్పును, జనని కృతార్థురాలగును, వసుంధర పుణ్యవతియై ప్రకాశించును.

యోగియగు మహనీయుని కటాక్షప్రభావమునుగూర్చి సూతసంహిత యిట్లు వక్కాణించుచున్నది;

శ్లో. "యస్యానుభవపర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే,
తద్దృష్టిగోచరాః సర్వే ముచ్యంతే సర్వపాతకైః."

ఆత్మసాక్షాత్కారార్థము ఎవ్వని మనస్సు పరతత్త్వమున లగ్నమైయుండునో అట్టి మహనీయుని కటాక్షమును బడయువారెల్లరును సమస్త పాపవిముక్తులగుదురు.

పుడు తాను హాయిగా నున్నానని తలంచు చుండును—మహా మాయాలీలా ప్రభావము! సంసార యాతనలు తన్నుదుర్కొనుచుండ జీవితము తుదకు నిరర్థకమై పోయెనని వానికిఁ దోచుఁను. ఈకల్పతరు చ్ఛాయను నీవు గూర్చుండియున్నావు. దివ్యుఁడవు కాగోరుము; నీవు దివ్యుఁడివై వెలయుదువు. పశువవుగాఁ గోరెదవా, పశువవే యగుదువు.

మాయా వరణమున (భగవదున్ముఖునిఁ జేయు) విద్యయు (భగవద్విముఖునిఁ జేయు)న విద్యయుఁ గూడఁ గలవు. నిత్యానిత్యవస్తువివేకము, సంసార సంగత్యాగము, లేక వైరాగ్యము ననువానితోఁ గూడుకొని యుండునదే విద్య. విద్య నాశ్రయించు చున్నావనిన, భగవంతునాశ్రయించు చున్నావన్న మాటయే. ఇఁక కామ, క్రోధ లోభ మోహ మద మాత్సర్యములతోఁ గూడుకొనియున్న యవిద్య మానవుని వట్టి పశుప్రాయునిఁ జేయును. వివేక వైరాగ్యముల నలవఱచుకొన్నచో, అవిద్య నాశనమగును. అవిద్యకు లోఁబడినచో, భగవంతునకు దూరుఁ

డవై తాపత్రయా ధీనుఁడ వగుదువు. ఒక వంక విద్యయు మఱియొక వంక అవిద్యయు—రెండు నుగలవు. రెంటిలో దేని నెన్నుకొనుట కైనను మానవున కధికారము గలదు—తనయెన్నిక ననుసరించి మానవుఁడు ఫలప్రాప్తి నందుచుండును. నీ బాధలకు భగవంతుని నిందింప నేల? వివేకమును గోల్పోయి లోకులు తాత్కాలిక సుఖానురక్తు లగుచుందురు. స్వయం కృతాపరాధ ఫలితమే తరువాతఁ గలుగు దుఃఖము, యాతన. కొఱవిని దాకినచోఁ కాలకమానునా? శ్రీరామకృష్ణ దేవులిట్లు వచించువారు "వెలుతురు నిచ్చుట దీప స్వభావము. దాని వెలుఁగునఁ గొందఱు భాగవతపారాయణ చేయుచుండ మఱికొందఱు దొంగ దస్తావేజులు సృష్టించు చుండవచ్చును. ఆ దోషా దోషములు దీపమునకంటగట్టరాదు."

శ్రీ గురుదేవులు మఱియు నిట్లు పలుకుచుండువారు. "మలయమారుతము వీచుటచే చేవ గల చెట్లు చందనవృక్షములుగ మారును. కాని చేవ లేని నిర్భాగ్యపుఁ జెట్లు మలయమారుతము

తమ్ముఁ దాఁకినను యథాప్రకారము గనే యుం
డును.'' ఇదే రీతిని మానవులును నిరుతెఱఁగులు
గనున్నారు. ఒక తెఱఁగు వారు సాధుసాన్నిధ్య
మునొంది వారి బోధనలను విన్నంతనే ప్రబోధ
మునొందుదురు. సంసార మనిత్యమని గ్రహించి
జనన మరణ కీలకముఁ గనుఁగొనుటకును భగ
వంతునిఁ దెలిసికొనుటకును పరితప్త హృదయు
లై వెంటనే సాధననిష్ఠు లగుదురు. ఇట్టి వారు
తప్పక సాక్షాత్కార లాభము నొందుదురు.

మఱియొక తెఱఁగువారు గలరు. వారికి నీ వెం
తటి తత్త్వబోధ లొనరింతువుగాక, వారియందు
చలనము గలుగదు. శాశ్వతముగ ఈ లోకము
ననే యుందుమని తలంచుచు, వారు తాము లేని దే
ప్రపంచము సాగదనుకొనుచుందురు. ప్రత్యక్షమగు
నైహిక సుఖములను అజ్ఞాతమగు పరముకొఱకై
విడనాడుట యవివేకమని వారి తలంపు. ఇట్లు
వారు సంసార కూపమునఁగూలఁ బడియుందురు.

మనఃపూర్వకముగ, నిష్కపటముగ భగవం
తునిట్లు ప్రార్థింపుము: "ప్రభూ! నాకు వివేకము

నిమ్ము. నన్నహంకార విముక్తునిఁ గావింపుము. నీ సంకల్పవశవర్తినై మెలఁగు విధానమును దెలుపుము. నన్ను నీ వానినిఁ జేసికొనుము."

భగవత్ప్రాప్తికై పరితపింపుము. శ్రీరామకృష్ణదేవుని శరణుజొచ్చి యున్నావు కావున, ఆయన కృపాపాత్రుఁడవను నిశ్చయము గలిగి యుండుము. మహత్తరమైన యట్టి కృపను బడసియు దానిని గుర్తింపకుండునట్టి వాఁడు కేవల నిర్భాగ్యుఁడు. పరమానందమును గోల్పోకుము. భగవానుని శాశ్వతానుచరుఁడవై యుండుము.

యుగావతారమూర్తియగు శ్రీరామకృష్ణులు నిష్కపటచిత్తుఁడగు ప్రతిసాధకుని కనుచూపులోనే నిలచియున్నారు. నీ నిమిత్త మాయన వేచి యున్నారు. కొంచెము ప్రయత్నించి శ్రద్ధాభక్తులనెడి నీ తెఱచాఁపలను నిండార విప్పుకొనుము. ఈ దివ్యమారుతము నిన్ను దరి జేర్పగలదు. వెనుకకుఁ జూడకుము. పురోగమింపుము. ఆయన దివ్యదర్శనమున నీజీవితము ధన్యమై వెలయుఁగాక!

౧౨

## ఆత్మసమర్పణము బ్రహ్మానందదాయకము

స్వామి : త్రికరణశుద్ధిగా భగవానునకు ఆత్మసమర్పణ మొనర్చుకొనవలయునని నే నిట్లు నొక్కి చెప్పుచుండుటకు కారణమేమో తెలియునా? మేము నీవయస్సున నుండఁగా శ్రీ గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) మా సాధనలను జాగ్రత్తగాఁ గనిపట్టి చూచుచుండువారు. బాల్యమున, లేదా, యౌవనమున మనస్సు బంకమట్టివలె మృదువై ఏయాకృతినిఁ బొందించుటకైనను దగియుండును. లౌకిక చింతాగ్ని తప్తముగాక (యువకులగు) మీమనస్సింకను కోమలము, నిష్కళంకమునై యున్నది. కావున దానిని సులభముగ భగవంతునివైపునకు మరల్ప వచ్చును. దృఢ ప్రయత్నముచే మనస్సునకు భగవత్ప్రవృత్తి కల్పించినచో, మీ పరమోద్దేశము సిద్ధించును; అంతట చిత్తవిక్షేపములచే బాధితులు గాకుందురు.

మనస్సు ఆవాలపొట్లము వంటిది. ఆవాలు చెదరిపోయెనా, వానిని ప్రోవుచేయుట చాల

కష్టము. వయస్సు వచ్చినకొలఁదియు, మన శ్శక్తి సామర్థ్యములు లౌకికచింతలలోఁ జెదరి పోయినకొలఁదియు, వానిని దిరిగి ప్రోవుచేసి— ఏకాగ్ర మొనర్చి — భగవంతునిపై పునకు మరలుచుట కష్టసాధ్యము.

భగవంతునితోడిదే నీ సర్వస్వమని భావించి వానినే నీ జీవితపరమప్రాప్యముగా నొనర్చు కొనుము. భగవత్సాక్షాత్కారమునకై మనః పూర్వకముగాఁ బూనుకొనుము; సమస్తతాపత్ర యమునుండియు విముక్తుఁడవు కాఁగలవు; శాశ్వతానందమును — బ్రహ్మానందమును — జూఱకొందువు.

మానవుఁడు సంసారమున సుఖము నందఁ గోరును, కాని యది వానికిఁ జేచిక్కునా? సదా సుఖాశచే బుద్బుద ప్రాయములగు ననేక విషయముల వెంటఁ బరువులిడుచు మానవుఁ డెంతయో ఆరాటపడుచుండును. ఇట్లు వాని జీవితమంతయు వ్యర్థమైపోవుచున్నది. మృత్యువు వానిని గబళించుచున్నది. నిజమైన సౌఖ్యము

నొందుటకై తుచ్ఛము, క్షణికమునగు లౌకిక సుఖములను విడనాడుము. మనఃపూర్వకముగా భగవదన్వేషణచేయుము. భగవంతున కాత్మార్పణ మొనర్చుకొంటివా, బ్రహ్మానందము నొందఁగలవు. అట్లుగాక సంసారమునకును, సాంసారిక సుఖములకును దాసుఁడవైతివా, నీ దుఃఖ మనంతము.

మీరు పిన్నవారు. మీ మనస్సింకను విషయ వ్యామోహితము కాలేదు, ప్రాపంచిక సంస్కార ముద్రితము కాలేదు: ఇప్పటినుండియు తీవ్ర ప్రయత్నము నొనర్పఁగలిగితిరేని, జీవిత శోక సంతాపములను దప్పించుకొంగలరు.

మానవజీవితపరమాదర్శము నెన్నఁడును మఱవకుము. పశుప్రాయులమై ఆహారనిద్రాదులతో వ్యయించుటకై ప్రాప్తించినట్టిది కాదు మనకీ మానవజన్మము. దుర్లభమగు మానవజన్మము నెత్తియున్నావు గావున విషయసుఖములను తృణీకరించి భగవత్సాక్షాత్కారమునొందుటకై బ్రహ్మానందమును బడయుటకై —దృఢదీక్షను

బూనుము. భగవద్దర్శనప్రయత్నమున మృత్యువు నెదుర్కొనవలసివచ్చినను జలింపకుము. భక్తి జ్ఞానపారవశ్యము నొంది శాశ్వతానందసామ్రాజ్యమునఁ బ్రవేశింపుము.

భగవత్కృప నొందుటయే ఆధ్యాత్మికజీవితమునందలి ముఖ్యోద్దేశము. భగవత్ కృపామారుతము సదా వీచుచునే యున్నది. నీ జీవననౌకయొక్క తెఱచాఁపలను నిండారవిప్పికొనుము. లౌకికభోగములను విడనాడి పూర్తిగా వాని కాత్మార్పణ మొనర్చుకొనుము. రాముని యందును కామునియందును నీ వేకకాలమున ననురక్తుఁడవు కాఁజాలవు. నీకు భగవంతుఁడు కావలసినచో, ఐహికసుఖములను త్రోసిరాజనుము. నీ కేమి కావలయునో యిప్పుడే నిర్ణయించుకొనుము. "బుద్బుదప్రాయము, తుచ్ఛము నగు సుఖములతోఁ గూడిన సంసారమా, లేక శాశ్వతబ్రహ్మానందమయమోక్షమా? నా కేది కావలయును?" అని నిన్ను నీవు ప్రశ్నించుకొనుము.

భగవంతుఁడు తన యాప్తుఁడని సంభావించి సమస్తలౌకికవాంఛలను వాని ప్రాప్తినిమిత్తమై పరిత్యజించువానికి భగవంతుఁ డత్యంతసన్నిహితుఁడు. అట్టి మానవుఁడు మాధవుని తన ప్రేమపాశములచే బంధించును.

భగవంతుఁడు నీవాఁడని భావింపుము. బిడ్డ తల్లితోఁ బలుకునట్లు ఆప్యాయముగా, "ప్రభూ! నాకు దర్శనమిమ్ము" అని వేఁడుకొనుము. భక్తుఁడు పరితపించినచో, భగవంతుఁడు కరుణింపకుండ నుండఁజాలఁడు. పరువున వానికడకు వెడలి వానిని దన యంకమునఁ జేర్చుకొని లాలించును. ఆహా! అదియెట్టి యనిర్వాచ్యానందము! ఎంతటి యఖండానందము! ఆ పరమానుభవము నొందినవానికే యది ఎట్టిదో తెలియఁగలదు. దానితోఁ బోల్చిచూచినచో లోకులకత్యంతప్రీతికరమగు సాంసారికసుఖములు కేవలనిస్సారముగా, నిరర్థకముగాఁ దోఁచును.

శ్రీ గురుదేవులు ఇట్లు వచించువారు: "భగవత్ప్రాప్తి నిమిత్తము విషయసుఖములను విడ

నాడినవాఁ డీవఱకే తన యాత్రలో మూఁడు వంతులు ముగించియున్నాఁడు.'' తృష్ణను విడనాడుట అంత సులభమా? పూర్వజన్మములలో తీవ్రవినియమనిష్ఠల నవలంబించి భగవత్కృపాపాత్రుఁడై యున్నప్పుడే యీజన్మమున విషయపరిత్యాగము నొనర్ప మనోబలము కలిగియుండును. లౌకికవాంఛయే తలయెత్తకుండునట్లు నీ మనస్సును నిర్మలమొనర్చుకొనుము.

సర్వము పరిత్యజించి నీవు నీ జీవితమును భగవానునకు అర్పించుకొంటివి. కాని నిష్కళంక జీవితమును గడపుట బహుకష్టసాధ్యమని గుర్తింపుము. అది యువకులగు మీ రనుకొనునంతటి సులభసాధ్యము కాదు. అది యెట్టిదో తెలియునా? ఒఱదీసిన కత్తియంచుపై నడచుట వంటిది.*

అఖండబ్రహ్మచర్యమే ఆధ్యాత్మిక జీవన విజయనియమము. అఖండబ్రహ్మచర్యావలంబ

* "క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథం తత్కవయో వదన్తి". —కఠోపనిషత్తు.

నమో, భగవంతునియందు శ్రద్ధాభక్తులు లేనిచో కష్టసాధ్యము—కాదు, అసాధ్యము. కామాదులతో, విషయసుఖములతోఁ గూడుకొనియున్న సంసారమున నీవు మనవలయును. నూటికిఁ దొంబది తొమ్మండుగురు వ్యామోహితులై విషయసుఖముల వెంటఁ బరుగులిడుచుండుట ప్రతి దినము నీవు కన్నులారఁ గాంచుచుందువు. నీ మనస్సు కలుషితమగుటకు ఎంతేని యవకాశము గలదు. కావున సదా సచ్చింతయందును సద్గ్రంథపఠనమునను ఆత్మోద్ధారకమగు తత్త్వవిచారమునను మనస్సును నియమింపవలయును. భగవదారాధనమునను, సాధుసంసేవనమునను, ధ్యానమునను కాలమును వినియోగింపవలయును. ఇదియే శీలమును ఉక్కుఁబఱచుకొను మార్గము.

అన్నిటికంటెను ముందు బ్రహ్మచర్యవ్రతనిష్ఠుఁడవై యుండుము. ఉంటివా, సర్వము నిన్ననుసరించును. భగవన్నిష్ఠుఁడవు గానిచో బ్రహ్మచర్య జీవనము నెఱపఁజాలవు; బ్రహ్మచర్యము లేనిచో

భగవత్సాక్షాత్కార మసాధ్యము. భగవ త్సాక్షాత్కారముతోడిదే యథార్థసౌఖ్యము, యథార్థసౌఖ్యము వినా, మానవజీవితము నిరర్థకము. నాయనలారా! కొంచెము కృషి చేయుఁడని మీకు నా ప్రార్థన. చేసితిరా, త్వరితగతిని శ్రద్ధాభక్తులు మీయందుద్దీప్తము కాఁగలవు. భగవద్దర్శనమహాభాగ్యము నొందుదురు; శాశ్వతానందము చూఱకొందురు.

## పూజాధ్యానము లనఁగా నెట్టివి?

శిష్యుఁడు: స్వామీ! పూజ, ధ్యానము, బ్రహ్మచర్యము, స్వాధ్యాయము నను సాధన లనుగూర్చి మీరు మాకుఁ దెలిపియుంటిరికదా? పూజ యనఁగా నేమి?

స్వామి: పూజ యనగా బాహ్యోపచారము లతోఁ గూడిన ఆరాధనయు మానసికారాధ నయుఁగూడనని భావము. పూజయందుఁ గొన్ని బాహ్యోపచారములు ఆవశ్యకము. వానిని యథావిధిగా, సకాలమున సమకూర్చుకొనుట కష్టము. మానసికారాధన నీకు విశేషాను కూలము. పూజలో నర్పింపబడు మాల్యధూప దీపాదులతో ఇష్టదేవతను మానసికముగా ఆరా ధించినపిమ్మట, ధ్యానమును మానసికజపమును జేయుచుండుము. కేవలమానసికజపమునఁ బెద వులనుసైతము గదల్పకుండ మంత్రమును జపింప వలయును. కాని సామాన్యజపమున (ఉపాంశు జపమున) మంత్రమును బైకి వినఁబడకుండ నుచ్చ

రింపవలసియుండును గాన, అందుఁ బెదవుల కదలిక యుండును.

ధ్యానమున నీ ఇష్టదేవత ప్రకాశవంతమై యున్నట్లును, తత్ప్రకాశము సర్వము భాసమాన మొనర్చుచున్నట్లును భావింపవలయును. ఇష్టదేవత సజీవమై యున్నట్లును, ఎఱుకగల్గి యున్నట్లును దలఁపవలయును. తద్రూపమును గూర్చి యిట్లు ధ్యానించుచుండఁగా, క్రమముగా రూపము అరూపముఁన, అఖండమున, లయించును. అంతట పరమాత్మ సాన్నిధ్యము విస్పష్టముగాఁ దోఁచును. తుదకు జ్ఞాననేత్రము వికసింప, పరమాత్మ సాక్షాత్కారము గల్గును. ఆహా! అది మఱియొక లోకము, లోకాతీతము! ఈ ప్రపంచము దానిముందు తృణప్రాయముగాఁ గాన్పించును. అపుడు మనస్సు లయమగును. అంతట సవికల్పసమాధిస్థితిని బొందుదువు. పిమ్మటఁ గల్గునది నిర్వికల్పసమాధ్యనుభవము —అఖండైక్యానుభవము. ఈ యనుభవము వర్ణనాతీతము, భావనాతీతము. చూడఁబడున

దేమియు లేదు, వినఁబడున దేమియు లేదు! అఖండము, అనంతము, అప్రమేయము, అద్వితీయము! ఇదియే అపరోక్షానుభూతి.

ఈ స్థితిని బొందినవాఁడు మిథ్యగాఁ దోఁచు దృశ్య ప్రపంచమునకు విశేష ప్రయత్నపూర్వకముగాఁగాని మనస్సును గ్రైకొనిరాఁజాలఁడు. ఇది ద్వైతాద్వైతములకు రెంటికిని అతీతము. ఈ స్థితిని బడసిన కొందఱు శరీరమును నిరంతరాత్మానుభూతికి ఆటంకముగాఁ బరిగణించి, సమాధిస్థితియందు త్యజించివైతురు. కుండ పగులఁగొట్టుటవంటిదిది.

పరమాత్మానుభూతి యెట్టిదో తెలుపుటకై శ్రీ గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) మనోహరమగు నొక సాదృశ్యమును దెలుపుచుండువారు. కొన్ని నీటికడవలు కలవనుకొనుము; వానిలో ప్రతిదానియందును సూర్యుఁడు ప్రతిబింబించుచున్నాఁ డనుకొనుము. తుద కొక్కటే మిగులు వఱకును నీ వా కడవలను బగులఁగొట్టుదువు; మిగిలినదానిలో సూర్యుఁడు ప్రతిబింబించు

చుండును. తుద కీ తుదిఘటము కూడఁ బగులఁ గొట్టఁబడును. అపు డిఁక మిగులున దేమి? స్వయముగా సూర్యుఁడేగదా! ఇట్లే స్వయం జ్యోతియగు బ్రహ్మము మనోబుద్ధ్యాదుల నెడి ఘటములలో ప్రతిఫలించుచున్నది. ఒకదాని వెంబడి నొకటిగా ఈ ఘటములను బగులఁ గొట్టుము. అనఁగా, బహిఃప్రజ్ఞను సూక్ష్మశరీరమును కారణ శరీరమును దాఁటిపొమ్ము. అంతట సవికల్పసమాధి నొందుదువు; అపుడు భగవంతునిఁ గనఁగొందువు. కాని యిచటను ద్వైతభావ ముండును—అహమనునది యుండును. ఈ యహంకారమ నెడి ఘటమునుగూడఁ బగులఁ గొట్టుము, అపుడిఁక మిగులున దేమి? బ్రహ్మ మొక్కటియే. అపు డిఁకఁ జూచువా రెవరు? చూడఁబడున దేమి? వర్ణింపఁబడున దేమి?

శిష్యుఁడు : స్వామీ, కొందఱు ఇష్టదేవతను సర్వాంతర్యామి, లేక సర్వవ్యాప్తముగా భావింతురు. ఇదియు నొక ధ్యానవిధానమేనా?

స్వామి : ఔను, నిశ్చయముగా, ప్రతి వ్యక్తియు ఈ ధ్యానము నవలంబింపవలయును,

కాని మొదట నేగాదు—ఆధ్యాత్మికజీవనమునం గొంత వికాసము నొందినపిమ్మట నే. భగవ త్సాన్నిధ్యము—భగవదస్తిత్వము — సర్వము నను అనుభూతము కావలయును. సగుణ సాకారమగు బ్రహ్మమే నిర్గుణనిరాకారముగం గూడ నున్నది. పరమేశ్వరుండు సర్వాంతర్యామి, సర్వభూతాంతరాత్మ. నేలను, నీటిని, కొండ లను, కనుమలను, ఆకాశమును, నక్షత్రములను —సర్వమును ఆవరించియున్నాండు.

శిష్యుండు : స్వామీ, గురుశుశ్రూష ఆత్మానుభూతికి ముఖ్యసాధనముగా శాస్త్రములు చెప్పుచున్నవిగదా? ఇది యెంతవఱకు నిజము?

స్వామి: ప్రారంభదశలో నిది యావశ్య కము. కాని తరువాత సాధకుని మనస్సే గురు వుగా వర్తించును. గురుని మానవమాత్రునిగా భావింపరాదు. *

---

* శ్లో. "ఆచార్యం మాం విజానీయా న్నావమన్యేత కర్హిచిత్,
నమర్త్యబుద్ధ్యా సూయేత సర్వదేవమయో గురుః॥"
—భాగవతము, 11-17-27.

గురుశరీరము ఈశ్వరావాసమగు నాలయము. ఈ మనోభావమున గురు నర్చించితిమేని, ఆతని యెడ దృఢభక్తి గలుగును, పిమ్మట నది తీవ్ర భగవద్భక్తిగా మాఱును.

సహస్రారమున గురుని ధ్యానించుచు, గురు స్వరూపమును ఇష్టదేవతాస్వరూపమున లయింపుము. శ్రీ గురుదేవులు (శ్రీ రామకృష్ణులు) ఇట్లు విస్పష్టముగాఁ జెప్పుచుండువారు: "దివ్య దర్శనమున గురువు శిష్యునకు ప్రత్యక్షమై ఇష్ట దేవతను సూచించి యిట్లు పల్కును: 'అదిగో చూడు, నీ యిష్టదేవత!' అంత నాతఁ డిష్ట దేవతాస్వరూపమున లయమొందును." గురువునకును భగవంతునకును నిజముగా భేదము లేనేలేదు.*

అనేక దివ్యతత్త్వములును భగవదనుభూతులునుగలవు. వాని విషయమంతయు నీకు నేనెట్లు

* శ్లో. "గురుర్బ్రహ్మ గురుర్విష్ణో గురుర్దేవో మహేశ్వరః,
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః."

చెప్పఁగలను? నిజమైన పూనికతో మోక్ష మార్గము నవలంబింపుము. ధర్మసాధనలవలన మనస్సు నిర్మలమైనంతనే అనేకతత్త్వములను గ్రహింతువు. అవి యపరిమితములని మదినుంచు కొనుము. భగవంతునియందు లీనమగుము. హృదయ దేవాలయమున ధ్యానింపఁ బ్రయత్నింపుము. ఈ యాలయ మెట్టిదో సాధనచేసిన కొలఁదియు నీకు అవగతమగును.

శిష్యుఁడు : ధ్యానమునఁ గొంచెము రుచి— ఆనందానుభూతి—కలిగినచో, సాధకుఁడు బ్రహ్మ మార్గమున బురోగమింప నుత్సాహమునొందును, కాదా అండీ ?

స్వామి : నిజమే. కాని, ఉన్నతాధ్యాత్మిక స్థితిలో సంతోషముగాని, విచారముగాని, సుఖము గాని, దుఃఖముగాని, అస్తిత్వముగాని, నాస్తిత్వము గాని తోఁచదు. నీవు చెప్పినట్టి సంతోషము సాధనదశలో కేవలము సాహాయ్యకరముగా నుండును. గమ్యస్థానము చేరువఱకును పడవకు అనుకూలవాయువు కావలయును. గమ్యమును

జేరినంతనే, ఇఁక వాయువు అనుకూలముగా నున్నను, ప్రతికూలముగా నున్నను ఒక్కటియే. సంతోషము అనుకూలవాయువువలె సాధకునకుఁ బురోగమనమార్గమునఁ దోడ్పడును.

జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు మూఁడును బ్రహ్మమున లయించును; శాస్త్రములు మనకుఁ జెప్పఁ గలిగిన దింతమాత్రమే. అటుపిమ్మట నేమి జరుగునో ఎవ్వరును వర్ణింపఁజాలరు. ధ్యానము నవలంబించువానికి మాత్రమే యిది ప్రత్యక్షానుభవము. భగవంతుఁడు కేవలము స్వసంవేద్యుఁడు. అఖండబ్రహ్మమును దెలిసికొనఁగోరెదవేని, స్వయముగా భగవంతుఁడవు గమ్ము. ఆ యఖండజ్ఞానావస్థయం దేకాంతయు, భయము నుండదు. అట్టి జ్ఞానభావనయే ఆత్మోద్ధారకమై యొప్పును.

భగవన్నిష్ఠులమై జీవించుట యెంతటి మహోల్లాసకరము! ఆనందదాయకము! జ్ఞానులగు కొందఱా యఖండసత్త ననుభూతమొనర్చుకొందురు. విశ్వమునఁ బైకిఁ గాన్పించు నానా

త్వము భగవానుని దివ్యలీలార్థము అవతార మూర్తియై యావిర్భవించునని వారెఱుంగు దురు. శ్రీకృష్ణుఁ డొకప్పుడు భావపారవశ్యమున నృత్యమొనర్చుచుండ నొక గోపిక తనచెలి కత్తెతో, "వేదాంతతత్త్వము నృత్యమొనర్చు చున్నది, చూడు"మనియెను. శ్రీకృష్ణుఁడే పర బ్రహ్మము. అఖండనిర్వికారపరమాత్మ యగు నాతఁడే మానవుఁడై క్రీడించుచున్నాఁడు. దీని కంటెను అతీతము, అగాధమునగు నాధ్యాత్మి కానుభూతి కలదు.

## ప్రారంభావస్థలో ధ్యానము మనస్సుతోఁ బోరుసల్పుట వంటిది

శిష్యుఁడు: స్వామీ! నే నెంత ప్రయత్నించి నను నా మనస్సింకను జంచలించుచు నేయున్నది. దానిని నిగ్రహించు టెట్లు?

స్వామి: క్రమము తప్పక జపధ్యానములను జేయుచుండుము; ఒక్కనాఁడైనను మానకుము. మనస్సు దుండగపుబిడ్డవంటిది—నిమిషమైనను నూరకుండదు. ఇష్టదైవముపై నిలుపుచు దానిని నిశ్చలమొనర్పఁ బదేపదే ప్రయత్నించుచుండుము. తుట్టతుదకు భగవద్ధ్యానమున నిమగ్నుఁడవగుదువు. రెండుమూఁడేండ్లపాటు సాధన సాగించితివా, అనిర్వచనీయానందము ననుభవింప సాగుదువు; మనస్సు నిశ్చలమగును. ప్రారంభమున జపధ్యానములు నీరసముగఁ దోఁచును. ఇది చేఁదుమందు పుచ్చుకొనుటవంటిది బలాత్కారముగ భగవచ్చింతయను ద్రావకమును నీ మనస్సునఁ బోసికొనవలయును. దీక్షతో సాధన సాగించినకొలఁదియు నానందనిమగ్నతఁ

జెందుదువు. పరీక్షలో నుత్తీర్ణుఁడగుటకై విద్యార్థి యెన్ని పాటులుపడునో! ఎంత చిత్తక్షోభ పడునో! భగవంతునిఁ దెలిసికొనుట యంతకంటెను సులభమని నీకుఁ దెలియదు కాఁబోలును! ప్రశాంత హృదయము తో మనఃపూర్వకముగ భగవంతుని ప్రార్థింపుము.

శిష్యుఁడు: స్వామీ! మీ వాక్కులు మా కుత్సాహమును గల్గించుచున్నవి. కాని నే నెంత ప్రయత్నించినను నేమియు వికాసమునొందని యట్లు నా కొక్కొక్కప్పుడు తోఁచుచుండును. అంతయు మిథ్యగఁ గాన్పించును. నిరాశ నన్నలము కొనును.

స్వామి: కాదు, కాదు, అట్లనఁబోకుము. నిరాశకుఁ దావు లేదు. ధ్యానఫలిత మనివార్యము. భక్తితో, లేదా, భక్తి లేకున్నను గూడ నీవు జపము సాగించినచో ఫలము నొందితీరెదవు. దీలన భక్తి క్రమముగాఁ గలిగితీరును. క్రమము తప్పక నీ సాధనను మఱికొంత సేపు సాగించు చుండుము. శాంతి నొందుదువు. ధ్యానమొనర్చి నచో, ఆరోగ్యముగూడ బాగుపడును.

ప్రారంభావస్థలో ధ్యానము మనస్సుతోఁ బోరుసల్పుటవంటిది. ప్రయత్నపూర్వకముగ చపలచిత్తమును నిగ్రహించి భగవత్పాదపద్మ సన్నిధి నుంపవలయును. కాని ప్రారంభదశలో ధ్యానసమయమున మెదటికి లేనిపోని యొత్తిడి కలిగింపకుండుపట్ల జాగరూకత కలిగియుండుము. నెమ్మదిగఁ బురోగమింపుము. క్రమముగా నీ ప్రయత్నము తీవ్రమొనర్పుము. క్రమసాధనచే మనస్సు నిలుకడచెంద ధ్యానము సుకరమగును. ధ్యానమున ఘంటలకొలఁది గూర్చుండినను నీ కేమియు శ్రమ యనిపించదు.

గాఢనిద్ర పట్టినతరువాత నేదదీఱ మనశ్శరీర ములకు హాయి తోఁచురీతినే ధ్యానానంతరము నీకు హాయిగా నుండుటయే కాక, గాఢానందాను భూతి కలుగును.

మనశ్శరీరము లొండింటితో సన్నిహితసంబం ధముగలవై యున్నవి. శరీరమునకు బాధ గలిగి నప్పుడు మనస్సును బాధితమగును. కావున శరీరారోగ్యమును గాపాడుటకై యాహార విషయమున ప్రత్యేక శ్రద్ధ వహింపవలయును.

సాధకుఁ డెన్నఁడును గడుపునిండ మెక్కక సగపాలు మాత్రమే భుజింపవలయును.

ధ్యాన మంత తేలికవైనదనుకొనఁబోకుము. మితిమీఱి తినినపిమ్మట మనస్సు అవశమై చలించుచుండును. మఱియు కామక్రోధాదులను నిగ్రహింపనిదే మనస్సు నిలుకడనందదు. పరిపరి విషయములమీఁదికిఁ బరువులిడుచుండు మనస్సుతో ధ్యానించు టెట్లు?

నీవు తీవ్రనియమనిష్ఠల నవలంబింపవలయును. నియమ నిష్ఠలనఁగా ఉగ్ర శారీర తపశ్చర్యలుగాని, శారీరహింసగాని కాదుసుమీ! వానినవలంబించుట సులభమే. కామ క్రోధాదులను నిగ్రహించుటయే నిజమైన తపస్సు (23-వ ప్రకరణము చూడుఁడు) ప్రబలమగునట్టి కామమును—ఉద్వేగమును—తలయెత్త నీయకుము. ధర్మము—పరమార్థము—నపుంసకునకుఁగాని కామాదినివారణకై శరీరజననత్త్వముల నడిగించుకొనువానికిఁగాని యుద్దేశింపఁబడినదికాదని సదా మదినుంచుకొనుము.

ధ్యానము చేయనిదే మనస్సును నిగ్రహింపఁ జాలవు. మనస్సు నిగ్రహీతముకానిదే ధ్యానింపఁ జాలవు. కాని నీవు, "మొదట మనస్సును నిగ్రహింపనిండు; తరువాత ధ్యానింతు" నను కొన్నచో, పారమార్థిక జీవన మెన్నఁటికిని ప్రారంభింప నే ప్రారంభింపవు. రెంటిని ఏకకాలమున నే యొనర్పవలయును—మనస్సును కుదుట పఱచుకొని ధ్యానింపుము.

ధ్యానమునకుఁ గూర్చుండునెడ, మనస్సు యొక్క ఉబలాటములను కోర్కెలను కేవల స్వప్నప్రాయముగాఁ దలపోయుము. వానినన్నిఁటిని మిథ్యాభూతముగాఁ గనుము. అవి యిఁక మనస్సుతో నెన్నఁడును సంగమునొందఁజాలవు. నిర్మలుఁడనని భావింపుము. క్రమముగా నీ మనస్సు వినిర్మలమై యొప్పును.

ధ్యానము సాగించుచుండ నీవు దివ్యజ్యోతినిఁ గనుఁగొనవచ్చును, లేదా, ప్రణవనాదమును వినవచ్చును. ఇట్టి దివ్యానుభూతు లనేకముగఁ గలుగవచ్చును. కాని వానిని లక్షింపరాదు. అవి

నీవు సత్క్రమమార్గగామివని తెలుపుటకే కాని యన్యథా నిష్ప్రయోజనములు.

భగవత్సాక్షాత్కారము నొందఁగోరెద వేని యోరిమితోడను బూనికతోడను సాధన సాగింపుము. సకాలమున సాక్షాత్కారము నొందుదువు; సకాలమున భగవానుఁడు నిన్ననుగ్రహించును. "కాలపరిపాకమునఁగాని తల్లిపిట్ట పొదిగి గ్రుడ్డును జిట్లఁగొట్టదు" అని శ్రీ గురుదేవులు వచించువారు. తాలిమి వహింపుము. తొందరపడుటవలన నేమియు లాభము లేదు. కృషియొనర్చి వేచియుండుము. ఈనిరీక్షణకాలమున దుస్సహామనుటకు సందియము లేదు. ఒక క్షణమున నీకంతయు ఆశాజనకముగఁ గాన్పించును. మరుక్షణముననే నిరాశగాఁ దోఁచవచ్చును; దుఃఖ మానందమును వెన్నాడుచునే యుండును. ఇటులీ సంరంభము దినములకొలఁది—ఏండ్లకొలఁది—సాగఁ దుట్టతుదకు భగవానుఁడు ప్రత్యక్షమగును.

## ౧౫

## నీవు కొంచెము సాధనచేసినచో, భగవంతుఁడే నీకుఁ జేయూఁత నొసంగును

స్వామి : నీ సాధనలు బాగుగా సాగుచున్నవా?

శిష్యుఁడు: స్వామీ, అంత బాగుగా సాగుట లేదు. వానియం దింకను నాకు రుచి కలుగలేదు. నాలో నేదియో అంతరాయ మున్నట్లు కనఁబడుచున్నది. నా కేమియుఁ దోఁచుటలేదు. చాల వ్యాకులముగా నున్నది. నేను దుష్టసంస్కారములతోఁ బుట్టి యుండవలయును, అవి నా యాధ్యాత్మికవికాసమున కడ్డు తగులుచున్నవి.

స్వామి: నాయనా! నీ వట్లు తలఁపరాదు. అర్ధరాత్రమున జపముచేయుము. అపుడు సాధ్యముకానిచో, వేకువజామునఁ జేయుము. మంత్రపురశ్చరణచేయుము. అమూల్యమగు నీకాలము నిఁక నెంతమాత్రము వ్యర్థము చేయకుము. ధ్యానప్రార్థనలలో నిమగ్నుఁడవుకమ్ము. ధృత్యుత్సాహములతో సాధనచేసిననే కాని పరమార్థద్వార మెట్లు తెఱచుకొనును?

సాధకుఁడు సూర్యాస్తమయానంతరము ఎక్కువగా భుజింపరాదు. సాధారణముగా నీవు తిను నాహారమున మూఁడువంతులు తిన మొదలిడుము. తరువాత దానిని సగమువఱకును తగ్గింపుము. మొదటఁ గొంత శారీరదౌర్బల్యము తోఁచవచ్చును. కాని కొంతకాలమైన వెనుక శరీరము దాని కలవడి చులుకుఁదనము కలిగి యుండుటేగాక, పరిపూర్ణారోగ్యస్థితిలో నుండును.

(అనంతరము స్వామి తనసోదరశిష్యుల సాంగత్యమునఁ దాను జపతపముల నొనరించిన దినములనుగూర్చి ప్రసంగించుచు నిట్లు నుడివెను: "ఇరువదినాలుగు ఘంటలలోను మే మప్పుడు ఒక్కసారియే భుజించువారము.")

స్వామి: సాధకుఁడు ఆధ్యాత్మికమార్గమును గూర్చి యొక మహాత్మునియొద్ద మొదట నేర్చుకొని, పిమ్మట దానిని సక్రమముగా అనుసరింపవలయును. ఏదో తనకుఁ దోఁచినట్లు చేసినచో, విశేషాభివృద్ధి నొందఁజాలఁడు. తిరిగి దానిని విడ

నాడినచో, వాంఛితార్థమును బొందుటకు ద్విగుణీకృత ప్రయత్నము చేయవలసివచ్చును. కాని, ప్రయత్న మేమియు వ్యర్థముకాదనుట నిజము. ఆధ్యాత్మికసాధన చేయువానిని కామ క్రోధలోభములు క్రమముగ విడిచివేయును.

నీ మన స్సిపుడు రజ స్తమస్సులచే నావరింపఁ బడి యున్నది. అది శుద్ధము, సూక్ష్మము నొనర్పఁబడి, సాత్త్వికస్థితి నొందున ట్లుద్ధరింపఁ బడవలయును. అంతట నీవు జపతపములలో ఆనందమును గనుఁగొని వానికై విశేషకాలము వినియోగింపఁగోరుచుందువు. అనంతరము మనస్సు పరిపూర్ణ సత్త్వము నొందినంత నే సదా ధ్యానించుటకేకాని యితర కార్యముల నొనర్ప బుద్ధి పుట్టకుండును. ప్రస్తుతము మనస్సు స్థూలమై యుండుటచే స్థూలవిషయములవెంటఁ బరుగిడుచుండును. కాని శుద్ధము, సూక్ష్మము నైనంత నే శుద్ధబోధ స్వరూపమగు భగవానునివైపు మరలును. మనస్సు (లేదా, బుద్ధి) సూక్ష్మమైనంత నే తచ్ఛక్తి యభివృద్ధినొంద సాధకుఁడు సూక్ష్మ భగవ త్తత్త్వమును వెంట నే గ్రహింపఁగలుగును.

నీవు ధ్యానమునకుఁ గూర్చుండునపుడు మొదట నొకానొక దివ్యానంద (దేవతా) రూపమునుగూర్చి చింతింపుము. అది నీ నాడుల కుపశాంతిదాయకమై యొప్పును. అటులొనర్పనిచో ధ్యానము శుష్కమై విసువు పుట్టించును. నీ యిష్టదేవతా స్వరూపమునుగూర్చి మందహాస భాసురము, ఆనంద ప్రపూర్ణమునై యున్నట్లు చింతింపుము.

కాలము నెంతమాత్రము నీవు వ్యర్థము చేయకుము. నీ యింద్రియము లిపుడు బలీయములై యున్నవి; వానిని నిగ్రహింపవలయును. ఇది కష్టసాధ్యమనుటకు సందియము లేదు. కాని ధ్యానమును ఏడెనిమి దేండ్లపాటు నిరంతరము అభ్యసించితివా, నీ సాధనఫలితమును, శాంత్యానందములనుఁ బొందెదవు. ఒక్కసంవత్సరము పాటు సాధన నొనర్చినను గొంత ఫలితము కానఁబడును. శిష్యురాండ్రగు స్త్రీలనేకులు త్వరితగతిని వికాసము నొందుచున్నారు. నీవును ప్రయత్నింపవలదా? కాని స్త్రీలకు పురుషుల కంటె విశేష శ్రద్ధాభక్తు లుండును. అందుచేతనే

వారంతకొలఁదికాలముననే విజయము నొందు చుందురు.

నమ్ముము నా మాట, భగవంతుఁడు సదా నీకు బ్రాపై యున్నాఁడు. నీవు కొంచెము సాధన చేసినచో, భగవంతుఁడే నీకుఁ జేయూఁత నొసఁగును. బాధలనుండియు విపత్తుల నుండియు భగవంతుఁడే మనలను గాపాడుచున్నాఁడు. వాని కృప యెంత అపారము! నీకు దానినిగూర్చి నే నేమని చెప్పుదును?

ఈ తత్త్వవిషయములనుగూర్చి నీవు కేవలము విని యున్నావు. ఇప్పుడు వాని ననుభూత మొనర్చుకొనుము. కావలసినంత చదివి వివేచన చేసియున్నావు. ఇప్పు డేదియో యొకసాధన నవలంబింపుము. నీకు బాగుగా నచ్చునట్టి భగవద్భావమును మొట్టమొదటఁ గైకొనుము. భగవానుని యనంతరూపములలో—కళలలో—ఒకదానియందు—నీ యిష్టదేవతయందు—నీకు భక్తియు దృఢానురక్తియుఁ బెంపొందుచున్నట్లు నీకుఁ దోఁచెనా, వాని సమస్తరూపములందును,

కళలందును భగవంతుని భజించుట ఆనంద దాయకమై యొప్పఁగలదు.

జపము చేయునపుడు ఇష్టదేవతాస్వరూపమును ధ్యానింపవలయును. లేనిచో జపము ప్రయోజనకారి కాదు. ఇష్టదేవతాస్వరూపమును సమగ్రముగాఁ జింతింపఁజాలనిచో, ఒక భాగమునుగూర్చిమాత్రమే చింతింపుము. ఇష్టదేవతా పాదారవిందములపై నీ ధ్యానము నారంభింపుము. విజయము నొందకున్నను ప్రయత్నమును విడనాడకుము. విజయము నొందనిదే ఎందుకు మానవలయును? విజయము నిశ్చయము. సాధనచే సర్వము సులభము కాఁగలదు.

ధ్యానము అంత సులభమైనపని యనుకొనుచుంటివా? అది సమాధికిమాత్రమే క్రిందిమెట్టని మదినుంచుకొనుము. సర్వము భగదిచ్ఛకు విడువఁ బ్రయత్నింపుము. సంపూర్ణముగా వానికి ఆత్మార్పణగావించుకొనుము. ధ్యానము సాగించినకొలఁదియు భక్తి, ఆత్మార్పణము, ఇతర సుగుణములును అంతరంగమునుండి వికాసము నొందును. (16–వ ప్రకరణము చూడుఁడు)

## ధ్యానించు టెట్లు?

శిష్యుఁడు: స్వామీ! నే నెట్లు ధ్యానింప వలయునో సెలవిండు.

స్వామి: నీ యిష్టదైవపాదపద్మములయందు నీ మనస్సును సుస్థిరముగా నిలుపుము.

శిష్యుఁడు: హృదయకేంద్రముననా, సహస్రారముననా?—ఏ కేంద్రమున ఇష్టదైవమును ధ్యానింపఁదగును?

స్వామి: ధ్యానమును ఈరెండు కేంద్రముల యందును అవలంబింపవచ్చును. ఏమయినను మొట్టమొదట నీ హృదయముననే ధ్యానించుట నీకు శ్రేయస్కరము.

శిష్యుఁడు: స్వామీ! ధ్యానవిధానమును సెలవిండు.

స్వామి: హృదయకమలకేంద్రమున నీయిష్ట మూర్తిని ధ్యానింపుము. (స్వామి యంతట శిష్యునకు ధ్యానమును గూర్చి సవివరముగా

బోధించెను. ఈ వివరములు స్వయముగా గురువు నొద్దనుండిమాత్రమే నేర్చుకొనఁదగినవి.)

శిష్యుఁడు: కాని, స్వామీ! హృదయము రక్తమాంసమయముగదా! అందు భగవంతునిఁ గూర్చి చింతించుటెట్లు?

స్వామి: శారీరశాస్త్రసంబంధమయిన హృదయమని కాదు నా యభిప్రాయము. హృదయముదాఁపుననుండు నాధ్యాత్మిక కేంద్రమును—విశుద్ధచక్రమును—చింతింపుము. ప్రారంభమున, శరీరమున ఇష్టదైవమునుగూర్చి చింతింతువు. కాని శీఘ్రకాలముననే నీవు శరీరవిస్మృతి నొంద పరమానందమయమగు నీ యిష్టదైవ స్వరూపముమాత్రమే యందు విరాజిల్లుచుండును.

శిష్యుఁడు: సరిగా పటములందును విగ్రహములందును గాన్పించురీతినే యిష్టదైవచింతనము చేయవచ్చునా?

స్వామి: పటముగాని, విగ్రహముగాని నీ యిష్టదైవ సజీవ చైతన్యమయ దేదీప్యమాన

స్వరూపమును నీ మనస్సున స్ఫురింపఁజేయుటకు కేవలము సహకారిమై యుండఁదగును.

శిష్యుఁడు: స్వామీ! మంత్రార్థమును ధ్యానించుటనఁగా సరియైన యభిప్రాయమేమి?

స్వామి: మంత్రార్థమేమి? అది భగవన్నామము. నీకొక పేరు గలదు. నిన్ను నేను బిలుచుచో, నీ రూపముగూడ నా మనస్సునకు గోచరించును. ఇదే రీతిని భగవంతునిఁగూర్చి చింతింపుము. మంత్రోచ్చారణతోఁబాటు ఇష్టదైవస్వరూపమును ధ్యానింపుము.

శిష్యుఁడు: మానసికముగా నుచ్చరించుచునా, లేక పైకి వినఁబడున ట్లుచ్చరించుచునా, జపము చేయు టెట్లు?

స్వామి: ఒంటరిగా నున్నప్పుడు పైకి వినఁబడున ట్లుచ్చరింపవచ్చును; లేనిచో, మానసికముగఁ జేయుము.

శిష్యుఁడు: స్వామీ! ఇటీవలఁ గొలఁదిదినములు ధ్యానసమయమున, తేజోమయాక్షర

కేవలయంత్రప్రాయముగ — అనాలోచితముగ —సాధన చేసినను ఎంతయో ప్రయోజనకరము. ప్రతి దినము జపమునకుఁగాను రెండుగంటలైనను వినియోగింపుము. ప్రకృతి రమ్యప్రదేశమగు నేకాంతస్థలమున నూరక కూర్చుండియున్నను, ఒకొక్కప్పుడు లాభకరమగును.

శిష్యుఁడు: ఇష్టదైవధ్యానము చేయుచుండ నితర దేవతాస్వరూపములు గోచరించుచో నే నేమి చేయవలయును?

స్వామి: అది యొక శుభలక్షణమని గుర్తింపుము. నీ యిష్టదైవమే వివిధరూపముల గోచరించుచున్నదని గ్రహింపుము. ఏకము, అనేకముఁ గూడ నాతఁడే. నీ యిష్టదైవమును ధ్యానించునపుడు మఱియొక రూపము గోచరించినచో, తద్దివ్యదర్శనానందము ననుభవింపుము. క్రమముగా సమస్త రూపములును కళలును ఇష్టదైవ స్వరూపమున లయించుచున్నట్లు కనుఁగొందువు.

అమావాస్య, పూర్ణిమ, అష్టమి, ఇతర పర్వదినములు—ఇవి సాధన కనుకూలములగు

శుభ దినములు. ఈ దినములలో జపధ్యాన ములకై మఱింత కాలమును వినియోగించు చుండుము.

శిష్యుఁడు: స్వామీ! భగవద్ధ్యానమునకు ముందు గురుపూజ చేయవలయునని శాస్త్రములు వక్కాణించుచున్నవిగదా! గురుపూజ నొనర్చు టెట్లు?

స్వామి: గురువును దైవమును ఒక్కరేయని గ్రహించి మొదట హృదయమున గురువును ధ్యానింపుము. పిమ్మట గురుస్వరూపము ఇష్ట దైవస్వరూపమున లీనము గావించి జపధ్యాన ములను సాగింపుము. (15-వ ప్రకరణమున తుదినాలుగు పరిచ్ఛేదములను జూడుఁడు.)

శిష్యుఁడు స్వామీ! నేను పితృసేవ చేయ వలయునని సదా మీరు నొక్కి వక్కాణించు చుందురు. సన్న్యాసినై మిమ్ముల సేవించుట యంతకంటె శ్రేయస్కరముగదా?

స్వామి: నిజమే. కాని కేవల కాషాయవస్త్ర ధారణము నిన్ను సన్న్యాసి నొనర్పఁగలదా?

వ్యాధిగ్రస్తుఁడగు నీ తండ్రిని సేవించి నీ కర్త
వ్యము నెఱవేర్పవలసియున్నది. నాయనా, ఈ
కార్యమునొనర్చుచుఁ దోడ్తోడనే క్రమాను
గతమగు నీ సాధనలను సాగింపవలయునని చెప్పు
చున్నాను. పితృసేవ నీ యాధ్యాత్మికవికాసమున
నీకుఁ దోడ్పడఁగలదు.

## భగవన్నిష్ఠుఁడవై యుండుము

స్వామి : నీవు ధ్యానముగాని, ప్రార్థనగాని చేయుచుందువా?

భక్తుఁడు : లేదండీ, స్వామీ.

స్వామి : భగవద్విషయమై ప్రతిదినము కొంచెము నీవు వినియోగించుచుండుట మంచిది. భగవన్నామసంకీర్తనము, ధ్యానము—మనో నిగ్రహమునకును మనశ్శాంతికిని ఇంతకంటె ఉపాయాంతరము లేదు.

భక్తుఁడు : ధ్యానించుటెట్లో దయతో సెలవిండు.

స్వామి : నీ హృదయగుహాలయమున భగవంతుని ధ్యానింపుము, లేదా, వాని చిన్మయ రూపము నీకట్టెదుట నున్నట్లు భావించి ధ్యానింపుము. మానసికముగా వానిని బూజింపుము. అర్చకుఁడు ఆలయమున దేవతకు పుష్పధూప దీపాదుల నెట్లు సమర్పించునో, అట్లే పూజా

ద్రవ్యముల నన్నింటిని నీ హృదయాలయమున సంస్థితమై యున్న చిన్మయమూర్తికి మానసిక ముగా సమర్పింపుము. కాలము నింక నెంత మాత్రము వ్యర్థము చేయకుము.

నేఁడే ప్రారంభింపుము. ఉదయ సాయం కాలములందు జపధ్యానములను జేయుచుం డుము. కనీసము రెండేండ్లు పాటయినను సాధన చేయుము. మహానందమును బొందుదువు భావ పారవశ్య ముదయించును; అపూర్వదృష్టి కలుగును. రెండేండ్లలోఁ గొంతఫలితము తప్పక పొందెదవు. కొంద ఱొక్క-సంవత్సరముననే సఫలత నొందుదురు. సాధనను విడువకుము, కొంతకాలమైనంతనే యిఁక ధ్యానమును విడువ బుద్ధిపుట్టకుండునంతటి యానందము నొందెదవు. ఒక క్రొత్తయాసనమును సంపాదించి దానిని నీ జపధ్యానార్థముమాత్రమే వినియోగించు చుండుము. నిబ్బరముగఁ గూర్చుండి అఱచేతులు వెలికిలగ నుండున ట్లెడమచేతిపైఁ గుడిచేతి

నుంచుకొనుము. శరీరమధ్యభాగమునకుఁ జేరువగ హృదయతలమునఁ జేతులను నిలుపుకొనుము.

పవిత్రగ్రంథములను బఠింపుము ధ్యానము నకుఁ గూరుచుండునెడ వెంటనే సాధన నారం భింపకుము. మొదటఁ గొలఁదినిముసములపాటు అన్యభావముల నన్నిఁటినిఁ బొలఁగఁద్రోసి మన స్సును భావరహితముగ నొనర్పుము. అపుడు ధ్యానమారంభింపుము. మొదటిరెండు సంవత్సర ముల వఱకును విశేషప్రయాసగ నుండును, తరువాత సుఃభతరమగును.

ఎంతయో పని చేయవలసియున్ననాఁడు ఒక్క మారే నీవు ధ్యానింపవచ్చును, లేదా, పది పదునేను నిముసములలో ముగింపవచ్చును. పని యొత్తిడి విశేషముగ నున్నచో, క్షణము భగ వంతునిపై మనసు నిలిపి, ప్రణమిల్లి ధ్యాన మును ముగింపుము. ప్రత్యేకసందర్భములలో నీ విట్లు చేయవచ్చును; కాని సర్వదా కాదు.

ధ్యానాత్ పూర్వము చేతులను మొగమును గడుగుకొనుము. సత్యమునే పలుకుచుండుము, సమస్త స్త్రీలను జగన్మాతృస్వరూపిణులుగ భావింపుము.— ఈ రెండు నియమములను జాగ్రత్తగఁ బరిపాలింపుము. ఇటు లొనర్చితి వేని యితరధర్మముల నన్నిఁటిని సులభముగ నవలంబింపవచ్చును.

భగవన్నిష్ఠుడవై యుండుము. భగవంతుఁడు కలఁడు. దేవునియునికినిగూర్చి సంశయింపకుము. నాయనా! చెప్పుచున్నాను విను; దేవుఁడు కలఁడు. నిజముగాఁ గలఁడని గ్రహింపుము.

# మనస్సు భగవంతునిపై నిలుపుము

మనస్సు సదా భగవదనుసంధానమున నిలుపుము. అంతట దుర్వృత్తులన్నియు అంతరించును. నిత్యపూజార్థ మొకగది నేర్పఱచుకొనుము; ఉదయసాయంకాలములందు దానిని వినియోగింపుము. క్రమము తప్పక సాధ్యమయినంతకాలము ప్రతిదినము జపధ్యానప్రార్థనల నొనర్పుము. భగవచ్చింతయందు నీ వెంత విశేషకాలము వినియోగింపఁగలుగుదువో నీ జీవిత మంతటిఫలప్రదమై యొప్పును; నిస్సార సంసారవిషయములయెడ బద్ధుఁడ వైన కొలఁదియు నీ మనశ్శాంతి సన్నగిల్లుచుండును. తన యనంతకృపాకటాక్షమున నిన్ను సన్మార్గమున నడుపుఁగాక యని సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.

ఇది గ్రహింపుము : భగవదారాధన నొనర్పనిదే నీ కెన్నఁటికిని మనశ్శాంతి కలుగఁజాలదు.

కావున భగవదారాధనమున, జపధ్యానసంకీర్త నములలో, ప్రతిదినము కొంతకాలము వినియోగింపుము. నిజమయిన శ్రద్ధాభక్తులును జ్ఞానమును దీర్ఘకాలము దీక్షతో సాధనలను సాగించుటవలనఁ గలుగు ఫలములు. మందవైరాగ్యముతో సాధనల నొనర్చి తత్ఫలితముగ భగవంతునిఁ గనఁజాలనిచో, లేదా, బ్రహ్మానందమును బడయఁజాలనిచో, అనేకులు భగవద్విషయమున సంశయాత్ము లగుచుందురు. కారణము సువిదితము. వీరు భగవంతునియందు నిజమయిన యనురక్తులుగారు. కావున సాధనమార్గమున వీరు దీక్ష వహించుట దుర్లభము. నియమనిష్ఠలు ఇట్టివారికి దుర్భరములై తోఁచును.

దివ్య ప్రేమానురాగములు కలుగనిచో మనస్సు శుష్కమై శాంతిరహితమగును. భగవత్ప్రాప్తి నిమిత్తమై యెంతగాఁ బరితపింతువో తుదకంతటి శాంతి నొందుదువు. "ఉల్లాసముతో నీ ప్రయత్నమున దీక్ష వహించితివా, ఏ యాటంకములు వచ్చినను విజయము నంది

తీరుదువు" అని శ్రీ రామకృష్ణభగవానులు వచించియున్నారు. కావున సాధనలయందు నిమగ్నుఁడవై వానిని దీక్షతో సాగింపుము. ప్రాణాపాయమునకైనను వెఱవకుము.

త్యాగాగ్ని రగుల్కొననిదే హృదయమున భగవచ్చింతను బురికొల్పుట నిజముగా దుర్లభము. ఈ త్యాగాగ్ని—వైరాగ్యగ్ని—హృదయమున నెంతగా రగుల్కొనునో మానవుఁడంతటి శాంతి నందునని నా నిశ్చయము. గురుదేవుఁ డెంతటి వివేకవైరాగ్యమూర్తియో మేము కన్నులారఁ గాంచియున్నాము. కాలము గడచినకొలఁదియు మన కాయనతత్త్వము విశేషముగా బోధపడఁగలదు. వివేకవైరాగ్యములను గూర్చి శాస్త్రములలో మనము పఠింతుము, కాని యాయనయం దవి మూర్తీభవించుటను గాంచియున్నాము.

నీ సాధనలను గుప్తముగా నుంచవలయును గాని ప్రతివానికిని వెల్లడింపరాదు.

లేచువాఁడనుగాను'' అని ప్రతిజ్ఞఁబూని కడసారి ధ్యానస్థితుఁడయ్యెను.* జ్ఞానోదయమయ్యెను.

* శ్లో. "ఇహాసనే శుష్యతు మే శరీరం,
త్వగస్థిమాంసం విలయం చ యాతు,
అప్రాప్యబోధిం బహుజన్మదుర్లభాం,
నైవాసనాత్ కాయ మతశ్చలిష్యతే"

("ఈ నా శరీర మిచటనే యెండిపోవుఁగాక, ఇందలి యెముకలు, మాంసమును శిథిలమైపోవుఁగాక, ఏ యనంత జ్యోతిర్దర్శన మతికష్టసాధ్యమో, యా యనంతజ్యోతిర్దర్శనము లభింపనిదే యుగసహస్రము లయినను ఈ శరీర మీ యాసనమునుండి చలింపరాదు.")

## భగవచ్చింతానిమగ్నుఁడవు కమ్ము

శిష్యుఁడు: స్వామీ! గురుదేవులగు శ్రీరామ కృష్ణులింకను ఉన్నారనియా మీ యభిప్రాయము?

స్వామి: మతి పోయినదా నీకు? ఆయన ప్రత్యక్షమూర్తియై యుండనిచో, మేమందఱము యిల్లు, వాకిలి విడిచిపెట్టి యీ సన్న్యాసజీవనము చేయుచుండనేల? ఆయనున్నారు. హృదయపూర్వకముగ ఆయనను ప్రార్థింపుము. ఆయనను గాంచను, దెలిసికొనను వేఁడికొనుము. నీ సకల సంశయములను నివారించి నిజస్వరూపమును నీకుఁ జూపుదురు.

శిష్యుఁడు: స్వామీ! తమ కాయన ప్రత్యక్షమా?

స్వామి: ఔను. ఆయన కృపవలన ప్రత్యక్షమే. ఆయన కృపఁజూచినచో నెవ్వరైనను ఆయనను దర్శింపవచ్చును. కాని యెంద ఱాయ

నను ప్రేమింతురు? ఎంద ఱాయనను జూడఁబరిత పింతురు?

భగవత్సాక్షాత్కారము నొందుటనిన, మాటలుగాదు. శారీరమానసికాధ్యాత్మికశక్తులన్యోన్యసామరస్యమున వికాసము నొందనిచో ధర్మమనునది—పారమార్థిక జీవనమనునది—యసంభవము. శ్రద్ధ, అఖండశ్రద్ధ! శ్రద్ధావంతుఁడు భగవంతునిఁ జూచినవాఁడే.

శ్రద్ధయున్నచో గవ్వయైనను అమూల్యమై యొప్పును. శ్రద్ధ లేనిచో బంగారమయినను నిరర్థకమైపోవును. భగవంతునియందు నమ్మిక లేనివాఁ డన్నిటిని సంశయించుచునే యుండును. నమ్మికగలవాఁడో, సమస్తసంశయములను ద్రోసి రాజనును.

సంసారమునెడ వైరాగ్యము కలుగనిచే శ్రద్ధాభక్తులు వికాసము నొందఁజాలవు. వైరాగ్యము నొందవలయును. భగవన్నిష్ఠులమై యహంకారమును విడనాడుటయే వైరాగ్యము.

శిష్యుఁడు: స్వామీ, నేను ధ్యానమునకుఁ గూర్చుండునపుడు నామనస్సు పరిభ్రమించుచు ననంతవిషయములఁ గూర్చి చింతించుచుండును. ఈ చాంచల్యమును నిరోధించు టెట్లు?

స్వామి: ప్రారంభమున సర్వదా ఇట్లు జరుగుచునే యుండును. గంగానదికిఁ బోటుపాటు లున్నట్లే ప్రారంభదశలో సాధకుని పారమార్థిక మనోభావములకును బోటుపాటు లుండును. కాని సాధన సాగించుచురాఁగా, కాలక్రమమున నిట్టి యొడుదొడుకుల నొందకుండ మనస్సు భగవంతునిపై పు సంతతధారగాఁ బ్రవహింపసాగును. కాని నీ మనస్సుయొక్క విపరీతబహిఃప్రవృత్తి నరికట్టుటకై నీవు శ్రద్ధతోఁ బ్రయత్నింపవలయును. దానిని జయప్రదముగ నెఱవేర్చు విధానమిది. కూర్చున్నంతనే యెన్నఁడును ధ్యానమారంభింపఁ బోకుము. బహిఃప్రవృత్తులనుండి వివేకమువలన మనస్సు మరల్చి, యిష్టదేవతా పావనచరణోపాంతమున, అంతరంగమునబంధించి యంతట జపధ్యానముల నొనర్పుము. కొంత

కాలమువఱకీ పద్ధతి నవలంబించినచో సహజ
ముగ మనస్సు పరిభ్రమించుట మానును.

జపమార్గ మత్యంతసులభగమ్యము. నిరంతర
జప సాధనవలన మనస్సు సులభముగ ప్రశాంత
మును నిశ్చలమును నొనర్పఁబడఁ దదు భగ
వచ్చింతయందు లయించును. కావున సక్రమము
గను దఱచుగను జపము చేయుమనియుఁ దోడ్తో
డనే యిష్టదైవధ్యానము చేయుచుండుమనియు
నీకు నేను హితముచెప్పుచున్నాను. ఈ సమ్మేళ
నము విశేషశీఘ్రముగ విజయము నొసఁ
గూర్చును.

సదా అచంచలదీక్షతో నీ సాధనల నవలం
బించుచుండుము. సాధనచేయకుండ నొక్క
దినమయినను గడపకుము. ఇష్టమున్నను,
లేకున్నను, నియమిత కాలమున ప్రతిదినము
నందులకై కూర్చుండుము. ఏమరుపాటెఱుఁగని
యిట్టి క్రమమున మూఁడేండ్లపాటు నీ సాధనలను
నీవు సాగింపఁగలిగితివా, భగవద్భక్తి నీయందు
వికసించుననియు విశేషముగ భగవత్సాన్నిధ్య

మొందుచున్నట్లు నీకు అనుభూత మగుననియు నొక్క వక్కాణింపఁగలను. వానినే లక్షింపుమని —ప్రార్థింపుమని—నీ యంతరంగ మంతట ప్రేరేచును. మఱి యే యితరవిషయమువంకకును నీ మనస్సును మరల్పఁ జాలకుందువు. ఈస్థితి యందే సాధకుఁడు తనహృదయమున ఆధ్యాత్మిక జీవనానందమును గాంచును.

భగవద్భక్తి లేనిదే, ఏకాంతవాస మొనర్చు చున్నను గూడ, ఆధ్యాత్మికసాధనల నవలంబించుట దుష్కరము. ఒంటరిగా నున్నప్పుడు సదా భ్రమప్రమాదములు గలుగుట కాస్పద మేర్పడుచుండును. కావున నేకరీతియు, ఏకమనో భావమును గల వారిరువురు కలిసి మనుచుండ వలయును, అట్టిచో నెన్నఁడైనను నుభయులలో నెవ్వరికైనను పతనభయము సంభవించు నెడల, పరస్పర సాహాయ్యమును హితోపదేశమును బొందవచ్చును. కాని యిందులకు భిన్నముగ నిరువురకంటె నెక్కువమంది యున్నయెడల, గందరగోళము బయలుదేఱవచ్చును. వారు

లోకాభిరామాయణమునకు దిగవచ్చును. అట్టి వ్యర్థప్రసంగము లుత్తమప్రవృత్తులను ఉన్నతాశయములను బోఁగొట్టుటయేకాక, భగవంతుని విస్మరింపఁజేయును.

తీవ్రసాధన నవలంబించునపుడు నీ యాహారము నత్యల్పపరిమాణమునకుఁ దగ్గింపవలయును. కడుపార భుజించినపిమ్మట జపధ్యానములు సాధ్యము కావు. ఏలన నీ శక్తిసామర్థ్యములలో విశేషభాగ మాహారజీర్ణక్రియయందే వ్యయమగుటయు మనస్సు కలఁత నందుటయు సంభవించును. ఇందువలననే యుక్తాహారవిహారాదులంతగా భగవద్గీతయందు నొక్కిచెప్పఁబడి యున్నవి.

భగవానుఁ డిట్లు పలుకుచున్నాఁడు: "మితిమీఱి భుజించువానికిఁగాని, యమితముగా నుపవసించువానికిఁగాని, యోగము లభింపదు. మితిమీఱి నిద్రించువానికిఁగాని, యూరక జాగరణము

చేయుచుండువానికిఁగాని యోగము సాధ్యము కాదు"*

పావనమైన యీ మఠమున సాధన కెన్ని మహోత్తరమైన సదుపాయములు గల్పింపఁబడి యున్నవో! అన్నవస్త్రాదులనుగూర్చి మీరెంత మాత్రము తాపత్రయ పడనక్కఱ లేదుగదా! సర్వము సంసిద్ధమై యున్నది. ఇచట నివసించుచు, జపధ్యానపరాయణమగు జీవనమును మనఃపూర్వకముగా నవలంబింపుము. నాయనా! యూరక త్రిమ్మరివై జీవించుటవలన నేమియు లాభము కలుగఁబోదు.

అందందుఁ బరిభ్రమించుటచే ఋషివో, మహాత్ముఁడవో యగుదువని తలంచుచుంటివా, పొరపడుచున్నావని చెప్పవలసియున్నది. ఆవిధ

* శ్లో. "నా త్యశ్నతస్తు యోగోఽస్తి న
చైకాంత మనశ్నతః,
న చాతి స్వప్నశీలస్య జాగ్రతో
నైవచార్జున."—గీత, 6-16.

ముగ నీ వెన్నఁటికిని ఋషివి కాఁజాలవు. సంతత సాధన లేనిదే పారమార్థికానుభూతి కలుగఁ జాలదు; కేవల కపటోపాయముచే దానిని బొందఁ జాలవు. నిజముగా నీకు భగవత్పరితాపము గలిగి నచో, ధ్యానపరాయణుఁడవై భగవచ్చింతా నిమగ్నుఁడవు కావలయును. (39-వ ప్రకరణ మును జూడుఁడు.)

## సదా నామస్మరణ చేయుచుండుము

స్వామి: ఇంద్రియములకు మనస్సు పరిపాలనకర్త. కావున మొట్టమొదట మనస్సును నిగ్రహింపవలయును. పిమ్మట మనోబుద్ధులు ఆత్మయందు లయమొనర్పఁబడవలయును. సాధుసాంగిత్యమున నున్నప్పుడు కామక్రోధాదులు నిర్మూలనమైనట్లు తోఁచవచ్చును; కాని యవి సూక్ష్మరూపమున నిలిచియుండును. సమాధిస్థితిని బొందిన పిమ్మట మాత్రమే యవి నిర్మూలనమగును. అంతఃకరణాతీతుఁడవగు నంతవఱకు సదా మెలఁకువగలిగి వర్తించుచుండుము.

దేవుఁడు కలఁడు. బ్రహ్మవిద్య—పరమార్థము—మిథ్యాభూతము కాదు; యథార్థము. కేవలము జనులను, నీతివర్తనులను జేయుటకుఁగాని, సమాజమునఁ గట్టుపాటు నెలకొల్పుటకుఁగాని యీ తత్త్వములు బోధింపఁబడినవి కావు. నిక్కముగా దేవుఁడు కలఁడు; దేవుఁడు పరమ

సత్య స్వరూపుఁడు. వానిని మనము సాక్షాత్క-
రించుకొనవచ్చును. మనస్సంయమ సంపన్నుఁ
డవై, ప్రశాంతుఁడవై, సుఖదుఃఖ సముఁడవై,
యుండుము. వేగుజామునను, మధ్యాహ్నము
నను, సాయంసమయమునను, అర్ధ రాత్రమునను-
ఇట్లు దినమునకు నాలుగుసార్లు క్రమము
తప్పక ధ్యానించుచుండుము, ఇవియే ధ్యానము
నకు ఉత్తమ సమయములు. నీ యాదర్శమున
సుస్థిరుఁడవై సర్వావస్థలయందును నిష్ఠతో నీ
సాధనలను సాగించుచుండుము. ప్రతిదినము గీత
యందొక యధ్యాయము పారాయణ మొనర్చు
చుండుము. వ్యర్థ చింతలతోడను తాపత్రయము
తోడను మనస్సాందోళన చెందుచున్నప్పుడు
గీతాపఠనము వలన దానిని నిర్మల మొనర్ప
వగును. ఇది నా కనుభవ సిద్ధము.

ఆత్మవిచారమునఁ బ్రతిదినము కొంతకాలము
వినియోగించుచుండుము. నిన్ను నీవిట్లు ప్రశ్నించు
కొనుము: "ఈ లోకమునకు నే నేల వచ్చి
యున్నాను? నా కాలము నెట్లు గడుపుచున్నాను?

భగవంతుఁడు నిజముగా నాకుఁ గావలయునా? వానిని గనుఁగొనుటకై నిజముగా నేను ప్రయత్నించు చున్నానా?'' మనస్సు మానవుని వంచింపఁ జూచుచుండును. మనస్సునకు మానవుఁడధీనుఁడు గారాదు. దానిని నిగ్రహించి దాని కధీశుఁడై యుండవలయును. సత్యనిష్ఠను వీడకుము. నిర్మల హృదయుఁడవై యుండుము. నిర్మలుఁడవైన కొలఁదియు నీ మనస్సు భగవంతునియందు లయము గాంచుచుండును. అతి సూక్ష్మముగా నీ మనస్సు నిన్ను వంచించి యెట్లు లోబఱచుకొనుచుండునో నీకు గోచరమగును. దాని పన్నాగముల నిర్మూలింపఁ గలుగుదువు. నీ శత్రువు లెవరు? నీ యింద్రియములే. కాని నీవు వానిని నిగ్రహించితివా, యవి నీకు నెచ్చెలు లగును. మనస్సే నీ శత్రువు, మనస్సే నీ మిత్రుడు.* ఆత్మవిచారము చేయువాఁడు మనస్సుయొక్క పన్నుగడలను గనిపట్టి

* శ్లో. "ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్,
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః."

వానిని నిర్మూలింపఁగలుగును. అంతట బ్రహ్మ పథమున త్వరితముగఁ బురోగమింపఁగలుగును.

---

శ్లో. "బంధురాత్మాత్మన స్తస్య యేనా త్మై వాత్మనా జితః,
అనాత్మన స్తు శత్రుత్వే వ ర్తే తా త్మైవ శత్రువత్."
—గీత, 6-5,6.

మానవుఁడు తన మనస్సుచేఁ దన్నుద్ధరించుకో వలయును. తన్ను అధోగతి నొందించుకొనరాదు. తనకు మనస్సే బంధువు, మనస్సే శత్రువు.

ఎవఁడు తన మనస్సుచే దేహేంద్రియాదిసమూహమును జయించు చున్నాఁడో వానికిఁ దన మనస్సు ఉపకారి యగును. ఇంద్రియజయము లేనివానికో, మనస్సు శత్రువుగా నుండును.

ఉ. "లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ వింద్రియా
పీకముఁ జి త్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు పీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
పీకు విరోధి లేఁడొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా!"
—శ్రీమదాంధ్రభాగవతము, ప్రహ్లాదచరిత్ర,7-267.

జపధ్యానసాధనయందు నిమగ్నుఁడవగుము. మనస్సు స్థూలమై యుండుటచే స్థూలవిషయములఁ బట్టుకొని ప్రాఁకులాడుచుండును. కాని జపధ్యానము లాచరించుచున్న కొలఁదియు మనస్సు సూక్ష్మమై సూక్ష్మతత్త్వములను గ్రహింప నేర్చును.

సాధన, సాధన, సాధన. "కలఁడు కలండనెడి వాఁడు కలఁడో లేఁడో" నీయంతట నీవే కనుఁగొనుము. కొంచెము శారీరతపస్సాకొక్కప్పుడు మేలుచేయుచుండును.

అమావాస్యనాఁడును ఏకాదశి యందును ఒక్కపూఁటనే భుజించుచుండుము. ఉబుసుపోని కబుర్లతో వ్యర్థకాలక్షేపము చేయకుము. సదా భగవంతుని మదినుంచుకొనుము. నీవు భుజించునపుడు, కూర్చుండునపుడు, పండుకొనునప్పుడు, వేయేల, ఏ పని చేయుచున్నను వానిని స్మరించుచుండుము. ఈ విధముగా సాధన చేసితివేని, ధ్యానమునకుఁ గూర్చుండు నపుడు భగవత్స్మరణ సులభము కాఁగా, మనస్సు సహజ

ముగా భగవంతునియందు లయమొందును. మనస్సు ధ్యాన నిమగ్నమైనంతనే యానంద నిర్ఝరి నీ యంతరంగమునుండి వెలువడును.

వ్యర్థప్రసంగములందుఁగాని, లేనిపోని తాపత్రయమునగాఁగాని కాలమును వ్యయింపకుము. ఉబుసుపోని సుద్దులు శక్తిసామర్థ్యములను దుర్వినియోగ మొనర్చును. "నిరర్థక ప్రసంగములను విడనాడుము" * అని యుపనిషత్తులలో మనము పఠింతుము.

ఆత్మధ్యానముననే నీ కాలమును వినియోగింపుము. "మనస్సును నా కర్పింపుము, నా భక్తుఁడవు కమ్ము, నన్నుఁ బూజింపుము, నాకు నమస్కరింపుము" ** అని భగవద్గీత యందుఁ జెప్పఁబడియున్నది. "నీ మనశ్శక్తి నెన్నఁడును దుర్వినియోగము చేయకుము" అని శ్రీ గురు

* "ఆత్మాన మన్యా వాచో విముంచథ."—ముండకోపనిషత్తు.

** "మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు."
—గీత, 9-34.

దేవులు వచించువారు. అనఁగా భగవానుని నీవు సదా స్మరించుచుండ వలయునన్నమాట. లౌకికుఁడు తన ధనము నూరక వ్యయింపకుండునట్లు బహుజాగరూకుఁడై యుండును. కాని తన మనస్సు నెట్లు దుర్వినియోగ మొనర్చుచున్నాఁడో గ్రహింపఁడు. నిరంతరభగవత్స్మరణకంటె సులభతరమును మహత్తరమును నగు సాక్షాత్కార సాధన వేఱొండు లేదు. అట్టి సాధన కుండలినీ శక్తిని మేలుకొలుపును. ఒకదాని వెంబడి నొకటిగా మాయావరణములు తొలఁగును. నూతనదృష్టి కలుగును. నీయం దెట్టి యద్భుతనిధి నిహితమై యున్నదో నీ కపుడు గోచరించును. నీ దివ్యత్వము వికసితమై యొప్పును.

శ్రీ రామకృష్ణదేవునిఁ బ్రార్థింపుము. ఆయన ఇంకను ఉన్నారుసుమీ! మనఃపూర్వకముగాఁ బ్రార్థించితివా, ఆయన దారిఁ జూపుదురు. "నేను నీవాఁడను; నీవు నావాఁడవు." ఆయన యొలుకలో లీనమగుము.

సర్వసాధారణముగా మనస్సు నదివలె నిమ్నగామిని యగుచుండును, అధోగతి నొందు

చుండును—కామినీకాంచనముల దెసకు, పేరు ప్రతిష్ఠలవైపునకుఁ బరుగిడుచుండును. మనో గమనమును మరలింపుము, దాని నూర్ధ్వ ముఖముగ—భగవదున్ముఖముగఁ బ్రవహింపఁ జేయుము. శ్రీ రామకృష్ణ దేవుని మనస్సు సదా అతీంద్రియభూమికయందు నిలిచి వెలయు చుండెడిది. విశేష ప్రయత్నమున మాత్రమే యాయన తన మనస్సును సామాన్యబహిః ప్రజ్ఞకును లౌకిక విషయముల వంకకును మరల్చు వారు.

జపము, జపము, జపము! పనిచేయుచున్న ప్పుడును జపము నాచరించుచుండుము. సమస్త కార్యములనడుమను భగవన్నామచక్రమును దిరుగనిమ్ము. దీనిని సాధింపుము. సమస్తతాపత్ర యమును జల్లారిపోవును. భగవన్నామము నాశ్ర యించుటచే నెందఱు పాపులు పునీతులై, విముక్తులై, దివ్యులై వెలసియున్నారో నీ వెఱుఁ గవా? భగవానునియందును వాని నామము నందును దృఢవిశ్వాసముఁ బూనుము భగ

వంతుఁడును వానినామమును నొక్కటియే యని గ్రహింపుము. భగవంతుఁడు భక్తహృదయమున నెలకొని యుండును.

మనఃపూర్వకముగా భగవంతుని వేఁడు కొనుము; "నన్ను కృపఁ జూడుము, నాకు శ్రద్ధా భక్తుల ననుగ్రహింపుము" అని ప్రార్థింపుము. మనఃపూర్వకముగాఁ బ్రార్థింపుము. నీ మనో వాక్కులను ఏకము చేయుము.

సర్వము భగవన్మయముగా, జూడుము. సర్వ భూతములయందును భగవంతునిఁ గనుము. ఎల్లెడలను భగవంతునిఁ గననేర్చినంతనే, "తృణాదపి సునీచేన" యనునట్లు గడ్డిపోఁచ కంటెను వినీతుఁడవై యుండుము. భగవంతునిఁ గూర్చియే వినుము, వానిఁగూర్చియే మాట్లాడుము. భగవన్నామము చ్చరింపఁబడని తావును శ్మశానమువలె విడనాడుము.

భగవన్నామము నుచ్చరించుచు భగవానునిఁ బ్రార్థింపుము. అతఁ డెల్లరకును ఆప్తుఁడు.

అత్యంతాప్తుఁడు. అతఁ డెందులకు నీకు దర్శన
మీయకుండును? నీ హృదయమును విప్పి వానిని
వేఁడికొనుము. భగవానుఁడు నిన్ను సత్క్రమ
మార్గమున నడపును. భగవన్నామముకంటెను
వానిని గూర్చిన ధ్యానముకంటెను మనలను పునీ
తులను జేయు నుపాయము వేఱొండు లేదు.
భగవంతుఁడు మనవాఁడు. సులభముగా మనకు
సాక్షాత్కరించును.

ఒకటి భక్తిమార్గము, రెండవది జ్ఞాన
మార్గము—రెండును సాక్షాత్కారసాధనములే.
భక్తుఁడు భగవద్రూపముఁ జూడ నభిలషించును.
అతఁడు వానిఁ బ్రార్థించును, స్తుతించును,
నామకీర్తన మొనర్చును, వాని దివ్య స్వరూప
మును దర్శించును. ఒక్కొక్కప్పుడు నవ్వును. *

* సీ. "వైకుంఠ చింతావివర్జితచేష్టుఁడై,
యొక్కఁడు నేడుచు నొక్కచోట,
o o o
విష్ణుఁ డింతియకాని వేఱొకండు లేదని,
యొత్తిలి నగుచుండు నొక్కచోట.....
—భాగవతము, ప్రహ్లాదచరిత్ర, 7-124.

జ్ఞానమార్గావలంబు లాత్మజ్యోతి నన్వేషిం తురు. వారాత్మసాక్షాత్కారము నొందుదురు. ఎటులయినను తుదకు భక్తుఁడును జ్ఞానియు నేక మగుదురు. ఏకగమ్యమును బ్రాపింతురు. జ్ఞాన మార్గావలంబనమునను భక్తిమార్గావలంబనము నను గూడ నజ్ఞాననాశనము అగును. జ్ఞానజ్యోతి — పరంజ్యోతి — యొక్కటియే వెల్గొందు చున్నది. జ్ఞాన తేజమున కవ్వల నున్న దేమి? ద్వంద్వాతీతునకే యెఱుక. అది యెట్టిదో యెవ్వరును ఇదమిత్థముగాఁ దెలుపజాలరు.

## ౨౧

## మంత్రోపదేశము నొందుట ఆవశ్యకమా?

శిష్యుఁడు: స్వామీ, మంత్రోపదేశము నొందుట నిజముగా ఆవశ్యకమా?

స్వామి: ఔను! మంత్రోపదేశము—మంత్రదీక్ష—బహుముఖ్యము. మంత్రసాహాయ్యమున మనస్సును ఇష్టదైవముపైన ఏకాగ్రము చేయఁ బూనుట సులభతరము. మంత్రము లేనిదే మనస్సు ఒక భగవద్భావమునుండి మఱియొక భావమునకుఁ బరుగులిడుచు, దేనియందును ఏకాగ్రము కానేరకుండును. పరిపూర్ణమగు చిత్తైకాగ్రత పట్టువడనిదే ఆధ్యాత్మిక జీవితమున నేమియు సాధింపఁ జాలము. కాఁబట్టి గురుసాహాయ్యము అత్యావశ్యకము. తన మనస్తత్త్వము ననుసరించి యిష్టదైవము నెన్నుకొనుటకై శిష్యునకు గురువు దోడ్పడి యా యిష్టదైవముపైఁ జిత్తైకాగ్రత నొందుటకు

## మంత్రోపదేశము నొందుట ఆవశ్యకమా?

అత్యంతానుకూలమగు మంత్రము నుప దేశించును.

గురువాక్యములందు అచంచల విశ్వాస ముతో శిష్యుఁడు ప్రతిదినము నియమానుసార ముగ మంత్రజపము చేయుచు, మంత్రార్థమును ధ్యానించుచుండవలయును. ఈ విధముగా నాతఁడు చిత్తశాంతి నందును.

బ్రహ్మమార్గము దుర్గమము. నరుఁ డెంతటి ధీమంతుఁడైనను, చతురుఁడైనను బ్రహ్మజ్ఞాని యగు గురుని చేయూఁత లభింపనిచో మార్గచ్యుతుఁడు గాక తప్పదు.

## జపధ్యానాదులకై యొక నిర్ణీతక్రమము నేర్పఱచుకొనుము

ఆధ్యాత్మిక జీవనారంభదశయందు జపధ్యా నాదులకై ఒక నిర్ణీతక్రమము నేర్పఱచుకొను టెంతయో శ్రేయస్కరము. జపధ్యానపారాయణ ములకై ప్రతిదినము కొంతకాలము వినియో గింపఁబడుచుండవలయును. మనస్సు పురస్క రించినను, పురస్కరింపక పోయినను గూడ నీ నిర్ణీతక్రమమును యథావిధిగా అవలంబించు చుండుము. ఇటు లవలంబించుటచే క్రమముగా అది సుస్థిరాభ్యాసము కాఁగలదు. బహుశః ధ్యానము ఇపుడు నీకు రుచింపక పోవచ్చును, ఆనందదాయకముగ నుండక పోవచ్చును, కాని నీకు అది అభ్యస్తమై యున్నపుడు, ధ్యానింప నిచో నేమియుఁ దోఁచకుండ, అదేదో బాధగా నుండునట్టి స్థితికి రాఁగలవు. ఈస్థితికి వచ్చినంతనే ఆధ్యాత్మికమార్గమున పురోగమించితివని నీకుఁ దెలియఁగలదు.

ఆఁకలిగా నున్నను, రాత్రి నిద్రపట్టకున్నను, ఎవనికైనను వ్యాకులముగను బాధగను నుండును గదా? భగవంతునిఁ గాంచనైతిని గదా యని నీ విట్టి వ్యాకులత—పరితాపము—నొందఁ గలిగితివా, భగవత్ప్రాప్తి నీ కత్యంత సన్నిహిత మని గ్రహింపుము.

అమృతస్వరూపునిఁ బ్రాపించి యమృతత్వము నొందుము. అంత నీ విఁక నెచట నున్నను, ఏమి చేయుచున్నను సరియే, బాధ లేదు. పరుసవేది తాఁకున నినుమును బంగారముగా మార్చి వేసితివా, దానిని నీ విఁక భూమిలోఁ బాతిపెట్టినను, చక్కని పెట్టెలోఁ బెట్టినను సరియే, చెక్కు చెదరకుండును. అది యిఁక సదా బంగారముగనే యుండును.

"అద్వైతజ్ఞానమును నీ కొంగున ముడిపెట్టుకొని నీ యిచ్చవచ్చిన రీతిని చరింపుము" అని శ్రీరామకృష్ణులు వచించువారు. అనఁగా, మొదట భక్తిజ్ఞానములను బడసి బ్రహ్మసాక్షాత్కారము నంది యటుపిమ్మట నీ వెట్లు జీవించి

నను, ఏమి చేసినను సరియేయని గురుదేవుని యభిప్రాయము. ఈ స్థితినిఁ బ్రాపించినవాఁ డెన్నఁటికిని తప్పటడుగు వేయఁజాలఁడు.

పారమార్థిక జీవితమునకు అడ్డంకు లనేకములు. కావున నీ యడ్డంకులను దొలఁగింపుమని మనఃపూర్వకముగా భగవంతునిఁ బ్రార్థించుట ఆవశ్యకము. వాని కటాక్షమునకై పరితపింపుము.

నీ మనసున నీవఱకే యెన్నో యైహిక సంస్కారములు—జన్మాంతర సంస్కారములు—ప్రోగుపడియుండ, ఈ జన్మమునను ఎన్నో సంస్కారము లేర్పడియున్నవి. వానిని నీ వెదుర్కొనుచున్న కొలఁదియు నవి మఱింత బలీయమైనట్లు తోఁచుచుండును; కాబట్టి పరమాదర్శమును మఱవక సదా ప్రయత్నమును—సాధనను—సాగించుచుండునట్టివాఁడే వానిని నిర్జింపఁ గలుగును.

మనలోఁ బ్రతివానియందును రెండువాహినులు ప్రవహించుచున్నవి. ఒకటి మనలను భగవదున్ముఖులను జేయుచుండ, రెండవది సంసారో

న్ముఖులను జేయుచుండును. ఒక వాహిని నిన్ను త్యాగవైరాగ్యపథమున భగవత్సన్నిధికిఁ గొని పోవుచుండ, రెండవది ప్రాపంచిక భోగముల దెసకు లాగఁ బ్రయత్నించుచుండును ఈ రెంటిలో మన కేది వాంఛనీయమో యెన్నుకొనవలసి యున్నది. మనము దేవతల మగుటయో పశు ప్రాయుల మగుటయో, ఈ యెన్నిక మీఁదనే ఆధారపడియున్నది.

మోహజనకమగు సాంసారికవిషయములు నిగనిగ లాడుచు, కలకలలాడుచుఁ, దమ మాయాకాంతులతో నరుని కట్టైపుట గోచరించు చుండ, నింతకంటె యోగ్యతరమైనదియు మహత్తరమైనదియు నేమైనను గలదాయను చింతయేఁ చింతింపవలసిన యక్కఱయే వానికిఁ గలుగ కుండును. ఉత్తమపురుషార్థమును గూర్చి యాతఁడు వినవచ్చును; ఐన నేమి, భగవద్దర్శనముగాని, విషయోపభోగానందమును మించిన యానంద మునుగాని పొందఁగలమను 'హామీ' యేమున్న దని తనలోఁ దాను రాద్ధాంతము చేసివేసికొనును.

నేఁటి సుఖములను రేపటియాశలకు బలిపెట్టు టాతనికి హేతురహితముగను యుక్తిహీనముగను గానిపించును. ఇట్లు తలపోయుచు నాతఁడు మఱింతగా సంసారదావానలములోనికి దూఁకి, తాపత్రయసంతప్తుఁడై, జవసత్త్వ లుడుగఁ, బడుచుతనపుబింకము చల్లార, నిరాశాహతుఁడై తన తెలివితక్కువతనమునుగూర్చి వగచును. అంత నాతఁడు చిత్తశాంతికై పరితపించును; కాని యీపరితాపముఁ తఱచుగా నంతయుఁ దుద ముట్టిన తరువాత, ఇఁకఁ దానేమియుఁ జేయఁ జాలని స్థితికి లోనగుచుండును. తన మనసు విషయచింతలకు బానిసయై యుండుటచే నిఁక నాతఁడు మనఃపూర్వకముగాఁ దన రీతినీతులను, ధోరణిని మార్చుకొనఁగోరినను, ఈ జన్మమున నట్లు చేయఁజాలకుండును.

## తపస్సనఁగా నెట్టిది ?

శిష్యుఁడు: స్వామీ! తపస్సనఁగా నెట్టిది?

స్వామి: తప స్సనేకవిధములుగా నున్నది. పండ్రెండేండ్ల పర్యంతము కూర్చుండ ననియుఁ బరుండననియు వ్రతముఁ దాల్చినవాని నొకప్పుడు చూచితిని. నే నాతనిఁ గలిసికొని నప్పటి కాతఁడించుమించు తన వ్రతకాలమును బూర్తిచేసి యుండెను. నాలుగైదు నెలలుమాత్రమే మిగిలి యుండెను. వరుసగా నన్నియేండ్లపాటు నిలుచుండి యుండుటచే వాని కాళ్లు బోదకాళ్లవలె వాఁచి యుండెను. నిదురించునపుడు త్రాఁటితోఁ దన్నుఁ బైకిఁ వ్రేలాడఁగట్టుకొనియుండువాఁడు. శీతకాలమున రాత్రియంతయుఁ గుత్తుకబంటినీటిలో నిలిచి జపము చేయుచుండునట్టి తపమును గొందఱు పూనియుందురు. వేసవికాలమున ప్రచండాతపమున, అగ్నిచతుష్టయ మధ్యమునఁ గూర్చుండియుండు తపము మఱియొకటి.

శిష్యుఁడు: స్వామీ! తపస్సనఁగా నిదియేనా?

స్వామి: రామ రామ! అది కాదు. ఉత్తర జన్మమునఁ దాము భాగ్యవంతులై విశేషభోగ ముల ననుభవింప వలయునను కోర్కెతో, ఆశతో, లోకులు తెలుచుగా నిట్టి యుగ్రత పశ్చర్యల నవలంబించుచుందురు.

శిష్యుఁడు: వారి కోర్కెలు సిద్ధించునా?

స్వామి: భగవంతుని కెఱుక!

శిష్యుఁడు: అగుచో నిజమైన తపస్సనఁగా నెట్టిది?

స్వామి: ఇంతకుముందుఁ జెప్పినవి నిజమైన తపోనిష్ఠలుగావు. ఎవ్వరైనను వాని నవలంబింప వచ్చును. శరీరమును సులభముగా నిగ్రహింప వచ్చునుకాని మనోనిగ్రహముసంగతి వేఱు. కామకాంచనములను త్యజించుటయుఁ బేరు ప్రతిష్ఠలందలి వ్యామోహమును విడనాడుటయు బహుకష్టసాధ్యము.

నిజమైన తపస్సు ఈ మూఁడు నియమముల మీఁదను ఆధారపడియున్నది: సత్యాశ్రయము, లేదా, సత్యనిష్ఠ మొదటిది. ఏపని చేయుచున్నను నీవు సత్యమనెడి మూలస్తంభమును బట్టుకొని యుండవలయును. రెండవది బ్రహ్మచర్యనిష్ఠ, లేదా, కామజయము. మూఁడవది విషయ వాంఛాపరిత్యాగము. అనఁగా, ఉబలాటముల నన్నిఁటిని త్యజింపుము. ఈ మూఁడు నియమము లను పరిపాలింపుము. ఇదియే నిజమైన తపస్సు. (14-వ ప్రకరణము చూడుఁడు) వీనిలో కామ జయము ముఖ్యము. పండ్రెండేండ్లు బ్రహ్మచర్య నిష్ఠుఁడై యుండువాఁడు సులభముగా భగ వత్ప్రాప్తి నొందునని మన వేదశాస్త్రములు దెలుపుచున్నవి. ఇది బహుకష్టసాధ్యమైన పని. బ్రహ్మచర్య మవలంబించిననే కాని ధ్యాన మనునది సాధ్యముకాదని స్వానుభవపూర్వక ముగ జెప్పఁగలను. విషయసుఖాపేక్ష బహు సూక్ష్మము. దానిని నిగ్రహించు టతికష్టము. కావుననే సాధకుఁడు స్త్రీలతో వ్యవహరించు పట్ల సదా జాగరూకుఁడై మెలఁగవలయును.

బ్రహ్మచర్యమూలమున మహత్తరమైన యొకా
నొక శక్తి మేదస్సున సంగ్రహింపఁబడును. సాధ
కుఁడు బ్రహ్మచర్యప్రతిష్ఠితుఁడైనచో, ఎల్లెడ
లను భగవత్స్వరూపమును గాంచఁగల్గును.

కాని జపధ్యాననిష్ఠను బూననిదే బ్రహ్మ
చర్యావలంబన మసాధ్యమని సదా మది నుంచు
కొనుము.

## మౌనవ్రతము అవలంబింపవలయునా?

శిష్యుఁడు: స్వామీ, ధ్యానాయత్తజీవనము గడపువాఁడు పూజాపఠనధ్యానములందు దినమున కెన్నిగంటలు గడపవలయును?

స్వామి: వీలైనంతకాలము వినియోగింపుము. కేవల ధ్యానాయత్తజీవనమొనర్చువారు జపధ్యానములందు దినమున కథమపక్షము పదునాలుగంటలైనను గడపవలయును. సాధనచేసిన కొలఁదియు ఈ కాలపరిమితిని హెచ్చింపనగును. మనస్సు అంతర్ముఖమై ఆత్మనిమగ్నమైనకొలఁదియు ధ్యానానందము వృద్ధిఁబొందును; సాధనలందు రుచి కలిగినచో వానిని సాగింపవలయుననెడి యిచ్ఛయుఁ బెంపొందును. అపుడు నీ వెంతసేపు ధ్యానింపవలయునని యడుగవలసిన పనియే యుండదు; నీమనస్సే నీకుఁ దెలుపును.

ఈ స్థితి ప్రాపించుటకుముందు దినమునకు మూఁడింట రెండుపాళ్లు జపధ్యానములందు విని

యోగింపఁబూనవలయును. మిగిలిన కాలమును గ్రంథపారాయణమునను ఆత్మవిచారమునను గడపుము. గాఢముగ ఆత్మవిచారము చేసిన కొలఁదియు నీ మనఃస్థితిని మఱింత బాగుగా గ్రహించి సూక్ష్మవిషయవాంఛలను త్రోసి రాజనఁగలుగుదువు. వేళ్లుపాఱియున్న సూక్ష్మ వాంఛలను నీవు తొలఁగించుకొనఁగల్గినంతనే, మనస్సు ప్రశాంతమైనంతనే, యథార్థధ్యాన నిమగ్నుఁడవు కాఁగలుగుదువు. జపధ్యాన సాధన వలన ఈ స్థితి లభించును. మనస్సును నిర్మలము, శాంతము నొనర్చుటకే నియమనిష్ఠ లుద్దేశింపఁ బడియున్నవి. జపధ్యానముల నాచరించుచున్నను, మనస్సు ప్రశాంతము గానిచో, భగవదానంద మును జవిచూడనిచో, నీవు సరియైనవిధానమున సాధనచేయుట లేదని గ్రహింపనగును.

శిష్యుఁడు: మనస్సొక్కొక్కప్పుడు ధ్యానింప నొల్లకుండును. అపుడు నే నేమి చేయవలయును? గ్రంథపారాయణ చేయవలయునా? లేక, 'ధ్యానము చేసిననే కాని వల్లఁగా'దని మొండి పట్టుదలతో ధ్యానింపవలయునా?

స్వామి: మనస్సు శ్రమపడనొల్లక యెదురు తిరుగుచుండును, ఎల్లప్పుడును హాయిని, ఉపశాంతిని గోరుచుండును. కాని నీ వేదైనను సాధింపవలయునన్నచో, వలయు ప్రయత్నమొనర్చు మనస్సును నిర్బంధింపవలయును. మనసునకు నిలుకడ కలిగించుట కిదియే మార్గము. దీర్ఘకాలము ఘంటలకొలఁది ధ్యానించుట కష్టముగాఁదోఁచినయెడల, పడకపైఁ బరుండి జపము చేయుము. నిద్రవచ్చినయెడల నడచుచు జపింపుము. మనస్సును స్థిరమొనర్చి ధ్యానమును నీయపరస్వభావముగాఁ జేయుట కిదియే విధానము. మనస్సు ఇచ్ఛగించుట లేదని ధ్యానము మానుటయా! అట్లు ప్రవర్తించిన నీ వెన్నఁటికిని ధ్యానము నలవఱచుకొనఁజాలవు. మనసును డీకొని నిజముగా అనవరతయుద్ధము సాగింపవలయును. నీ చెప్పుచేఁతలలో నుండునట్లు మనస్సును నిర్బంధించుటయే ఆధ్యాత్మిక శిక్షణాదర్శము.

శిష్యుఁడు: ఈ విధమైన ధ్యానసాధన దశయందు మౌనవ్రత మవలంబింపవలయునా?

స్వామి: బలాత్కారముతోఁ గూడిన మౌనమును, ఊరక వాఁగుచుండుటయు రెండును గూడ హానికరములే. మౌనమవలంబించిన మాత్రమున నేమి ప్రయోజనము? చిత్త భ్రమణమును అతి కట్టుకొనుట — వలయున దిది. వ్యర్థ ప్రసంగములను వీడి మౌన స్వరూపమగు పరమాత్మ యందు మనస్సును లగ్న మొనర్పుము. ఇదియే నిజమైన మౌన వ్రతము. బలాత్కారముగాఁ దెచ్చి పెట్టుకొనిన మౌనము హానికరము.

శిష్యుఁడు: స్వామీ! స్వయముగా నే నేమియు సాధింపఁజాలను. మీ యందును భగవంతునియందును శ్రద్ధాభక్తులు గలిగియుండునట్లు నన్నాశీర్వదింపుఁడు. మీ యనుగ్రహమును గ్రహించి సదా దానిని నిలుపుకొనఁగలుగునట్లు నన్నాశీర్వదింపుఁడు.

స్వామి: ఎన్నఁడును ఆత్మవిశ్వాసము వీడకుము. సమస్తము భగవంతుఁడు నీకు సమకూర్చును. వానిని నమ్మి యుండుము. భగవన్నామమును స్మరింపుము, జపింపుము. భగ

వంతుఁడు నీకు పరమార్థమును దెలుపును. అందో
ళన పడకుము. ఓరిమితో, పూనికతో సాధన
చేయుచుండుము. తప్పక పరమాత్మను బ్రాపిం
తువు. అమూల్యమైన నీ కాలమును నిరర్థక
చింతలతోడను మెట్టవేదాంత కల్పనలతోడను
వ్యర్థముచేసికొనకుము. విషయవాంఛలు నీ మన
స్సునఁదల ఎత్తకుండుటకై భగవంతునిఁ బ్రార్థిం
పుము. భగవత్కృప ఎల్లరయందును బ్రకా
శించుచునే యున్నది. కొంచెము ప్రయత్నిం
చితివా, భగవత్కృపను గాంచఁగలవు.

## కుండలినీ ప్రబోధము నొందు టెట్లు?

శిష్యుఁడు: స్వామీ, కుండలినీ ప్రబోధము నొందుటెట్లు? *

స్వామి : కొందఱి యభిప్రాయ ప్రకారము అందులకు ప్రత్యేక సాధనలు గలవు. కాని జపధ్యానముల మూలమున కుండలినీ ప్రబోధము నొందు టుత్తమమని నా నమ్మకము. జపసాధన ముఖ్యముగా మన ప్రస్తుత యుగమునకుఁ దగి యున్నది. ఇంతకంటె సులభతరమైన ఆధ్యాత్మిక సాధన లేనే లేదు. కాని ధ్యానమును మంత్ర జపముతోఁ బాటుగ నొనర్పవలయును.

---

* గుదస్థానమందలి మూలాధార చక్రమున కుండలినీ శక్తి యణఁగి మణఁగియుండును. 'కుండలిని' యనఁగాఁ జుట్టుకొని యున్నదని యర్థము. కుండలినీశక్తిని ప్రాణాయామాది సాధనలచే మేల్కొల్పి, ప్రాణవంత మొనర్చి, ప్రజ్ఞాన్వితమై యూర్ధ్వముఖముగాఁ జరించునట్లు చేసిన యెడల, తుదకిది, మేదస్సునందలి సహస్రారచక్రమును జేరినంతనే బ్రహ్మసాక్షాత్కారము లభించును.

శిష్యుఁడు: ధ్యాన మనఁగా దేవతారూప చింతనయా?

స్వామి: భగవత్తత్త్వమును సాకారముగఁ గాని, నిరాకారముగఁగాని చింతించుటయే ధ్యానము.

శిష్యుఁడు: స్వామీ, సాధకుఁడు భగవంతునిఁ గూర్చి సాకారుఁడుగ నున్నట్లు భావించి ధ్యానింపవలయునో, నిరాకారుఁడుగ నున్నట్లు ధ్యానింపవలయునో నిర్ణయించునది గురువేనా?

స్వామి: ఔను, కాని కాలక్రమమున మనస్సే స్వయముగా గురువగును. కొన్ని సమయము లందు మనస్సు భగవద్రూపమునుగూర్చి చింతింపఁ బ్రవర్తించును. మఱి కొన్ని సమయములందు నిరాకారభావన మనస్సునకు రుచించును. మానవ గురువు సదా లభ్యుడు గాఁజాలఁడు. సాధన చేసిన కొలఁదియు సాధకుని గ్రహణశక్తి యభివృద్ధి నొందును. అపుడు వాని మనస్సు వానికి మార్గ దర్శినిగా నుండగలదు.

శరీరము నెడ, ఇంద్రియములయెడ, విషయ

ములయెడ, మనస్సు సక్తమై, బద్ధమైయుండునని యోగవాశిష్ఠ రామాయణము చెప్పుచున్నది. ఇట్లు నానా మార్గములను మనశ్శక్తి సామర్థ్యములు వ్యర్థమగుచుండును. సమస్త బంధములను విచ్ఛిన్నము చేయుము! నలువైపులను జెదరినమనశ్శక్తులను కేంద్రీకరించి, యేక తత్త్వమువైపునకుఁ బ్రవహింపఁ జేయుము. ఇదియే సాధన, ఇదియే తపస్సు.

మనస్సునంతయు కేంద్రీకరించి భగవత్సాక్షాత్కారమగువఱకును, భగవంతుని వైపునకు మరల్చుచు, భగవంతునిపై లగ్నము చేయుచుండుము. సాధన చేయుము, తీవ్ర సాధన చేయుము. నీ విపుడు యౌవనుఁడవు, సాధన చేయుట కిదియే తరుణము. వయస్సు హెచ్చిన కొలఁదియు శక్తి సామర్థ్యములు సన్నగిల్లుచుండును.

కావున లెమ్ము, నియమనిష్ఠలను బూనుము! ఈ క్షణముననే మనఃపూర్వకముగ నీ పారమార్థిక జీవనమును బ్రారంభింపుము. మనశ్శక్తి

సామర్థ్యముల నన్నింటిని కేంద్రీకరించి భగవంతునిపై పుంబజుపినచో, భగవంతుఁడు ప్రత్యక్షమగును. జపధ్యాన విచారములలో దేని మూలముననైనను సరియే, దీనిని సాధింపుము. ఇవన్నియు సమానముగనే కార్యకారులని గ్రహింపుము, వీనిలో ఏదోయొకదానిని గైకొని బ్రహ్మానందసాగరమున నిమగ్నుఁడవుకమ్ము. ఊరక యింక ప్రశ్నింపకుము. మొదట నేదో కొంత సాధన చేయుము. అటుతరువాతి సంగతి ప్రశ్నలును, శంకలును.

శిష్యుఁడు: స్వామీ, గురుకృపచే కుండలినీ ప్రబోధము కలుగునా?

స్వామి: గురుకృపచే సర్వము సిద్ధించును, బ్రహ్మజ్ఞానము సైతము లభించును,—కుండలినీ ప్రబోధముమాట యింక జెప్పెడిదేమి! కాని యీ కృప సులభసాధ్యముగాదు. నీవు కష్టపడి కృషి చేయవలయును.

ఏదియో యొక సాధనచేయుము. నియమనిష్ఠ లవలంబింపుము. ఇపుడే ప్రారంభింపుము. తదేకదీక్ష పూనుము. మఱి యే యితర విషయమును దలపెట్టకుము. అంతరాత్మ సాగరమున నిమగ్నుఁడవు గమ్ము. జపధ్యానములకై నిర్దిష్టమైన యొక ప్రణాళిక నేర్పఱచుకొని, మనస్సు పురస్కరించినను పురస్కరింపక పోయినను సరియే, అకుంఠితదీక్షతో నిత్యకృత్యముగా అవలంబించుచుండుట శ్రేయస్కరము.

## ఆహార విషయమున ఏ నియమములను పాలింపవలయును?

శిష్యుడు: స్వామీ! ఆహారవిషయమున ఏ నియమములను పాలింపవలయును?

స్వామి: ఈ ప్రశ్నకు సరియైన సమాధానము చెప్పుట కష్టము. మానవులు శరీర ప్రకృతి యందు విశేషముగా పరస్పర భేదములు గలవారై యుండుటచే, ఆహార విషయమున జవ దాటరాని ఏ ప్రత్యేక నియమములను విధించుటకు వలనుపడదు. ఒక విధమైన యాహారము నీ శరీర ప్రకృతికి సరిపడవచ్చును, నాకు బాధ కలిగింపవచ్చును. అందుచేతనే శాస్త్రములు ఏ ప్రత్యేకాహారమును మంచిదని చెప్పక, విశేషమైన క్రొవ్వు, మాంసకృత్తులు మొదలగు ధాతువులు గల బలాహారములను గూర్చి మాత్రమే హెచ్చరించుచున్నవి.

శిష్యుఁడు: జీవహింసతోఁ గూడుకొని యున్నది కావున మేము మాంసాహారము విడువవలయునా?

స్వామి : అది అర్థరహితమైన మాట. బౌద్ధులు, "అహింసయే పరమధర్మ" మందురు. కాని, దాని యభిప్రాయమేమి? నీవు సమాధిస్థితినిఁ బొందినప్పుడు, జ్ఞానివై సర్వభూతములందును భగవంతుని దర్శించినప్పుడు, దాని తత్త్వము నీకు బోధపడును అంతవఱకెన్ని చెప్పినను దాని వలన మనకు లాభము లేదు. ఎంతమాత్రమును భేదదృష్టి యనునది లేకుండ చీమయందును నీ యందునుగూడ ఏక పరమాత్మను నీవు గాంచఁ గలిగినప్పుడే ఈ ధర్మమును అనుష్ఠింపఁ గలుగుదువు. జీవహింసనుగూర్చియు జీవవధను గూర్చియు నీవు ప్రసంగింపవచ్చును, కాని, హింసచేయకుండ, వధింపకుండ, నీ వుండఁగలవా? నీ వేమి తిందువు? 'బంగాళాదుంపలా?' ఆ దుంపను భూమిలోఁ బాతిపెట్టుము, అది లేలేఁత మొలకల నెత్తును. ఆ దుంపకు ప్రాణము లేదా? అట్లని, అన్నము తిందువా? వరిగింజను నేలలోఁ బాతి

పెట్టుము. అది వరిమొక్కయై పెరుఁగును. నీరు త్రాగఁదలఁచెదవా? సూక్ష్మదర్శినీమూలమున ఒక నీటిబొట్టును బరీక్షింపుము, అం దెన్నిలక్షల జీవు లున్నవో నీకుఁ గనఁబడును. జీవించుటకు నీవు ఊపిరిపీల్చుకొనవలసియున్నదికదా? కాని ప్రతిశ్వాసతోడను లక్షలకొలఁది జీవులను జంపుచున్నావు. అం దేమైనను హింస నీకు గోచరించుచున్నదా? కాని తప్పక హింసించుచునే యున్నావు, చంపుచునేయున్నావు. కొలఁదిగాఁ జేఁపలను దిన్నంతనే ధర్మభ్రష్టుఁడనై పోదునని నీయూహ. మాంసాహారమునుగూర్చి యిట్టి యుక్తులు వివేకహీనములు.* ప్రాచీనహిందువు

* సర్వసామాన్యదృష్టితో శ్రీబ్రహ్మానందస్వామి యిట్లు తెలిపినను, మాంసాహారమునుగూర్చి శ్రీ వివేకానందస్వామి భావముల నిప్పట్టున గమనింపఁదగును. 'అనుష్ఠాన వేదాంతము'న (Practical Vedanta) ఆతఁడిట్లు తెలిపి యున్నాఁడు:

"జంతువులు నరులకంటె భిన్నములనికాని, నరుని కాహారముగా నుండ భగవంతునిచే సృజింపఁబడెననికాని—

లిట్టి భావముల నెన్నఁడును అవలంబించియుండ లేదు. ఇవి కాలాంతరమున బౌద్ధుల మూలమున, వైష్ణవులమూలమున, వెలువడిన ప్రక్షిప్త భావములు.

యిట్టి నీచభావములను—వేదాంత మెంతమాత్రము ప్రతిపాదింపదు, అంగీకరింపదు.

* * *

"నేను సరియైన శాకాహారిని గాకపోవచ్చును, కాని యీ విషయమున ఆదర్శ మెట్టిదో నాకు అవగతమై యున్నది. మాంసము తినుచో, అది తప్పని నాకుఁ దెలియును; కొన్ని పరిస్థితులలోఁ దినుట తప్పనిసరియైనను అది క్రూరమని నాకుఁ దెలియును....సర్వజంతువులును నా సోదరులే కావున, మాంసమును దినకుండుటయే, ఏ జీవిని హింసింపకుండుటయే, ఆదర్శము, ధర్మము."

—రచయిత.

## సాధనవిషయమున నెల్లరకును ఒకే నియమములు వర్తింపవు

సాధన విషయమున నెల్లరకును ఒకే రీతి బోధనలు వర్తింపవు. శిష్యుని మనోభావములను బోకడలను బరిశీలించి గురువు తదనుగుణముగ బోధించును.

ఏ వ్యక్తికిని పరుని సమక్షమునం గొన్ని సామాన్య నియమములు తెనా, అతండవలంబింపవలసిన ప్రత్యేక మార్గమేమో యుపదేశింపరాదు. శ్రీ రామకృష్ణదేవుని విషయమునం బ్రతి శిష్యుని ఆయన యెల్లెకాంతమునకుం దీసికొనిపోయి వానికి వలయు ప్రత్యేకోపదేశముల (రహస్యముగ) నొసరించువారో కనుంగొనియున్నాను. నీ సాధనల విషయమై నీ గురుని నీ వేదేని యడుగవలసియున్నయెడల, ఏకాంతముగ నీవా కార్యము నొనరింపవలయును.

ఏమైనను ఎల్లరును అనుసరింపందగిన కొన్ని యుపదేశములను నీకుం దెలిపెదను. ప్రథమ

నియమ మిది : భగవంతుఁడు కలఁడని గ్రహిం పుము. వానియందు నమ్మిక గలిగియుండుము. భగవత్సాక్షాత్కారమే పరమపురుషార్థమను దృఢ నిశ్చయము కలిగియుండుము. బ్రహ్మజ్ఞానమువలననే యమరత్వమును అఖండానంద మును బొందనగును. సమస్త సంశయములును దొలఁగిపోవును.

తరువాతి ముఖ్యనియమము బ్రహ్మచర్యావలంబనము. పరిపూర్ణబ్రహ్మచర్య మనునది లేనిదే యెవ్వరును పరమపురుషార్థసిద్ధికై వలయు నియమములను బరిపాలింపఁజాలరు. మనశ్శరీర మస్తిష్కపోషణమునకును తత్పరిపూర్ణ వికాస మునకును బ్రహ్మచర్య మత్యావశ్యకము. బ్రహ్మచారియందు ప్రత్యేకమగు నొకానొక యాధ్యాత్మికనాడి పెంపొందును. తన్మూలమున వాని ధారణాశక్తియు, ఆధ్యాత్మికవిషయగ్రహణ శక్తియు, భగవద్విశ్వాసమును అభివృద్ధి నొందును, ఇంద్రియాతీతమగు నాధ్యాత్మిక తత్త్వము నాతఁ డనుభూతము నొనర్చు కొనఁ

గలుగును. బ్రహ్మచర్యాదర్శమునుగూర్చి మతాచార్యులంతగా నొక్కి వక్కాణించు చుండుట కిదియే హేతువు.

మూఁడవ ప్రధాననియమము ఆహారనియమనము. సులభముగా జీర్ణమగునట్టియు, శరీర పోషకమగునట్టియు నాహారమును గ్రహింపుము. ప్రాలుమాలికను బురికొల్పునట్టి, లేదా, పుట్టించునట్టి యాహారమునువీడుము. సూర్యాస్తమయానంతరము బహులఘువుగ భుజింపుము. ధ్యానింపననువుపడుటకుఁగాను, మెదటిని ప్రశాంతముగ నుంచుకొనవలయును. శరీరారోగ్యకరమగునట్లు భుజింపుము. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అనునట్లు సాధనవిషయమున ఆరోగ్యము ప్రధానము.

నీ సాధనలనుగూర్చి యార్భటము చేయఁబోకుము. ధ్యానించుచో, రహస్యముగా ధ్యానింపుము.

ప్రాతస్సాయంసంధ్యలును, అర్ధరాత్రమును ధ్యానప్రార్థనలకు అత్యంతానుకూల సమయ

ములు. పగలనేక చిత్తవిక్షేపములు గలుగు చుండును. రాత్రి ప్రకృతి ప్రశాంతముగ నుండుటచే రాత్రికాలము ధ్యానసాధన కత్యంతానుకూలమై యొప్పును. అత్యల్పప్రయత్నముతోడనే యర్ధరాత్రసమయమున మనస్సు భగవంతుని యందు లయమగును.

శ్రీరామకృష్ణదేవు లెన్నఁడును రాత్రి నిద్రతోఁ గడపువారు కారు. తమ బాలశిష్యుల నైనను జాలసేపు నిద్రపోనిచ్చువారు కారు. ఇతరులు నిద్రింపఁబోయినపుడు—ప్రశాంతమైన యా సమయమున—ఆయన తన శిష్యులను మేలుకొలిపి, ప్రత్యేకోపదేశముల నొనర్చి, ధ్యానార్థము పంచవటికిఁగాని, కాళీ దేవాలయమునకుఁగాని, శివాలయమునకుఁగాని, పంపువారు. గురూపదేశానుసారము వారు రాత్రి యంతయు ప్రార్థనాదులతోఁ గడపి పగటికాలమున విశ్రాంతి నొందువారు. ఈ రీతిగనే శ్రీ రామకృష్ణదేవులు వారలచే ననేకసాధనలఁ జేయించి యుత్తీర్ణులను గావించువారు.

## సాధనవిషయమున-ఒకే నియమములు వర్తింపవు

"ముక్తిఁగులవారు—యోగులు, భోగులు, రోగులు—రాత్రి మేలుకొనియుందురు. మీరందఱును యోగులు. రాత్రి మీరు నిద్రతోఁ గడిపి వేయరాదు" అని తఱచుగా వచించువారు.

మీరు యువకులు. బ్రహ్మానందమును జవిచూచుటకై తీవ్ర ప్రయత్నము నొనర్పుఁడు. ఒక్కపరి దాని ననుభవించితిరా, భగవదితర విషయములనెట్లు లక్షింపఁగలుగుదురు?

# సాధనయందలి యంతరాయములను దొలఁగించుకొను టెట్లు?

శిష్యుఁడు: స్వామీ, కొందఱు హృదయ గుహాలయమున ధ్యానింతురు; మఱికొందఱు మస్తిష్కమునందలి సహస్రారకమలమున ధ్యానింతురు. కాని బాహ్యముగ ధ్యానించుట నా కిష్టము. నేను మిమ్ముఁ జూచుచున్న రీతినే నాయిష్టదైవమును దర్శింపఁగోరెదను. ఏది సరియైన విధానము?

స్వామి: ధ్యానమనునది సాధకుని వ్యక్తిగత మనోభావమునుబట్టి యుండును. సర్వసాధారణ ముగా హృదయాలయమున ధ్యానించుటయే సర్వోత్తమము. శరీరమే దేవమందిరమనియు దేవుఁ డందుఁ బ్రతిష్ఠితుఁడై యున్నాఁడనియు భావింపుము. ఎటులయినను ధ్యానమూలమున మనస్సు నిలుకడనొందియున్నపుడు సాధకుఁడు భగవాను నెచ్చటనైనను జింతింపవచ్చును.

అప్పుడు భగవంతుఁడు తన ప్రక్కనఁగాని, వెనుకఁ గాని, హృదయమునఁగాని, మఱి యెచ్చోటఁ గాని యున్నట్లు భావించి ధ్యానింపవచ్చును. మనస్సు ధ్యాననిమగ్నమై యున్నపుడు మొట్ట మొదట దివ్యజ్యోతిర్దర్శనము కలుగును. ఈ దివ్య దర్శనముతోఁబాటు ఒకానొక విలక్షణానందము అనుభూతమై మనస్సు దానిని విడిచి పురోగ మింపనొల్లకుండును. కాని సాధకుఁడు తన సాధన పథమున ముందంజవేయుచో, తేజోదర్శనము ఇష్టదైవస్వరూపమున లయమగును. అంతట మనస్సు తత్స్వరూపజ్ఞానమున లయించును.

ఒక్కొక్కప్పుడు సాధకుఁడు దీర్ఘప్రణవనా దానుభూతి నొందవచ్చును. అంతట మనస్సు దానియందు లయించును దివ్యదర్శనములును దివ్యానుభూతులును అనంతములు. పురోవృద్ధి నొందినకొలఁదియు ఈ దివ్యానుభవములు అసం ఖ్యాకములనియు, అనంతములనియుఁ గనుఁగొనఁ గలవు.

దివ్య తేజమునుగాంచినంత నే కొందఱు భగవత్ప్రాప్తి నొందితిమనుకొనుచుందురు. ఈ రీతిని భ్రమపడఁబోకుము. సమస్తద్వంద్వాతీతమగు నిర్వికల్ప సమాధిస్థితి నొందవలయును. కొందఱు నిర్వికల్పసమాధిస్థితి యాత్మానుభూతికి పరమావధి యనుచుందురుగాని నే నది ప్రారంభమని నమ్మెదను.

శిష్యుఁడు: సాధారణముగాఁ గొంత వికాసము నొందిన పిమ్మట మనస్సింక పురోగమింపఁజాలకుండుట సంభవించుచుండును. స్వామీ, ఇందులకు హేతువేమి ?

స్వామి: అది మనోదౌర్బల్య లక్షణము. మనశ్శక్తి స్వయముగా పరిమితము. ఎల్లరును నొకే పరిమితమగు మనశ్శక్తి గలిగియుండరు, కాని దానిని బెంపొందించుకొన వచ్చును. బ్రహ్మచర్యావలంబనమున మనశ్శక్తి వికాసము నొందునని శ్రీ గురుదేవులు వచించువారు. అట్టి మనస్సు కామక్రోధముల కధీనము కాదు. అంతట కామక్రోధాదులు తృణప్రాయముగఁ గాన్పించును.

ఆత్మవికాసమార్గమున ననేకమైన యంతరాయములు గలుగవచ్చును. దుష్టశక్తులు నీ వికాసమును నిరోధింప వచ్చును. ఇందువలననే ముద్ర, భూతశుద్ధి మొదలగు విధులు పూజా కలాపమునఁ జెప్పఁబడియున్నవి.

శిష్యుఁడు: స్వామీ! మాలో ప్రతివ్యక్తిని బిలిచి తాము మాయాత్మవికాసమునుగూర్చియు, మా చిక్కులను గూర్చియుఁ గనుఁగొనుచు, మాకు నూతనధైర్యోత్సాహములను గలిగించుచుందురు.

స్వామి: కాని, చూచితివా, నా మనోభావ మెప్పుడును ఒక్క విధముగా నుండదు. సాధనలను సాగింపుఁడని మిమ్ములను బతిమాలుదమనియు వేఁడుకొందమనియు నొక్కొక్కప్పుడు తోఁచుచుండును. భగవంతుఁడే కార్యము, కారణము, కర్త, ఉపకరణము, సర్వమునని మఱికొన్ని వేళల నాకు అనుభూతమగుచుండును. సర్వము, ప్రతివిషయమును భగవంతుఁడే. నానా రూపములను భగవంతుఁడు క్రీడించుచున్నాఁడని నా యనుభవము. అట్టిచో నెవరికి బోధింతును?

బోధించుటకు నే నెవఁడను? జనులు నా మాటల నేల వినవలయును? కాని నాయనా! నీకుఁ దెలియునా? భగవత్ప్రేరణపొందునపుడు జనులు వాని నంగీకరించి యనువర్తించుచుందురు.

శిష్యుఁడు: స్వామీ! అనుగ్రహమున కేమైనను హేతువనునది కలదా?

స్వామి: భగవదనుగ్రహమనెడి వాయు వెప్పుడును వీచుచునే యున్నదనియు, నీవు కేవలము నీ తెఱచాఁపలను నిండారవిప్పుకొనవలయు ననియు శ్రీ రామకృష్ణదేవులు వచించువారు. మఱియు శ్రీ గురుదేవుఁడిట్లు పలుకును: "ఉక్క పెట్టుచున్నపుడు విసనకఱ్ఱ కావలయును. కాని మలయమారుతము వీవనారంభించెనా, విసనకఱ్ఱ నావలఁ బెట్టుదువు."

శిష్యుఁడు: సాధకుఁడు తన యనుభవములు దివ్యానుభూతులో, మనోవిభ్రాంతులో తెలిసి కొను టెట్లు?

స్వామి: నిజమైన దివ్యదర్శనము సుస్థిరానంద దాయకము, అట్టి దివ్యదర్శనయాథార్థ్యము మనసున కెఱుకపడును.

శిష్యుఁడు: స్వామీ! పూజాకలాపమున ముద్రాది క్రియలవలని నిజమైన ప్రయోజనమేమి?

స్వామి: పారమార్థిక జీవనారంభ స్థితియందవి విశేష సహకారులు. సాధకుని పురోగమనమును నిరోధించు దుష్టబాహ్యశక్తుల నవి తొలఁగింపఁదోడ్పడును. ధ్యానింపఁ బోవునపుడు నీ మనస్సు ప్రశాంతముగ నున్నట్లు నీ కొకొక్కప్పుడు అనుభూతమై యుండవచ్చును. కాని కొన్ని నిముసములలోనే దుశ్చింతలచే మనస్సు తబ్బిబ్బయిపోవును. నే నొకప్పుడిట్టి బాధకు గురియైతిని. (శ్రీ) గురుదేవులు కొంత దూరము నుండి నన్నుఁ గనుఁగొని నా మనఃస్థితిని గ్రహించిరి. తోడనే నన్ను సమీపించి యిట్లు పలికిరి "నిన్నేదో కలవర పెట్టుచున్నట్లు గోచరించుచున్నది." ఇట్లని నా నాలుకపై నేమియో వ్రాసి,

వినఁబడియు వినఁబడనట్లు కొన్ని శబ్దముల నుచ్చ రించిరి. తోడనే తద్బాధావిముక్తుఁడనైతిని. ఏమైనను, సాధకుఁడు పురోభివృద్ధి నొంది యున్నచో, ఈ దుష్టశక్తులును దుష్ప్రభావము లును వాని నేమియుఁ జేయఁజాలవు.

శిష్యుఁడు: ధ్యానపరాయణ జీవనము గడ పుట కష్టసాధ్యము కదా?

స్వామి: కష్టముగాఁ దోఁచినంతమాత్రమున విడనాడకుము. పదేపదే ప్రయత్నింపుము. సాధ నచే సర్వము సుసాధ్యమగును.

## ప్రాణాయామసాధనలు స్వయముగా ప్రాణాపాయకరములు కాఁగలవు

భక్తుఁడు: స్వామీ, మేము విశ్వకళాశాలా విద్యార్థులము. తమ దివ్యహితోపదేశార్థము సన్నిధికి వచ్చియున్నాము.

స్వామి: సదా సత్యము చెప్ప నేర్చుకొనుచు, బ్రహ్మచర్యము అవలంబించుచుండుఁడు.

భక్తుఁడు: మేము ప్రాణాయామము నభ్యసించుచున్నాము. ప్రాణాయామ సాధనలను సాగింపవచ్చునా?

స్వామి: వద్దు! ప్రాణాయామ సాధనలు స్వయముగా ప్రాణాపాయకరము కాఁగలవు. మీరు భగవన్నామము స్మరించుచుండినఁ జాలును. ప్రాణాయామ మూలమున సులభముగా సంభవింపఁజాలెడి ప్రమాదములకు లోనుగాకుండ, (చిత్తైకాగ్రతకు ఆవశ్యకమగు) కుంభక స్థితిని జపధ్యానసాధనవలన మీరు పొంద వచ్చును. జపము చేయుచుండుటచే క్రమముగా మీ శ్వాసము అత్యంతసూక్ష్మస్థితినొంద, ప్రాణ శక్తి సహజమార్గమున మీకు వశమగును.

## ౩౦

## మనస్సును నిగ్రహించు టెట్లు?

శిష్యుఁడు: స్వామీ! మనస్సును నిగ్రహించు టెట్లు?

స్వామి: క్రమసాధనవలన మనస్సును భగవంతునియందు లగ్నము చేయవలయును. తలంపరాని తలంపులును, భగవదితరచింతలును, వ్యాకులములును మనస్సునఁ బ్రవేశింప నీయకుండుటకుఁగాను సదా జాగరూకుఁడవై యుండుము, అవి మనస్సునఁ జొరఁబడఁ బ్రయత్నించునప్పుడెల్ల మనస్సును భగవదున్ముఖమొనర్చి భగవంతునిఁ బ్రార్థించుచుండుము. ఇట్టి సాధనవలన మనస్సు నిగృహీతమై నిర్మలమగును.

నీవు నిస్సహాయుఁడవనియు, ఏకాకివనియు, భగవంతుఁ డొక్కఁడే నీకు శరణమనియు, గత్యంతరము లేదనియు, ననుభవపూర్వకముగఁ దెలిసికొనునపుడే భగవద్భక్తి నీయం దుదయించును.

ఎడతెగక జపము చేయుము. ప్రతిశ్వాసతోడను జపము నవలంబింపుము. సాధనవలన

జపము నీ కపరస్వభావ మగును. అట్టియెడ నిద్రించుటకుముందు నీవు అప్రయత్నముగ భగవన్నామము నుచ్చరించుటయు, మేల్కొను నపుడును నట్లే యొనరించుటయు జరుగును.

భగవత్ప్రాప్తి సాధ్యమని — వాని దివ్యరూప సాక్షాత్కారమును వానితోడి సంభాషణమును—సాధ్యమని— నిశ్చయముగ గ్రహింపుము.

ఈ సాధనల నవలంబింపుము. వీని నవలంబించుచుండు నెడ, అపూర్వ దివ్య దర్శనములు గలుగును. అద్భుత మనోహరదృశ్యములను గాంచగలుగుదువు. భగవంతుని నానా కళలను నానావిధ దివ్యరూపములను నీవు గనుగొన వచ్చును. లేదా, తేజస్సాగరమునుగాని, నిశ్చల జ్యోతినిగాని దర్శింపవచ్చును. భగవద్దివ్యరూపాను భూతికి, అఖండసచ్చిదానంద బ్రహ్మానుభూతికి— అంతు లేదు. వికాసము! వికాసము! అధికాధికతర వికాసము! ఈ సాధనలలో నిమగ్నుండవు కమ్ము. తీవ్రమనోనిశ్చయముతో నామస్మ

రణ చేయుచు, భగవచ్చింతా నిమగ్నుఁడవు కమ్ము.

ఎల్లరియెడలను ప్రేమసానుభూతులను బడయ నేర్చుకొనుము. పరులదోషములను లక్షింపకుము. దుర్మార్గుని సన్మార్గునిగాఁ జేయఁదోడ్పడఁజాల నిచో, నీ యాధ్యాత్మిక జీవన మేమి ప్రయోజనము?

తాలిమి వహింప నేర్చుకొనుము. కోపమును తాలిమిచే నిర్జింపనగును. శాంతిక్షమావినయ శీలుఁడవై యుండుము. శీలనిర్మాణమున వినయము గొప్ప సహకారి. "సహనశీలుఁడే విజయోపేతుఁడు. సహనము లేనివాఁడో, భ్రష్టుఁడు" అని (శ్రీ) గురుదేవులు వచించువారు. మఱియు నిట్లు పలుకుచుండెడివారు: "పల్లపునేలయందు నీరు నిలుచును. మెరకనేలనుండి సహజముగాఁ గ్రిందికిఁ బ్రవహించి పోవును." మానవుఁడు వినమ్రుఁడై యున్నచో, మృదుల స్వభావమును, ఇతర సుగుణములును సహజవికాసము నొందును.

భగవంతుని నిరంతరము—నీవు పనిచేయు చున్నప్పుడు కూడ—స్మరింపఁ బ్రయత్నింపుము. ప్రారంభమున నిది కొంత కష్టమనిపించినను సాధనవలన సులభమగును. ప్రయత్నము వీడకుము. సాధనకై లేనిపోని నియమ బాహుళ్యము నేర్పఱచుకొనుటవలన లాభము లేదు. నిష్కాపట్యము, దృఢనిశ్చయమునను నవియే ముఖ్య విషయములు. ఇవి నీ ప్రార్థనయందున్నచో, భగవంతుఁడు తప్పక దాని నాలకించును. భగవంతుఁడు మానవహృదయము నరయు వాఁడు గాని మాటలను, లక్ష్యించువాఁడు గాఁడు; వానిచే మోసపోవువాఁడును గాఁడు.

లోకులు ప్రపంచసౌఖ్యానుభవమునుగూర్చి పలుకుచుందురు, కాని దాని ననుభవించు టెట్లో, పాపము, వారికేమి తెలియును? మొదట దేవతవై పిమ్మట భోగము ననుభవింపుము. అంతకు ముందు ని భోగము లన్నియు పశుభోగ ప్రాయములు.

నిర్మల మనస్కుఁడవై నిర్మల భావములను గలిగియున్నచో, నిన్నే దోషమును అంటఁ జాలదు.

శిష్యుఁడు : స్వామీ! "చక్కెర నే తినఁదలఁతును గానీ, చక్కెర నేఁ గాఁగోరనురా" యను పాట గలదుగదా? సాధకుని మనోభావమిట్టిదై యుండవలయునా?

స్వామి : నాయనా! ఆ పాట భగవత్ప్రసాదయనెడి చక్కెర నింకను రుచి చూడని వాని విషయమై చెప్పఁబడిన మాట. భగవన్మాధుర్యమును జవిచూడ నారంభించిన భక్తుఁడు భగవదైక్యము నొందఁగోరును.

శిష్యుఁడు: జ్ఞానులను, అవతార మూర్తులను గూర్చి కాంచునట్టి కలలు యథార్థములా?

స్వామి: ఔను, అవి యథార్థములే. జ్ఞానులను, దేవతలను, అవతార మూర్తులను గుఱించి

చిన కలలు వాస్తవానుభవములు. అవి యథార్థ దర్శనములు. స్వప్నములలో అనేకాధ్యాత్మిక తత్త్వములు సుప్రకాశితమగుచుండును. అట్టి స్వప్నములవలని ఫలితమును సంస్కారమును సుస్థిరముగ నిలుచును. కాని వానినిగూర్చి పరులతో నెవ్వరితోడను జెప్పరాదు.

## నిర్మల మానసుఁడవై ఆత్మప్రశాంతి నందుము

స్వామి: సప్తద్వారములు గల అంతఃపురమున రాజు నివసించుచున్నాఁడు. రాజ సందర్శనమునకై ఒక పేదవాఁడు మంత్రిని ప్రార్థింపఁగా ఆతఁడు అంగీకరించును. మంత్రి వానిని ఆయాద్వారములగుండ రాజ సమక్షమునకుఁ దోడ్కొనిపోవును. విలువగల దుస్తులను దాల్చిన రాజోద్యోగియొకఁడు ప్రతిద్వారముకడను నిలిచియుండును. "ఈయనేనా రాజుగారు?" అని పేదవాఁడడుగుచుండును; "కా"దని మంత్రి సమాధానించుచుండును. ఎట్లయినను, ఏడవ ద్వారమును దాఁటి వారు మహా వైభవముతోడను, సౌందర్యముతోడను ఒప్పు రాజును గాంచినప్పుడు, పేదవాఁడు, "ఈయనేనా రాజుగారు?" అని యడుగనక్కఱయే లేకుండును.

గురుని విషయముకూడ నిట్టిదే. మంత్రివలె గురువు శిష్యుని వివిధ స్థితిగతులనుండి తోడ్కొని

పోయి తుట్టతుదకు రాజరాజేశ్వరుని సన్నిధిని విడుచును.

కాని స్వయముగా నీ మనస్సును మించిన గురువు లేఁడు. ప్రార్థనవలనను, ధ్యానము వలనను మనసు నిర్మలమైనంతనే, లోనుండి యది నిన్ను నడుపసాగును. నీ నిత్యకృత్యములలో సైతము ఈ యంతర్గురువు నీ మార్గదర్శియగును. పరమా పధిని బొందువరకును ఈ విధముగా మనస్సు నీకుఁ దోడ్పడుచునే యుండును. విషయవాంఛల నరికట్టుకొని, యేకాంతవాసము చేయుచు, జప ధ్యానముల నవలంబించుటయే మనస్థైర్యమును, మనోనైర్మల్యమును బొందు మార్గము. నీ మనస్సు పవిత్రభావముల నాశ్రయించుచున్న కొలఁదియు నీ యాత్మవికాసము సుగమమగు చుండును. చక్కఁగా మేపినచో, ఆవు పుష్కలముగాఁ బాలిచ్చునట్లు, ఆధ్యాత్మికాహారము నిడినచో, మనస్సు విశేషశాంతి నొసఁగూర్చును. భగవచ్చింత, ప్రార్థన, జపధ్యానములు—ఇవియే ఆధ్యాత్మికాహారము.

మనస్థయిర్యము నొందుటకు మఱియొక మార్గమేమన, మనస్సును పరిభ్రమింపనిచ్చి, మనోవృత్తులను మాత్రము పరిశీలించుచుండుట. కొంత సేపటికి మనస్సు విసుగుచెంది, భగవంతుని యందు శాంతిఁగనుటకై మరలును. మనస్సును నీవు జాగరూకతతోఁ బరిశీలించుచున్నచో, మనస్సు మరల నిన్నుఁ బరిశీలించుచుండును.

పెందలకడనే (నిద్ర)లెమ్ము. రాత్రి పగటి యందును, పగలు రాత్రియందును సంక్రమించు ఘడియలే ధ్యానమునకు ఉత్తమ సమయము. సుషుమ్నానాడి యపుడు పనిచేయసాగును. మానవుఁడంతట రెండు నాసాపుటములనుండియు శ్వాసించుచుండును. ఏ సమయమందైనను, సర్వ సాధారణముగా ఒక్క ముక్కుపుటమునుండియే మన మూపిరి పీల్చుకొనుచుందుము. ఇదియే చిత్తవిక్షేపమునకు కారణము. రెండు నాసా పుటములనుండియు శ్వాసించుచుండు సమయ మును ఆధ్యాత్మిక సాధకులు గమనింపవల యును. అట్టి క్షణములే ధ్యానమున కెక్క-

వగాఁ దోడ్పడునవి, వానివలన లబ్ధినొందుము. మమకారమును వీఁ విషయవాంఛలను నీ మనస్సునుండి తొలఁగఁద్రోయుము. సాధన నవలంబింపుము, అవలంబించితివా, నీ మనస్సు నిర్మలమై శాంతినొందును, భగవంతుఁడంతట సాక్షాత్కరించును ప్రయత్నము—తీవ్ర ప్రయత్నము, —సాధన—తీవ్రసాధన,—చేయుము. భగవద్దర్శనమునకై ప్రయత్నింపనివాఁడు అజ్ఞానాంధకారమునఁ గూలఁబడియుండును. ధైర్య సాహసములతో ఈ ప్రయత్నమును—ఈ నిష్ఠలను అవలంబింపుము. 'రండు, నన్నావేశింపుఁడు' అని వానిని ఆహ్వానింపుము. వాని మూలముననే శాంతి నందఁగలవు.

నిరంతర స్మరణమే సాక్షాత్కారమునకు అత్యంత సులభోపాయము. భగవంతుఁడు నీ వాఁడని— నీయాప్తుఁడని— తెలిసికొనుము. మానవుఁడు తన మిత్రు నాహ్వానించి, అన్నపానీయములతోడను, సంభాషణలతోడనుఅలరించునట్లు, నీ భావముల మూలమున భగవంతు నలరించి,

మాల్య నైవేద్యముల నొసఁగి, స్వేచ్ఛగా వానితో సంభాషింపుము. భగవంతుఁడు అపుడు నీకు శాంతిసంధాతయై భాసించును.

భగవత్తత్త్వమును గ్రహింప నెవరితరము? వాని మాయయెట్టిదో అరయఁగలవాఁ డెవ్వఁడు? భగవంతుఁడు అనంతుఁడు, నిరాకారుఁడు. కాని, సాకారుఁడుగూడ నాతఁడే. భగవంతుఁడేమానవ రూపమున అవతరించుచున్నాఁడు. భగవానుఁ డెన్నెన్ని విధముల మానవునిఁ దన్నుఁ బ్రాపింపఁ జేసికొనుచున్నాఁడో గ్రహించుట మానవ శక్త్యతీతము. మార్గ మొక్కొక్కప్పుడు నిరపాయమై రాజమార్గమై యుండును, పెక్కెడల ముండ్లతోఁ గూడుకొని యుండును, లేదా, దాఁటరాని కొండలతో నిండియున్నట్లు తోఁచవచ్చును.

ఐనను, భగవంతుని శరణుచొచ్చినచో, నిరపాయముగా మనల నాతఁడు తన్నుఁ బ్రాపింపఁ జేయును.

మాయయే మనస్సును, ఇంద్రియములను భగవత్సాక్షాత్కారమున కెడము చేయు.

చున్నది. కాని సాక్షాత్కారము నొందినవాఁడు మాయాకర్షణల కన్నిఁటికిని అతీతుఁ డగు చున్నాఁడు. మాయాతీతునకే మాయ తన గుట్టును వెల్లడించును.

సామాన్యమానవులు మాయాబద్ధులై మను చుందురు. జననమరణరూప సంసారచక్రమున పరిభ్రమించుచు, తామెంత బాధపడుచున్నారో, వారు గుర్తింపనే గుర్తింపరు. మాయాశక్తి యింతటి గహనము, అనంతము. అనుదినము శరీరము శిథిలమగుచున్నది. తా నెందులకు జన్మించెనో, అట్టి పరమపవిత్రకార్యమును మఱచి మానవుఁడు మాయలోఁబడి నిద్రపోవుచున్నాఁడు. మానవజన్మముననే భగవత్సాక్షాత్కారము నందనగును. ఇదియే మానవ జన్మమువలని అద్వితీయ ప్రయోజనము, మహోత్తమలాభము. శరీరమును, శరీరసుఖములను మఱచిపొమ్ము. జననమరణ భ్రాంతిని విడనాడుము. తుచ్ఛమగు మాయాశాంతిని విడనాడి, యథార్థము, శాశ్వత మునగు ఆత్మప్రశాంతి నందుము.

## మనస్సునకు అధిపతివి గమ్ము

స్వామి: త్రికరణశుద్ధిగా భగవంతునకు ఆత్మార్పణ మొనర్చుకొనుట, సంపూర్ణముగా వానినే నమ్మియుండుట, అంత తేలికయైన పని గాదు. "నేను భగవంతుని గ్రహింపను లేదు, చూడను లేదు. ఇట్టి నేను వానిని బ్రేమించు టెట్లు? వాని కాత్మార్పణ మొనర్చుకొను టెట్లు?" ఈ విధమైన సంశయములు మనస్సున వెలువడు చుండును.

భగవంతుని ధ్యానింప బుద్ధిపుట్టుట లేదని శ్రీ గురుదేవునితో నొకప్పు డొకడు మొఱ పెట్టెను. "కానిమ్ము, లోకమున నీ కెవనిమీఁద, లేదా, దేనిమీఁద విశేషమైన ప్రేమ?" యని శ్రీ రామకృష్ణదేవు లడుగఁగా నాతఁడు తా నొక మేఁకపిల్లను బెంచుకొనుచుంటిననియు దాని మీఁదనే తనకు గారాబమనియుఁ జెప్పెను. అంతట గురుదేవు లిట్లుపదేశించిరి: "మంచిది, నీ మేఁకపిల్లను నీవు మేపుచుండునపు డెల్ల, దానిని

నీవు లాలించుచుండునపుడెల్ల, లేదా, దానికి నీ వేవిధమైన సంరక్షణ చేయుచున్నను, భగవంతుని సేవించుచున్నానని భావింపుము. మనఃపూర్వకముగా నీ విట్లు చేయఁగలిగితివా, పరమ పురుషార్థము నొందుదువు!"

సద్గురుకటాక్షము నొందువారు ధన్యాత్ములు. గురువు సంసారతరణోపాయమును జూపుచు సమస్తవిఘ్నములను దొలఁగించును. గురువచనములందు గాఢవిశ్వాసమును బూని శ్రద్ధాభక్తులతో వాని యుపదేశముల నవలంబింపుము. మనోమాలిన్యము క్షాళితమై జ్ఞానతేజ ముదయించును. గురునియందు శ్రద్ధాభక్తులు గలవానికి శీఘ్రముగా జ్ఞానోదయమగును. కాని గురుని భగవత్స్వరూపునిగాఁ గననేర్వవలయును. గురు నెన్నఁడును మానవమాత్రునిగాఁ దలఁపరాదు.*

---

* శ్లో. "ఆచార్యం మాం విజానీయా న్నావమన్యేత కర్హిచిత్,
న మర్త్యబుద్ధ్యా సూయేత సర్వదేవమయో గురుః."
—భాగవతము, 11-17-27.

శ్లో. "గురుర్బ్రహ్మా గురుర్విష్ణో గురుర్దేవో మహేశ్వరః;
గురు స్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః."

ఆతనిని భగవద్భావముతోఁ బూజించుచు సేవించుచుండినచో, మనశ్శరీరములు పవిత్రమగును. గురుని తోడ్పాటున మొదట భగవద్దర్శనము కలుగును, అంతట గురువును భగవంతుఁడును ఏకమగుదురు. అంతఃకరణము పరిశుద్ధము కానిదే భగవద్దర్శనము లభింపఁజాలదు.

"ఎవరికైనను సాక్షాత్కారము నొందిన సద్గురువు లభించెనా, శీఘ్రముగా అట్టివాఁడు అహంకారవిముక్తుఁడై; స్వయముగా సాక్షాత్కారము నొందును" అని శ్రీ రామకృష్ణదేవులు వచించువారు. కాని జ్ఞానహీనుఁడగు గురు ననుసరించువాఁ డెన్నఁటికిని బంధవిముక్తుఁడు కానేరఁడు. అట్టియెడ గురుశిష్యులిరువురకును గూడ యాతనయే. తానే అజ్ఞానియగువాఁడు ఒరులకు జ్ఞానదాన మొనర్చు టెట్లు? స్వయముగా భగవత్సాక్షాత్కారము నొంది భగవదాదేశము నొందియుండనివాఁడు, దైవబలమువలన బలోపేతుఁడై యుండనివాఁడు, ఒరునకు బలమును, సాహాయ్యమును ఒనఁగూర్చు టెట్లు? గ్రుడ్డివాఁడు గ్రుడ్డివానికి దారిఁ జూపు టెట్లు?

ముక్తుఁడగు మహానీయుఁడే మఱియొకనికి ముక్తి నొసఁగూర్పఁగల్గును.*

---

* ఈ సందర్భమున శ్రీ వివేకానందస్వామి వాక్కులు స్మరణీయములు. భక్తి యోగోపన్యాసములలో స్వామి యిట్లు చాటియున్నాఁడు: "తత్త్వోపదేశ మొనర్చు గురుని విషయమై యింతకంటె గొప్ప ప్రమాదములు కలవు. స్వయముగా అజ్ఞానపంకనిమగ్నులయ్యు, గర్వాతిరేకముచే సర్వజ్ఞులమని విఱ్ఱవీఁగుచు, అంతటితో నాఁగక, పరులను దరింపఁజేయుటకై తమ భుజము లొడ్డుటకు వెనుదీయక, తాననివారు కాననివారికి మార్గదర్శకులై తుదకు వారును వీరును గలిసి గోతిలోఁ బడుచుందురు. 'అవిద్యాయా మంతరే వర్తమానాః స్వయంధీరాః పండితం మన్యమానాః జంఘన్యమానాః పరియాంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః' (ముండకోపనిషత్తు: 1-2-8.) 'మూఢులు అజ్ఞానంధకారమున గోరాడుచు, మాకంటె ధీరులు లేరని విఱ్ఱవీఁగుచు, పండితంమన్యులై, గ్రుడ్డివారిచే నడుపఁబడు గ్రుడ్డివారివలెఁ దొట్రుపాటు నొందుచుఁ బరిభ్రమించు చుందురు.' లోక మిట్టి పండితంమన్యులతో నిండియున్నది. ప్రతి వ్యక్తికిని దాను ఆచార్యుఁడును గావలయుననియే తహతహ! ప్రతి యాచకునకును దాను బదిలక్షలు దానముచేయవలయుననియే ఆవేదన! ఈ యాచకులవలెనే ఈ యాచార్యులును నిజముగా హాస్యాస్పదులు."

భగవత్పరితాపము నొందినచో, మనఃపూర్వకముగ సాధన నవలంబింపఁ బూనినచో, సద్గురువు తప్పక లభించును. గురుకృప నొందినవాఁడు మార్గమును దెలిసికొనును. శ్రద్ధగా దాని నవలంబించుటయే వలయునది.

నాయనలారా! మీకు గుర్వనుగ్రహము కలదు, ముముక్షుత్వమును గలదు. మంత్రదీక్ష నొందుటచే మీకు భగవదనుగ్రహమును లభించియున్నది. మఱి మీకు సాధుసాంగత్యమును జేకూరియున్నది. ఇపుడు మీరు మనోనుగ్రహము సంపాదింపఁ బ్రయత్నింపవలసియున్నది. మనస్సును వశీకరించుకొనుటచే, మనస్సుయొక్క అనుగ్రహము వలన — చిత్తప్రసన్నతవలన— గురుప్రసన్నతయు భగవత్ప్రసన్నతయుఁ గూడ మీకు లభింపఁగలవు.

"గుర్వనుగ్రహము నొందియుండుఁ గాక. భగవదను గ్రహమును, భక్తానుగ్రహమును బొందియుండుఁగాక, మనోనుగ్రహము నొందని దే మానవుఁడు చెడిపోవును" అని యొక చక్కని వైష్ణవసూక్తి కలదు.

అధోముఖమై విషయచింతాసక్తమగుచుండు టయే నీచమనఃప్రవృత్తి, ఎటులైనను ఈయధోగ మన ప్రవృత్తి నరికట్టవలసియున్నది. కళ్ళెము గట్టిగాఁ బట్టుకొనుము. నిపుణుఁడగు రౌతు గుఱ్ఱమును వశపరుచుకొనుచందమున, నిపుణుఁ డగు మావటి యేనుఁగును స్వాధీనమొనర్చు కొని దానికిఁ దరిబియతు నిచ్చురీతిని నీవు నీ మన స్సును వశీకరించుకొన, దానికిఁ దరిబియతు నీయ నేర్చుకొనవలయును. మనస్సునకు అధిపతివిగావలయునే కాని అధీనుఁడవు గారాదు. తుచ్ఛశారీరభోగవాంఛల నన్నిఁటిని విసర్జింప నీ మనస్సునకు బోధింపుము. విషయలాలసనుండి విముక్తమైనంతనే మనస్సు నీ దాసురా లగును. ఇందువలననే త్యాగవైరాగ్యము లంతగా భగ వద్గీతాశాస్త్రములలోఁ గొనియాడబడి యున్నవి.

రాముఁ డేలు హృదయమున కాముఁ డుండఁ జాలఁడు, భోగవాంఛలును భగవచ్చింతయు నొక్కచోఁ గలిసియుండఁ జాలవు. ఇందేది కావలసినను నీవు రెండవ దానిని విడనాడవలసి యుందువు. కాని దివ్యానందమును—ఉత్కృష్ట

మఱి భగవదానందమును—నీవు రుచి చూచి ననే కాని, అల్పసుఖములను—నీచ విషయసుఖ ములను—పూర్తిగా విడనాడఁజాలవు, నీవు పిన్న వయసున నుండఁగా. ఇపుడే పూర్తిగా నీ హృద యమును భగవదర్పితము చేయుమని యిందు చేతనే నే నింతగా నొక్కి చెప్పుచుండుట. భగ వంతుని నీవాని నొనరించుకొనుము. "భగవం తుఁడు నా వాఁడు, నా ఆప్తుడు, నా సర్వ స్వము" — ఈ తత్త్వము నీ మనఃఫలకముపై ముద్రితము కావలయును. అయ్యెనా, మార్గము సుగమమగును. భగవదానందమును నీ వొక్క పరి రుచిచూచితివా, ఇతర సుఖము లన్నియు రసహీనముగా. తుచ్ఛముగా గాన్పించును. నీ జీవితమును భగవదంకిత మొనర్పుము. భగ వంతునే శరణుపొందుము. "నీట ముంచినా, పాల ముంచినా, నీ పదములే గతి" యని నమ్మి యుండుము.

# సాక్షీభూతుఁడవై నీ చిత్తవృత్తులను గమనించుచుండుము

జీవునకు స్వతంత్రేచ్ఛ కలదు. ఈ యిచ్ఛా స్వాతంత్ర్యము నిజముగా అంతరాత్మకు, పరమాత్మకు సంబంధించునట్టిది. "నీ యంతరాత్మ శక్తిని మేల్కొల్పుము" అని శ్రీరామకృష్ణదేవులు వచించువారు. తుదకీ సాధన లన్నిఁటి యొక్కయు, నియమనిష్ఠ లన్నిఁటియొక్కయు ఉద్దేశ్య మేమి? పరమప్రయోజన మేమి? ఈ యిచ్ఛను—ఈ జన్మముననే భగవల్లాభమును బొందవలయుననెడి యిచ్ఛను—బలీయ మొనర్చుటయే. మనసు శుద్ధమైనకొలఁదియు ఇచ్ఛ బలీయమగుచుండును. ఇట్టి యిచ్ఛను—సంకల్పమును—సడలించి, భవిష్యత్తున నెన్నఁడో భగవంతుని దర్శింతు ననుకొనుచుండుట వట్టి సోమరితనముగాని మఱియొకటి కాదు. బుద్ధునిఁగూర్చి చింతింపుము. ఆతని దెట్టి దృఢసంకల్పమో! "ఇప్పుడే బ్రహ్మసాక్షాత్కారము పొందనైనను

బొందవలయును, లేదా, యీ ప్రయత్నమున ప్రాణములనైనను విడువవలయును'' అని యాంత డనేక సంవత్సరముల పర్యంతమగు నన్వేషణము నకుఁ బిమ్మటఁ దుట్టతుద కొక చెట్టుక్రింద వజ్ర సంకల్పుఁడై కూర్చుండెను.*

వలయున దిట్టి వజ్రసంకల్పము. నీ కొక రహస్యము చెప్పెదను. ఇపుడు పూర్తిగా నీ కిది యవగాహన కాకపోవచ్చును, కాని కాలక్రమ మున నీ కిందలి సత్యము బోధపడును. ప్రతివాని సంకల్పమును, మనస్సును క్రమవికాసమార్గమున వానిని గొనిపోవుచు, పరమశ్రేయస్సు నొందించు నను నదియే యీ రహస్యము. కొందఱు పూల బాటల వెంబడి మఱికొందఱు ముండ్ల బాటల వెంబడిని నడువఁబడుచుందురు. కాని యెల్లరును ఒకే గమ్యమును బ్రాపింతురు. ఈ పరమ సత్య మును గ్రహించియే కొందఱు గురువరేణ్యులు

* 'మనస్సు భగవంతునిపై నిలుపుము' అను 18-వ ప్రకరణమున ఈ వృత్తాంతమునకు సంబంధించిన పాద దీపికను జూడనగును.

ఈ క్రింది శిక్షణ విధానమును బోధించుచుందురు: మనస్సును, సంకల్పమును బట్టఁ బగ్గములు లేకుండఁ బోవుచున్నను, పోనిమ్ము. కాని నీవు వాని పోకడను సదా జాగరూకతతో గమనించు చుండుము సాక్షీభూతుఁడవై యుండుము ఈ విధముగా సాధకుఁడు నిజముగను మనస్సును యథేచ్ఛగా నెరుగనిచ్చు చుండినను, దానిపై సదా కన్ను వేసియుండెనా, మనస్సు కొంత కాలముపాటు తుచ్ఛవిషయములపై కెగఁబడు చుండినను, సకాలమున, క్రమోన్నతమార్గమున పరమశ్రేయోన్ముఖముగాక తప్పదు.

ఆహా! అనంతుఁడగు భగవంతుని యనంత లీలావిలాసముఁల నెవరు నిరూపింపఁగలరు? మన మనోవాక్కుల మూలమున మనము భగవత్తత్వ మును గ్రహింప, నిరూపింపఁ బూనినపుడెల్ల, అనంతము, అప్రమేయము నగు దానిని సాంతము, ప్రమేయము నగు దానినిగాఁ జేయఁబూనుచున్నా మన్నమాట — మహాసము ద్రమును గిద్దతోఁ గొలువఁ బోవుచున్నా మన్న మాట!

## విశుద్ధహృదయుఁడవై యుండుము

శిష్యుఁడు: స్వామీ ఇంద్రియ నిగ్రహార్థ మనేక విధములఁ బ్రయత్నించితిని కాని కృతకృత్యుఁడను గాఁజాల కున్నాను. ఇంద్రియనిగ్రహము నొందు టెట్లు?

స్వామి: "నేను కామమును జయింతును, క్రోధ లోభములను జయింతును"—ఈ ధోరణి నవలంబించినచో నీ వెన్నఁటికిని వానిని జయింపఁ జాలవు, కాని నీ మనస్సును భగవంతునిపై నిలుపఁగలిగితివా, కామక్రోధాదులువానియంతట నవియే సమసిపోవును. "తూర్పునకుఁ బోసాగిన కొలఁదియుఁ బడమటికి దూరస్థుఁడవగుదువు" అని (శ్రీ) గురుదేవులు వచించువారు. భగవంతుని ప్రార్థింపుము, శరణు పొందుము. విషయసుఖములు నిన్నిఁక నెంతమాత్రము నాకర్షింపఁ జాలవు.

నీ జపధ్యాన విధానము 'ఆషామోషీగా' నున్నది. ఏదో తలవని తలంపుగా, దినమునకొకటి.

రెండు గంటలసేపు మాత్రము సాధనచేయు చున్నయెడల భగవంతునిఁ గనఁగొనఁజాలవు. అహర్నిశము భగవచ్చింతనమున, భగవద్గుణాను కీర్తనమున, నిమగ్నుఁడవగుము. అపుడే వాని దర్శనభాగ్యము నొందగలవు. నాయనా, లోఁతు నకుఁ బొమ్ము, తత్త్వరత్నాకరమున మునిఁగి వెదకుము. వ్యర్థ కాలక్షేపము చేయకుము.

ప్రారంభదశయందు సాధకుఁడు తనధ్యాన కాలమును నెమ్మదిగా, అయ్యును, బూనికతో సక్రమమార్గమున హెచ్చించుచు రావలయును. తాత్కాలికోత్సాహమున అకస్మాత్తుగ ధ్యాన కాలము హెచ్చించినచో, తన్మూలమున మన శ్శరీరములందుఁ గలుగు పరిణామమును భరింపఁ జాలక పోవుదువు. నిరుత్సాహమే తత్ఫలితము. వేయేల, ధ్యానశక్తిని గోల్పోవుదువు. నిరుత్సా హము చెందిన మనస్సు నుద్ధరించి యాధ్యాత్మిక సాధనలకు మరల్చుట బహుకష్టసాధ్యము సుమీ!

అన్నింటికంటెను భగవత్కృప ముఖ్యమని గ్రహింపుము. అది లేనిదే యేమియు సాధింపఁ

జాలము. భగవత్కృపకై నిరంతరము ప్రార్థింపుము. ప్రార్థన యెన్నటికిని నిరర్థకము కానేరదు. భగవంతుఁడు నీ ప్రార్థనలను వాత్సల్యముతో నాలకించును.

కొంచెము సేపు ఓరిమి గలిగియుండుము, పట్టు వీడకుము. విషయవాంఛలకు అధీనుఁడవుగాకుము. ప్రతి విషయమునందును ఎంతయో ఆత్మనిగ్రహము నవలంబింపవలయును. విషయవాంఛలా! అవి నిన్ను బానిసలవలె వెంబడించును. అయ్యును, భగవత్కృపవలన నీకు విషయ సుఖాపేక్షయే లేకుండును—అనాసక్తుఁడవై యుండుపు.

సమస్తము పరిత్యజించి నీవు సన్న్యాసము స్వీకరించి యున్నావు. ఇతరులపై నధికారము నెరపుట నీకుఁ దగదు. అది మహాబంధ కారణము. నీ వేమి చేయుచున్నను భగవత్కార్య మొనర్చుచున్నావని గ్రహింపుము. ప్రతికార్యము శ్రీ రామకృష్ణదేవుని కార్యమని, ప్రతి వ్యక్తియు శ్రీ రామకృష్ణభగవానునకుఁ జెందిన వ్యక్తియని

భావింపుము. "అహంకార మోహితుఁడై మానవుఁడు తాను కర్త ననుకొనుచుండును."*

అసత్యమాడుట మహాపాపము. త్రాఁగుబోతును, వ్యభిచారిని సైతము నమ్మవచ్చును గాని యసత్యవాదిని నమ్మరాదు! అది మహా పాతకము.

ఒరుల తప్పుల నెన్నఁబోకుము, ఒరుల చర్యలను ఖండింపకుము. అట్టి యలవాటు నీకే హానికరము. పరుల దోషములను గూర్చి నిరంతరము చింతించుచుండుటచే దోషమే నీ మనస్సున నాటుకొనఁగా నీయందలి యోగ్యత పలాయనమగును.

భగవానునితో క్రీడింపుము. వాని వైభవమును కీర్తింపుము. ఈ మహావిశ్వలీలను గాంచి యానందింపుము! ఒరుల చర్యలను నీవేల ఖండింపవలయును? అరమరిక యనునది లేకుండ నొరులతోఁ గలిసిమెలిసి వర్తింపుము. వారితోఁ గలిసి యానందింపుము. ఉబుసుపోని సుద్దులతో కాలము

* "అహంకారవిమూఢాత్మా కర్తాఽహమితి మన్యతే."
—గీత. 3-27.

పుచ్చుకుము. దుర్మార్గులగువారే పనికట్టుకొని యొరులతప్పుల నెన్నుచుందురు.

విశుద్ధహృదయుఁడవై నీ యాదర్శము నవలంబించుచుఁ జీవయాత్రయందు ముందడుగు వేయుచుండుము.

ఒరులందలి మంచినిఁగాంచ నేర్చుకొనుము. పరుల సద్గుణలవములను గొండంతలుచేసి మెచ్చుచు వానిని నీ మనస్సున హత్తించుకొనుము. ఎల్లరను గౌరవింపుము. ఎల్లరను గొనియాడుము.

నీ విట్లు లోనర్చుచుందువేని, నీ యెడఁదయందితరులయెడ సానుభూతి పెంపొందును. ఎల్లరను గౌరవించువాఁడు స్వయముగా గౌరవము నొందును. తోడిమానవు నెన్నఁడును అణఁగఁద్రొక్కకుము, నిరసింపకుము. అదేమిచిత్రమో, కాని ప్రతివ్యక్తియు నొరుల నెరసులనే వెదకుచుండును. పరునిఁ బ్రేమించి, వానిని నీవానిగా నొనర్చుకొని, దౌర్బల్యము నతిక్రమింప వానికిఁ దోడ్పడుము. ప్రతి మానవునియందును మంచి

చెఱుగు లుండును. ఇతరులయందలి దోషమును గనుఁగొనుట సులభము; కాని యొరుల దుర్గుణములఁ బాటింపక వారు నిర్మలులు, పావనులు నగుటకై తోడ్పడువాఁడే సాధుసత్తముఁడు.

నాయనలారా! మీరు సాధువులని, యతులని గుర్తింపుఁడు. సదా మీరు శాంతులు, దాంతులు, వినమ్రులు, మృదువాక్యరతులునై యుండవలయును. నీ వుచ్చరించు ప్రతిపదమునను, చేయు ప్రతికార్యమునను, గమన ప్రవర్తనము లన్నిఁటియందును సౌజన్యనైర్మల్యములు వెల్లి విరియుచుండవలయును.

నాయనలారా! మీ సాంగత్య మొనర్చువాఁ డెవ్వఁడైనను సరియే, చిత్తశాంతి నొందుఁగాక యని యాశీర్వదించుచున్నాను. నిద్రాణమై యున్న బ్రహ్మశక్తి వానియందు మేల్కాంచును.

పవిత్రత యనఁగా నేమ? బ్రహ్మచర్యమనఁగా నేమి? సదా సత్యసంధుఁడవై యుండుము. ఇంద్రియనిగ్రహము పూనుము. ఆఁచితూఁచి, తూఁచితూఁచి మాటి పలుకు

చుండుము. ఎవ్వరిని ద్వేషింపకుము. ఎవ్వరిని గర్హింపకుము. ఎవ్వరియెడలను అసూయ నొందకుము. పంద్రెండేండ్లెవ్వఁడు బ్రహ్మచర్య వ్రతము పరిపాలించునో యట్టివాఁడు పరమోత్కృష్టస్థితి నొందును. నీవు బ్రహ్మచర్యమును బరిపాలింపవలయును.

అవకాశము ననుసరించి యప్పుడప్పుడు పుణ్యక్షేత్రములకు వెడలి యచటఁ గొంత కాలము నివసించుచుండుట మంచిది. అచటి పవిత్రవాతావరణమును, నూతన ప్రకృతి రమ్యదృశ్యములును మనస్స్వస్థతకును, శరీరారోగ్యమునకును దోడ్పడఁగలవు. పుణ్యక్షేత్రములు ధ్యానమునకుఁగూడ ననుకూలించును.

హృదయమును నిర్మల మొనర్చుకొనవలయును. లోకము భ్రమ ప్రమాదభూయిష్ఠము. ఆత్మవికాసము నొందఁగోరెదవేని సాధన నీ మూలమంత్రమై యుండవలయును. మనస్సున నుదయించు ప్రతివాంఛను బరిశీలించి నిగ్రహింపవలయును. ఇచ్ఛను బలపఱచితివా, మిగిలిన వన్నియు సరళమగును.

శిష్యుఁడు : స్వామీ ! ధ్యానమునకుఁ గూరు చుండు నెడఁ గొన్నిదినములందు మనస్సు సహజ ముగ ప్రశాంతముగా నుండును. మఱికొన్ని దినములందు నే నెంత ప్రయత్నించినను శాంతి నొందక తీవ్రాందోళన నొందుచుండును.

స్వామి : అది గుణముల లీల. మనస్సు త్రిగుణములకును వశమైయుండును. సాధన మూలమున సత్త్వగుణము స్థిరపడినంతనే మన స్సెఁక నెప్పుడును ప్రశాంతముగ నుండును. గంగానదికిఁ బోటుపాటులుండునని నీవు గమ నించి యుండవచ్చును. సర్వవిషయములకును నిట్లే యొడుదొడుకు లేర్పడుచుండును. ధ్యానము నందును బోటుపాటు లుండును. ఏమైనను ఇది కేవలప్రారంభస్థితి. దీనినిగూర్చి కలఁత నొంద కుము. నీ సాధనలను విడువకుము. కొంత కాలముపాటు క్రమముతప్పక సాధన చేసితివా, మనస్సున కిఁకఁ బోటుపాటులనునవి కలుగవు. అంతట మనస్సున నొడుదొడుకులు లేని భావ వాహిని భగవంతునిదెస ప్రవహింపసాగును.

సత్త్వగుణము ప్రబలమై మనస్సు సహజముగ ప్రశాంతమైయున్నప్పుడెల్ల!, సమస్త కర్మములను విడనాడి జపధ్యానసాధనఁ బూనుచుండుము.

ప్రతిపుణ్యక్షేత్రము నందును నొకానొక ప్రత్యేక సమయమున ఆధ్యాత్మికవాహిని ప్రవహించుచుండును. అట్టి సమయమున సాధకుఁడు ధ్యానించుచో, మనస్సు సులభముగ ధ్యేయమున లీనమై ధ్యానానందము వృద్ధినొందును.

శిష్యుఁడు : అగుచో, స్వామీ! అట్టి సమయమును దెలిసికొను టెట్లు?

స్వామి : అది యంత కష్టముకాదు. ధ్యానసాధకుఁడు దాని నెంతయు సులభముగా గుర్తింపఁగలుగును. కాశి ! ఈ పరమపుణ్యక్షేత్రము ప్రపంచాతిరిక్తమై యున్నట్లు తోఁచును. అఖండమైన తత్త్వజ్ఞాననిలయ మీ పుణ్యక్షేత్రము. అచట నివసించి సాధనల

విశుద్ధహృదయుఁడవై యుండుము

నవలంబించుచో, ఎవ్వఁడైనను త్వరితముగా ఫలితమును గాంచును. బీజభూతమగు మంత్ర మిచట సాధకుని స్వల్పప్రయత్నము తోడనే వికాసము గాంచును. పాపాత్మునకుఁగాని, శ్రీమంతునకుఁగాని, నిఱుపేదకుఁగాని, ఘనునకుఁ గాని, యల్పునకుఁగాని—ఎవ్వరికైనను సరియే విశ్వనాథుఁడచట ముక్తి నొసఁగును.

## మహనీయజీవితముల ననుకరింపుము

శిష్యుఁడు : స్వామీ ! భగవద్భక్తి యెట్లు పెంపొందును ?

స్వామి : సాధుసాంగత్యమువలన. వారి బోధల నాలించి వారి జీవనవిధానమునుబట్టి నీ జీవితమును నియమించుకొనుము—దిద్దుకొనుము. కాని, ధ్యానమును బ్రహ్మచర్యమును అవలంబింపనిదే, తత్త్వజ్ఞానులగు మహనీయుల భావములనుగాని, వేదశాస్త్రసారమునుగాని నీవు గ్రహింపఁజాలవు. శ్రీ రామకృష్ణవచనామృతమును పఠించుచు తదుపదేశములను మననము చేయుచుండుము. భగవంతుని నీ వెంతగా ధ్యానింతువో సద్గ్రంథములు నీ కంతగా అవగాహన కాఁగలవు. శాస్త్రజన్యజ్ఞానము వేఱు, భగవన్నిష్ఠ వేఱు. ఇఁక సాక్షాదనుభవజన్యజ్ఞాన మీ రెంటికిని భిన్నము—అతీతము.

పేరుప్రతిష్ఠలయందుఁగాని, విషయభోగముల యందుఁగాని, నీ కేమాత్రము వాంఛయున్నను భగవంతునిఁ బ్రాపింపఁజాలవు. "అది లంగరు వేసియున్న నావను నడపఁబూనుటవంటి' దని నాగమహాశయులు వచించువారు మఱియు నిట్లు పలుకువారు: "పేరుప్రతిష్ఠలను సంపాదించుట సులభము. కాని వానిని త్యజింపఁ గలుగువాఁడు ధన్యుఁడు."

జ్ఞానియగు మహనీయుని సాంగత్యభాగ్యము నొందువాఁడు ధన్యుఁడు.

శిష్యుఁడు: స్వామీ! సాధుసాంగత్యమే చాలుననియు, నంతకంటె నేమియుఁ జేయ నక్కఱలేదనియుఁ గొందఱి విశ్వాసము.

స్వామి: అది కాదు! కేవల సాంగత్యము చాలదు. మనను విప్పి నీ సంశయముల దీర్చు మని వారి నడుగుము. వారి జీవితములను జాగరూకతతోఁ బరిశీలించి తద్విధానము ననుకరింపుము. సాధుసాంగత్యము మాత్రమే చాలు

నిలుపుకొనవలయును. వానిని వెలువరించితివా, ప్రకటించితివా, యవి నిస్సారములై హరించి పోవును. అంతట ఆధ్యాత్మిక జీవనముననే యరుచి కలుగవచ్చును.

నిజమైన భక్తుడు తాలిమి విడువకయే భగవత్పరితాపము నొందును. ఒకవేళ వికాసము నొందకున్నను, ఆతఁడు భక్తిప్రపత్తులను విడువఁడు. వర్తకులవలె లాభము నాశించుచు భక్తి నవలంబించువారు మాత్రమే తమ ప్రార్థనలు వెనువెంటనే సఫలీకృతముకానిచో సాధనలను విడనాడుదురు.

# సత్సాంగత్యము చేయుము

స్వామి: భగవద్ధ్యానమున నిమగ్నుఁడ వైనంతనే యఖండానందము ననుభవింతువు. ప్రజ్ఞానానందమున రేయింబవళ్లు నిముసములై గడచిపోవును.

నీ యాధ్యాత్మిక మనస్స్థితులను, అనుభూతులను గూర్చి ప్రతివారికిని జెప్పఁబోకుము. లౌకికుల కసలే చెప్పరాదు. అది నీ వికాసమునకు నిరోధకరముగావచ్చును. కాని సమమనస్కునకు, నీ మనఃప్రవృత్తితో సమన్వయించు మనఃప్రవృత్తిగలవానితో, నీ యనుభూతులను గూర్చి ముచ్చటింపవచ్చును. అట్టి మీరిరువురును ఒండొరుల యనుభూతులను గూర్చి ముచ్చటించుకొనిన యెడల, అయ్యది ఆత్మవికాసమునకు దోహదము కావచ్చును. మీరిరువురును ఏకమార్గమునఁ జరించు యాత్రికులు. నీ సహచారి యీ మార్గగామియై యందలి

భ్రమప్రమాదములను గనుఁగొనియుండవచ్చును. వాని యనుభవములవలన లాభమునొంది యా ప్రమాదములను, కష్టములను నీవు తొలఁగించుకొన సమర్థుఁడవు గావచ్చును.

సాధుసాంగత్య మెందుల కరయవలయునో నీకుఁ దెలియునా? వారి యనుభూతియే సాధకునకు జీవగఱ్ఱ. నీ వొక నూతనస్థలముఁ జూడఁ బోవునపుడు మంచి మార్గదర్శి యొకఁ డున్నచో, వాని తోడ్పాటున నత్యల్పకాలముననే యచటఁ జూడఁదగినదాని నంతయుఁ జూడఁగలుగుటయే కాక, నూతన వ్యక్తులు తఱచు గుఱియగుచుండు భ్రమ ప్రమాదములను దప్పించుకొనఁ గలుగుదువుగదా? ఇటులే విశేషాధ్యాత్మిక వికాసము గాంచినవారల సాంగత్యమువలన నమూల్యమగు ననేక కీలకములను దెలిసికొందువు, వానిచే నీ సాధన సులభము కాఁగలదు.

ఏక్షణముననైనను ఈ జీవిత మంతము కావచ్చును, ఎప్పుడో యెవరికినిఁ దెలియదు.

ఆధ్యాత్మికనిక్షేప సంపన్నుఁడవై యీ యాత్రకు సంసిద్ధుఁడవు గమ్ము. అజ్ఞాత స్థలమునకు రిక్త హస్తములతోఁ బోవుట విశేషకష్టముల కాకరమై యుండును. పుట్టిన జీవి గిట్టక తప్పదు. మరణ మనఁగా అజ్ఞాతస్థలమునకుఁ బోవుట. కావున నీవు యాత్రకు సంసిద్ధుఁడవు కావలయును. సదా మృత్యుదేవత పిలుపునకు సంసిద్ధుఁడవై యుండుము.

ఇచట నీ యాత్మవికాసమునకు సమస్త సదుపాయములును గలవు. ఇపుడే పరమార్థమును బడయఁ బ్రయత్నింపుము. మూలవిరాట్టు నాశ్రయింపుము. అఖండాత్మ విశ్వాసమును గలిగి యుండుము. "నేను భగవంతునిఁ దెలిసికొనఁ గలను"—ఇట్టి విశ్వాసముతోఁ బురోగమించుచో వానిని బ్రాపింతువు. అంతట జన్మము ధన్యమగును. ఓయీ జననమరణ చక్రము నుండి విడివడుము. భగవానుని శాశ్వతానుచరుఁడవు గమ్ము!

భగవద్దౌర్బల్యములను ద్రోసిరాజనుము. మునుపు చేసిన తప్పిదములఁగూర్చి తలపోయుచు మనస్సును దుర్బల మొనర్చుకొనకుము. పాపమా? మానవదృష్టికే పాపము పొడ కట్టును. భగవద్దృష్టిలో నట్టిదేమియు లేదు. వాని కృపాకటాక్ష మొక్కటి ప్రసరించినఁ జాలును. అనేక జన్మానుగత పాపములన్నియుఁ బటాపంచలై పోవును.

నీవు శ్రీ రామకృష్ణదేవుని సన్నిధికి వచ్చి యున్నావు. ఆతని విడనాడకుము. నీకే తాపత్ర యము నుండదు. సాధనలకు నీకుఁ గట్టుదిట్ట మయిన నిత్యక్రమముండవలయును. ధ్యాన పారాయణములకై నీవు కొన్ని నియమిత సమయ ములను — ముహూర్తములను — నేర్పఱచు కొనవలయును. సర్వకాల సర్వావస్థలయందును శ్రద్ధాభక్తులతో క్రమము ననుసరింపుము. స్థైర్య మత్యావశ్యకము; స్థైర్యము తోడిదే విజయము.

సాధనయందలి స్థైర్యము మూలముననే మనస్సు భగవంతునియందు నిమగ్నతఁ జెందును.

నిమగ్నత సాధింపఁబడనిదే సంసారవ్యామో హము సమసిపోదు. కామక్రోధ లోభము లనునవి ప్రబల శత్రువులు. భగవద్బలమున బలీయుఁడవై మాయాజాలమును దొలఁగించు కొనుము.

నీ క్రమము ననుసరింపుము. ప్రారంభమున నీ మనస్సదుపాజ్ఞలకు లోఁబడకుండ నెదురు తిరుగ వచ్చును. బానిసవలె దానికి వశవర్తివి గాకుము. క్రమముగా నీ మనస్సునకు నీ వధిపతి వగుదువు. ఆత్మనిగ్రహము, లేక ఆత్మసంయ మము లభింప, మనస్సు సహజముగ భగవ న్నిమగ్నమైనంతనే, నీవికఁ నే నియమక్రమము లను అవలంబింప నక్కఱ లేకుండును.

జీవితము నదివలెఁ బ్రవహించి పోవుచున్నది. పోయిన దినము తిరిగిరాదు. నీ సమయము సద్వి నియోగ మొనర్చుకొనుము. అవసానసమయ మున, "అయ్యో! అయ్యో!" యని కుయ్యి డుటవలన నేమియు లాభము ఉండదు.

## సహనశీలుఁడవై యుండుము

శిష్యుఁడు: స్వామీ, మే మందఱము ఇంటిని, వాకిలిని, బంధుజాలమును విడిచిపెట్టి యేకాదర్శముతోడను, ఏకప్రయోజన కాంక్షతోడను ఇచటికి, ఈ మఠమునకు, వచ్చియున్నను, ఒండొరులతోఁ బొత్తు కలిగి మెలఁగఁజాలకుండుటకు హేతు వేమి?

స్వామి: నాయనా! మీ రందఱును ఒండొరులయెడ సహనబుద్ధితో మెలఁగ నేర్చుకొనవలయును. "సహనము గలవాఁడే నిలువఁద్రొక్కుకొని యుండఁగలుగును" అని శ్రీ రామకృష్ణదేవులు వచించువారు. సంసారులగువారు సైత మెన్నో విషయములను సహింపవలసియుండును. ఎల్లరతోడను బొత్తు కలిగి మసలుచుండుటయే శీలసౌభాగ్యము, సౌశీల్యమహాబలము. ఒకరికి హానిచేసినవాఁడు, లేదా, ఒకరి మనసు నొప్పించినవాఁ డెన్నటికిని చిత్తశాంతిఁ గలిగియుండఁ జాలఁడు. ఒరుని మనస్సు నొప్పించెడి యొక్క మాటైనను ఎన్నఁడును ఆడకుము.

సత్యము చెప్పుము, కాని యెన్నఁడును అప్రియ సత్యము చెప్పకుము.*

నాయొద్దకు వచ్చు రకరకముల మనుష్యుల నందఱను జూచుచుందువు గదా? వారిలోఁ గొందఱు యోగ్యులు, కొందఱు అయోగ్యులు; ఐనను నేను వారి నందఱను సమానముగనే ప్రేమింతును. దుర్బలులను, పతితులను నేను దఱిమివేసిన యెడల, వారి కాశ్రయ మొసఁగువా రెవ్వరు? మహనీయులతోఁ బొత్తు కలిగి మెలఁగుట సులభము. కాని యెల్లరితోడను, సర్వభూతములతోడను సామరస్యమున మెలఁగుటయందే నిజమైన బల మిమిడియున్నది.

* శ్లో "సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్,
ప్రియం చ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః."

—మనుధర్మశాస్త్రము.

(సత్యము చెప్పవలయును, నీవు చెప్పుదానిని ప్రీతికరముగఁ జెప్పవలయును, అప్రియసత్యము చెప్పరాదు; మఱియు ప్రియమని యసత్యము చెప్పరాదు. ఇదియే

# కర్మము, జపధ్యానాదులును ఒండొంటికిఁ దోడునీడలై సాగుచుండవలయును

స్వామి : నీ సాధనలు బాగుగా సాగుచున్నవి కదా?

శిష్యుఁడు : స్వామీ, అంత బాగుగా సాగుట లేదు. నా కందులకుఁ దగినంత సమయము కాన్పించుట లేదు. నే నెంతో పనిచేయవలసి యున్నది.

స్వామి : సమయము లేకుండుటచే ధ్యానము సాగింపఁ జాలనని తలఁచుట పొరపాటు. నీ చిత్త విక్షేపమే దానికి నిజమైన హేతువు.

కర్మము, జపధ్యానాదులును ఒండొంటికిఁ దోడునీడలై సాగుచుండవలయును. కాలమునంతయు జపధ్యానాదులందే వినియోగింపఁ గలుగునెడల బహుశ్రేయస్కరము; కాని యట్లు చేయఁగలుగువా రెందఱు? పనిచేయకుండ, ఊరక

తెఱఁగులుగా నున్నారు. కార్యపరుఁడై యుండఁ జాలని మందుఁడై — వట్టి యవివేకియై — యుండువాఁ డొకఁడు, సమస్త కర్మాతీతుఁడై యుండు ఋషి యొకఁడు. గీత చాటునట్టుల, "కర్మము చేయకయే కర్మరాహిత్యము నెవ్వఁడును బొందఁజాలఁడు,"* ధ్యానస్థితి నొందుటకు కర్మము సాధనము. కర్మత్యాగ మొనర్చి సన్న్యాసులై జీవించువారుకూడ జీవనమున కావశ్యకమగు నాహారపానీయాదులకై కొంత కాలము వ్యయింపవలసియుందురు.

స్వార్థమై కర్మ మొనర్చుటకు బదులు భగవదర్థమై కర్మ మొనర్పుము. నీ కర్మమూలమున భగవదారాధన మొనర్చుచున్నావని తెలిసి

* శ్లో. "న కర్మణా మనారంభా
నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే,
న చ సన్న్యసనాదేవ
సిద్ధిం సమధిగచ్ఛతి." —గీత, 3-4.
కర్మములను ఆచరింపకపోవుటవలన మానవుఁడు నిష్క్రియమగు నాత్మస్వరూపావస్థితిని బొందఁడు. కర్మ

కొనుము. ఈ భావముతో కర్మ మొనర్పఁ గలిగితివేని కర్మము నిన్ను బంధింపదు సరికదా, శారీరకముగను, మానసికముగను, నైతికము గను, ఆధ్యాత్మికముగను — సర్వవిధములను నీ కది శ్రేయస్కరమగును. నీ మనశ్శరీరములను భగవత్పాదారవిందములకు సమర్పించుకొనుము. సంపూర్ణాత్మార్పణ మొనర్చుకొని, ఈశ్వర సేవకుఁడవై యిట్లు విన్నవించుకొనుము: “నా మనశ్శరీరములను, నా సర్వస్వమును నీకు సమర్పించుకొనుచున్నాను. ప్రభూ! నేను నీ సేవ కుఁడను, నా శక్తికొలఁదియు నీసేవ చేయ సంసి ద్ధుఁడను; నన్ను నీ యిచ్ఛానుసారము వినియో గించుకొనుము.” నీ విట్లు చేయఁగల్గితివేని, నీ యిహపరశ్రేయోబాధ్యత వానిమీఁద నుండును. దానివిషయమై నీకిఁక నెంతమాత్రము తాప త్రయపడనక్కఱలేదు. కాని సరియగు భావ మున, సంపూర్ణవిశ్వాసమున, నీ విటు లాత్మా ర్పణ మొనర్చుకొనవలయును. కాని సంశ యాత్ముఁడవై, “నదిని దాఁటుటకై భగవ న్నామము నుచ్చరించుచుఁ దోఁడోఁడనే బటుబ

తడవకుండ వాని నెత్తిపట్టుకొనకుండునట్లు మాత్రము" చేయకుము *

* ఇది శ్రీరామకృష్ణుని నీతికథలలో గొల్లతను, బ్రాహ్మణ పూజారిని గూర్చిన కథను సూచించుచున్నది.

ఒక గొల్లపడుచు ఏటికావలియొడ్డున నుండు నొక బ్రాహ్మణునకు వాడుకగా పాలు తీసికొనిపోయి యమ్ముచుండెడిది. నావ రాకపోకలు సరిగాలేని కారణమున ఆమె ప్రతిదినము సకాలమునకు పా లందీయలేకుండెను. ఒకనాఁడా బ్రాహ్మణుఁడు చీవాట్లుపెట్టఁగా, ఆ దీనురాలు ఇట్లు పలికెను: "నే నేమి చేయుదును, బాబూ! ఇంటికడనుండి పెందలకడనే బయలుదేఱుదును. ఏటియొడ్డున పల్లెవాని కోసము, ఏఱుదాఁటువా రందఱు వచ్చి చేరుటకోసము, కనిపెట్టుకొనియుండవలసివచ్చుచున్నది." అంత నా యర్చకుఁడిట్లనియె: "వెఱ్ఱిదానా! భగవన్నామోచ్చారణము చేసి సంసారమునే దాఁటవచ్చునే, నీవు చిన్నయేటిని దాఁటలేవా?" అమాయకురాలగు ఆ గొల్లత యేటిని దాఁటు నీ సులభోపాయమునుగూర్చి విని చాలా ఆనందించెను. మఱునాఁటినుండియు ఉదయముననే ఆమె బ్రాహ్మణునకు పాలందించుచుండెను ఒకనాఁ డాతఁడామె నిట్లడిగెను: "నీ వీ మధ్య చాలా పెందలకడనే వచ్చుచున్నావు, ఎట్లు?" ఆమె

గురుదేవుడు నిర్యాణము నొందినపిమ్మట మేము ఐదారుసంవత్సరములు పరివ్రాజక జీవన మొనర్చి, పిమ్మట నుద్యానమునకుఁ బూను కొంటిమి. స్వామీజీ (వివేకానందస్వామి) ఒక నాఁడు నన్నేకాంతముగాఁ బిలిచి యిట్లనిరి: "ఈ పరిభ్రమణములో నేమియు లేదు. శ్రీ రామకృష్ణ దేవుని పేరు తలఁచుకొనుచు, ఏఱు దాఁటి వచ్చుచున్నాను. ఇఁక నాకు నావ అవసరములేకున్నది."

బ్రాహ్మణుఁ డా పలుకులు నమ్మఁజాలక, "సరియే కాని నీవు ఏ తెట్లు దాఁటెదవో నాకుఁ జూపెదవా?" యనియెను. ఆమె, "చూపెద" నని బ్రాహ్మణునిఁ దనతోఁగూడఁ దీసి కొనిపోయి నీటిమీఁదనుండి నడచిపోసాగెను కొంతసేప టికి వెనుకకుఁ దిరిగి చూచి యామె బ్రాహ్మణుని దురవస్థను గమఁగొని యిట్లనియెను: "అదేమి, బాబూ! నోటితో దేవుని పేరు పలుకుచు, చేతితో బట్ట పైకెత్తి పట్టుకొను చున్నావు? నీవు పూర్తిగా దేవుని నమ్మనట్లు కనఁబడు చున్నది!"

భగవంతునకు సంపూర్ణమైన ఆత్మార్పణము, ‌వాని యందు సిద్ధమైన నమ్మిక—ఇవియే అద్భుతకార్యము లన్నిఁటికిని మూలము.

దేవార్థము కర్మ మొనర్పుము." * ఆ దినము లలో తీవ్రకృషి చేసితిమి. అది మాకేమియు హానికరము గాలేదు, సరికదా, విశేషశ్రేయస్కర మైనది. స్వామీజీ వాక్కులందు మాకు గొప్ప నమ్మకము. స్వామీజీ, శ్రీ రామకృష్ణులు నను నీ యిరువురి మహనీయులందును నీ వఖండ విశ్వాసముఁ బూని వారినిమిత్తము కార్యముల నొనర్పుము.

కర్మమును, జపధ్యానాదులను ఒండొంటితో సమన్వయించి సాగింపవలయును. కాని వానిని సమన్వయించుట మొదట కష్టముగఁ దోఁచ వచ్చును. జయము నందువఱకును విడువక ప్రయత్నించుచుండవలయును. శ్రీ గురుదేవులు ఇట్లు వచించువారు: "అప్పుడు పుట్టిన దూడ నిల్చుండఁ బ్రయత్నించును. కాని పెక్కుసార్లు

* శ్రీ బ్రహ్మానంద వివేకానందస్వాము లొండొరులను, 'నీవు, నీ' వని సంబోధించుకొనువారు; కాని యితరులతో సంభాషించునపు డొండొరులనుగూర్చి గౌరవపూర్వకముగ

తడఁబడును, పడును. అయినను అది యూరక యుండక మఱలఁ బ్రయత్నించును. తుదకది నిల్చుండుటయేకాక, పరుగెత్తనేర్చును.'' పారమార్థిక జీవన ప్రారంభమున నేదియో యొక నియమిత కర్మమును క్రమముగ నొనర్పఁబూనినచో మన స్సునకు సుశిక్షణ మలవడును. అట్టి సుశిక్షితమైన మనస్సును ధ్యానాదిసాధనలందు నియోగింప వచ్చును. ఒకప్పుడు మనస్సును నలువైపులను జెదరనిచ్చినచో, ధ్యానసమయమునను జెదరి పోవుచుండును.

ఆధ్యాత్మికవికాసము నొందినవానికి ధ్యాన ప్రార్థనలందే కాలము గడుపఁగోరు నొకానొక సమయము వచ్చును. అట్టి సమయమున కర్మము వానియందుండి తనంత నదే తరలిపోవును మనస్సు ఆధ్యాత్మిక ప్రబోధము నొందినప్పు డిది సంభవించును. ఇట్టి ప్రబోధము నొందక, కేవల బలాత్కారమైన సంకల్పముచే ఆధ్యాత్మిక సాధన యందే కాలము గడుపఁ బూనినచో, కొలఁది రోజులు మాత్రమే అట్లు చేయఁగలుగును: అంతట

విసుగు పుట్టును. కాదు, కూడదని మొండి పట్టు పట్టినచో నొక్కొక్కప్పుడు మతికూడఁ జెడును. కొందఱు 'ఆషామోషీగా' ఆధ్యాత్మిక మార్గమును అవలంబించుచుఁ, దోడ్తోడనే లౌకికవిషయములను గూర్చి యదేపనిగాఁ జింతించుచుందురు. అది మంచిది కాదు.

బ్రహ్మచర్యావలంబనమున మహాశక్తి సంపాదింపవచ్చును. నిజమైన బ్రహ్మచారి యిరువది యైదుగురు చేయుపనిని దానొక్కడే చేయఁగల్గును. బ్రహ్మచర్యముతోఁ బాటు జపధ్యానములను జేయుచు సాధుసాంగత్యము చేయుచుండుము.

అనేకులకుఁ దమ కేది శ్రేయస్కరమో తెలియదు; అందుచేతనే వారు సత్సాంగత్యము చేయవలయును. ఏకాంతముగాఁ గాని, సాధుసాంగత్యమునఁగాని కొంతకాలము గడపనిదే యెవ్వనికిని దన మనస్తత్త్వము తెలియదు. గందరగోళమునను, అల్లకల్లోలమునను మసలుచు, ఆధ్యాత్మిక వికాసము నొందుట దుస్సాధ్యము.

నే నెల్లరకును స్వాతంత్ర్యము నంగీకరింతును. స్వీయమార్గానుసారమే ప్రతివ్యక్తియు ఆత్మ వికాసము నొందవలయునని నా యభిప్రాయము. ఒకానొక సాధకుఁ డటులఁ జేయఁజాలని యపుడు నేను వానికిఁ దోడ్పడెదను.

జీవితము—శాశ్వతజీవితము—నీ యధీనమై యున్నది! భగవత్సేవకై కొన్ని జన్మములను వినియోగించినచో — అవి నిరర్థకమే యను కొందువుగాక—లో టేమి? కాని యది యట్లు కాఁజాలదని వక్కాణించుచున్నాను. శ్రీ రామ కృష్ణానుగ్రహమున నీ వెట్టి యున్న తాధ్యాత్మిక స్థితుల నందఁ గలవో నీయంతట నీవే కనుఁగొన గలవు.

ఆహార నిద్రాదికములతో సంతుష్టుఁడవై యిఁక నెంతమాత్రము కాలయాపన చేయకుము, పాలుమాలికతనము వీడుము, లేనిచో నీ వెట్టి పారమార్థిక సాధనలను సరిగాఁ జేయఁజాలవు. నీ వే పని చేయుచున్నను సరియే. దానిని మనః పూర్వకముగాఁ జేయుము. స్వామిజీ (శ్రీ

వివేకానందస్వామి) వచించుచుండునటుల,
ఇదియే కర్మ రహస్యము.

భగవదర్థము కర్మ మొనర్పఁబూనుము; కర్మ
మారంభించుటకు ముందు భగవంతుని స్మరించి
వానికి వందనము లర్పింపుము. పనిచేయుచుండఁగా
మధ్యమధ్యను, అంతముననుకూడ నిటు లొన
ర్పుము, గురుదేవుని (శ్రీ రామకృష్ణుని) జీవితో
పదేశములనుగూర్చి చింతించుచు కాలమంతయు
గడపుచుండుము. నీవు చేయు సమస్త కర్మము
లును ఆయన నిమిత్తమేయని నీ హృదయాంత
రమున గ్రహించియుండుము.

చిత్తప్రశాంతి నొందఁ బ్రయత్నింపుము.
తమస్సునకును. మాంద్యమునకును వశ్యుఁడవు
గాక మనఃప్రసాదము నందఁ బ్రయత్నింపుము.
మనస్సును పరిభ్రమింపనిచ్చుచు, నొక దారియు
తెన్నును లేకుండ జీవయాత్ర చేయసాగినచో
చెడుగులు సంభవించును. కామక్రోధాదులు
నిన్ను వశపఱచుకొనును. జపధ్యానముల మూల
మున నింద్రియములు తమంతఁ దామే స్వాధీన

మగును. కాని ప్రారంభమున నీవు వాని నదు పాజ్ఞలలో నుంచ బ్రయత్నింపవలయును.

సాధనను బూని జపధ్యానములను జేయు చుందుము. నిరంతరముగ సాధన చేయసాగినచో, క్రమముగ భగవచ్చింతానిమగ్నుడవై గంటల కొలది ధ్యాననిష్ఠలోగూర్చుండ నానందింతువు. కాని ప్రారంభమందు దినమునకు నాలుగైదు సార్లు, ప్రతిపర్యాయము కొలది కాలము మాత్రమే, ధ్యానమున గూర్చుండుట శ్రేయస్కరము. నీ కిష్టమున్నను, లేకున్నను జపసాధన చేయుము. దీక్షతో నిట్లు చేయుచు రాగా మనస్సు ధ్యాననిమగ్న మగుట నిశ్చయము. ప్రశాంతి నొందుటకై, నీ చిత్తవృత్తులకు బ్రతి కూలముగ నైనను సరియే, క్రమసాధన సాగింప వలయును. ఆత్మప్రబోధము కలిగితీరును. అది సిద్ధించ నపుడు, సీయం దంతవఱకు ఏ కామ క్రోధాదు లుండుగాక, అవన్నియు విస్మరింప బడును.

## ఒక చేతితో భగవత్పాదపద్మములను బట్టుకొని రెండవ చేతితో భగవత్కార్యము నాచరింపుము

స్వామి : తురీయానందస్వామియు నేనును ఆబు కొండపై నివసించుచుండ, స్వామిజీ (శ్రీ వివేకానందస్వామి) యమెరికా దేశమునకు వెడలుటకుముం దాయన యొద్దనుండి మా కొక లేఖ వచ్చినది. అందిట్లు వ్రాసిరి : "బహుజన హితార్థము, బహుజనసుఖార్థము మీ జీవితమును వినియోగించుటే ధర్మము—పరమార్థము. స్వార్థ మేమి చేసినను అది పరమార్థము కానేరదు." ఎంత యద్భుత సత్యము! ఆయన మాటలు నా మనఃఫలకమున ముద్రితమైనవి.

శ్రీ రామకృష్ణ సేవాసంఘ కార్యములందు మీరు నిర్వహించుపనులు మీ ధ్యానమునకును, ఆధ్యాత్మికవికాసమునకును నిరోధకరములనియు, ప్రేమానందస్వామియు, నేనును అట్టి పనుల

నామోదింపమనియు మీలోఁ గొందఱు నమ్ము చున్నట్లు నాకుఁ దెలియవచ్చినది. ఈ మీ నమ్మిక నిరాధారము. మా భావమును మీరు గ్రహింపరైతిరి. మీ మీ విహితకర్మనిర్వహణ మున మీ రెంతటి నిమగ్నులైనను క్రమానుగత జపధ్యానములు చేయుచుండవలయునని పదే పదే నేను నొక్కి వక్కాణింతును. కార్యా రంభమునను, కార్యము చేయుచున్నప్పుడును, సమాప్తమైన పిమ్మటను - సదా భగవంతుని స్మరించుచుండవలయును.

"కర్మ మొనర్పుము, తోడ్తోడనే ధ్యాన ప్రార్థనాదుల నాచరింపుము'' అని స్వామిజీ చెప్పుచుండఁ దఱచు వినియున్నాము. ప్రారంభా వస్థయం దెవరైనను అహర్నిశము ధ్యాననిమ గ్నులై యుండఁగలరా? కావున మీ రసంగులై, లోకహితార్థులై కర్మ మొనర్పవలయును. కర్మ మొనర్పనిచో, దుశ్చింతలును, లేనిపోని తాప త్రయమును మనస్సు నాక్రమించును.

నిత్యకృత్యములతోఁ బాటు పూజాధ్యానముల నాచరింపవలయుననెడి యాదర్శమును గీతాది

శాస్త్రములు నొక్కి చెప్పుచున్నవి. స్వానుభవ పూర్వకముగ నేను దీనిని స్థిరపఱచఁగలను. "పూజాధ్యానాదులు, కర్మాచరణము" ననున వియే ఆధ్యాత్మికవికాసమునకు సునిశ్చిత మార్గము.

ఇపుడు జరుగుచున్న ఘోర యుద్ధమును * జూచుచుంటివి గదా! నిరర్థక దేశభక్త్యుద్రేక మున జనులు తమ యాలుబిడ్డలను, సమస్త సుఖము లను విడనాడుచు, కేవల లౌకిక ప్రయోజనార్థమై తమ ప్రాణముల నర్పించుచుండ, ఉత్తమాదర్శము నిమిత్తమై—భగవత్సాక్షాత్కార జగత్కల్యాణా ర్థమై—ఇంటిని, వాకిలిని, సమస్తభోగములను విడిచి పెట్టి, శ్రీ రామకృష్ణ చరణోపాంతమున ఆత్మసమ ర్పణ మొనర్చుకొనిన మీరు కొలఁది పాటి కార్యాచరణమును దప్పించుకోఁ జూచుటయా! స్వామిజీ మాతో నిట్లనుచుండువారు: "పర హితార్థాచరణమున జీవితము వ్యర్థపుచ్చు చున్నామని మీరు తలఁచుచుంటిరా, వ్యర్థమే కానిండు, నిరర్థకవిషయములకై యెన్ని జన్మము

* మొదటి ప్రపంచసంగ్రామము సూచితము.

లను మీ రింతకు ముందు వ్యర్థపుచ్చియుండలేదు? లోకహితార్థమొక్క జీవితము నేల వ్యర్థపుచ్చ రాదు?"

కాని నీ జీవితము వ్యర్థముగాదని నీకు నేను జెప్పుచున్నాను. కర్మాచరణమూలమున భగవత్సాక్షాత్కారము నొందెదవు.

జపధ్యానముల నాచరించుటకు వలసినంత సమయమును, అనుకూలపరిస్థితులును ఆవశ్యకము లనుటకు సందియము లేదు. కాని జపధ్యానముల నాచరింపఁబూనువా రెట్టి పరిస్థితులందైనను వాని నాచరింతురు. సమయము లేదనియో, అనుకూలస్థలము చిక్కలేదనియో, మొఱలిడుచుండువా రీ జన్మమున నెన్నఁడును పురోభివృద్ధి నొందరు. ఊరక యుండినను, పనిచేయుచున్నను, నిరంతర భగవత్స్మరణ నలవఱచుకొనుము.

ఇట్టి నిరంతరభావవాహినియే ధ్యానము. భగవత్స్మరణ విషయమున దేశకాలపరిస్థితులను గమనింప నక్కఱలేదు. సాధనయందు నిమగ్నుఁడవు కమ్ము! ఆహా! అది యెంతటి దివ్యానంద

దాయకము! ఆ యానందము నొక్కపరి రుచి చూచినచో, నిక మఱేదియు రుచింపదు.

కర్మాచరణమనిన నీ కెందులకు భయము! భగవదర్థము—భగవత్ప్రాప్తి నిమిత్తము— కర్మ మొనర్పుము. కాని స్థిరచిత్తుఁడవై కర్మ మాచరింపవలయును. మహోద్యమ మయినను, అతి సామాన్యకర్మమైనను, అత్యంత శ్రద్ధాభక్తులతో నొనర్పవలయును. సంసారకృత్యము లందు నిలుకడ గలవా రాధ్యాత్మికసాధనలందును నిలుకడ గలిగియుందురు. తగురీతిని కర్మ మొనర్పవలయునన్నచో, కర్మము నెడ విశేషపూజ్యభావము నొందియుండుటయే గాక, కర్మఫలముల యెడ నుదాసీనభావము కలిగియుండవలయును. భగవదర్పణబుద్ధితో కర్మమొనర్చుచో, కర్మాచరణమనిన నీ కెన్నఁటికిని అరుచి కలుగజాలదు.

ఈ రహస్యమును మఱచినపుడే చిత్తక్షోభ కలుగుచుండును. వ్యాకులచిత్తుఁడవైనచో, పారమార్థికజీవితమునఁగాని, వ్యావహారిక కర్మమునఁగాని విజయము నందఁజాలవు. పేరుప్రతిష్ఠల నిమి

_త్తము సత్కార్యము నాచరించుట నిశ్చయ ముగా బహు సులభము. అట్టి కార్యములను బట్టి మన మొకని నిక్కమైన యోగ్యతను నిర్ణ యింపఁజాలము.

నిజముగా నొకఁ డెట్టివాఁడో తెలిసికొనవల యునని, వాని నిత్యకృత్యములను బరిశీలింప వలయును; ఏలన వాని యథార్థ స్వభావమును దెలుపునవి నిత్యకృత్యములే. నిజమైన కర్మ యోగి యే కార్యమునైనను—అది యత్యంత క్షుద్రకార్యమగుఁగాక — మనఃపూర్వకముగా నొనర్చుచు నందు లీనమగును. జనుల మెప్పు నొందుదమను కోరిక యాతని నెన్నఁటికినిఁ బ్రేరే పింపఁజాలదు.

కర్మ మాచరించుచుండియు భగవంతుని మఱచినచో, అహంకారము నిన్నావేశించును. కావున నీవు కర్మ మొనర్చుచున్నను, ఊరక కూర్చుండియున్నను సరియే, భగవంతు నెన్నఁ డును మఱువకుము. ఈ మనోభావమును నిలుపు కొనవలయుననిన, ఏమి జరిగినను సరియే, నీ సాధనలను నిష్ఠతో సాగించుచుండవలయును.

ఒక యువశిష్యుఁడు తపమొనరించుటకై యే యేకాంత ప్రదేశమునకో వెడలిపోవ నిశ్చ యించుకొని స్వామి సన్నిధి కేఁగి యనుజ్ఞను గోరెను. ఆతని యుద్దేశము విని స్వామి యాందో ళితహృదయుఁడై యిట్లు పలికెను : "శివానంద స్వామి నిటకు రమ్మని చెప్పు." శివానందస్వామి వచ్చి బ్రహ్మానందస్వామి చెంతఁ గూర్చుండి నంతనే స్వామి యాత్రముతో నిట్లు పలికెను : "చూడు, తారక్ భాయీ! (శివానందస్వామి పూర్వనామము తారకనాథ ఘోషాల్.)తపస్సు చేయుటకై యీ కుఱ్ఱవాఁ డిచటినుండి వెడలి పోయెదననుచున్నాఁడు. మన కుఱ్ఱల ధోరణి యిటు లెందు కుండవలయునో నాకు అర్థము గాకున్నది. రామకృష్ణానందస్వామి ఆదర్శ జీవితముచే పవిత్రీకృతమైన స్థల మిది. ఈ మఠ మున నాతఁడెట్టి యద్భుతాధ్యాత్మిక వాతావర ణమును నిర్మించి యున్నాఁడు! ఇట్టి పావన వాతావరణము మఱెచట లభింపఁగలదు? వీరు తపస్సు చేయవలసిన అవసర మే మున్నది? అదంతయు వీరి నిమిత్తము మనము చేసి

యుంటిమికదా! వీరు తమ మనోభావము లెట్టివో గ్రహింపకున్నారు—ఉన్న చిక్కది.”

శిష్యునివైపుఁ దిరిగి స్వామి యిట్లు వచింప సాగెను : “భగవంతుఁ డక్కడ నున్నాఁడు” అని నీ వనుకొనుచున్నంత కాలము నీకు అశాంతియే. భగవంతుఁ డిక్కడ (తన హృదయమును సూచించుచు) ఉన్నాఁడని నీవు గ్రహించి యట్టి యనుభూతి నొందఁగలిగినప్పుడే నీకు శాంతి.

ఊరక త్రిమ్మరివై యొక చోటినుండి మఱి యొక చోటికిఁ దిరుగుచుండుట వలన నేమి ప్రయోజనము? అట్టి త్రిమ్మరులగు బైరాగులను, సన్న్యాసులను వందల కొలఁది మందిని నీవు చూచియుండలేదా? వారు సాధించిన దేమి? నీవును వారివంటివాఁడవే యగుటయా? ఒక మహా ప్రయోజనార్థము వివేకానందస్వామి యీ మఠ సంస్థను స్థాపించి యున్నారు. దీనిని బరిగణించి నీ శీలమును తదనుగుణముగా నిర్మించుకొనఁ బూనుచు, అట్లు జీవింపఁ బూనుము. ఒక్క వ్యక్తియొక్క ఆధ్యాత్మిక సాధనలు మఠమును

పవిత్రతతో స్పందింపఁ జేయఁజాలునని గ్రహింపుము. ( 9-వ ప్రకరణమున తుది రెండు పరిచ్ఛేదములను జూడుఁడు.)

గురుమహాశయులు (శ్రీ రామకృష్ణుఁడు)నివసించు చుండ, దక్షిణేశ్వరాలయమున నేమి యద్భుతాధ్యాత్మిక వాతావరణము విలసిల్లు చుండెడిది! రేవున, ఆలయ ఘట్టపు మెట్లను మా పడవ తాఁకినంతనే స్వర్గధామమును—సాక్షాత్పరంధామమును— జేరితిమా యనునట్లు మాకుఁ దోఁచెడిది! ఇది యిట్లుండ, సోదర శిష్యులమగు మే మెట్టి యద్భుత ప్రేమానురాగ బద్ధులమై యుండెడివారము! అట్టి ప్రేమ బాంధవ్యము మీ నడుమ గోచరించుట లేదు. సాధువైనవాఁడు ప్రేమామృతమయమగు మనస్తత్త్వము గలవాఁడై యుండవలయును; ఎవ్వరితోడను ఎన్నఁడును పరుషవాక్కు లాడరాదు. ఆహా! బృందావనమున నే నొకప్పుడు కలిసికొనిన సాధుపురుషుని వృత్తాంతము స్మృతికి వచ్చుచున్నది. నేను వెడలు దేవాలయమున కాతఁడు నిత్యము వచ్చుచుండెడివాఁడు. ఒకప్పుడు కొన్ని

దినముల వఱకును రాకుండుటచే నాతనిఁగాంచ నైతినిగదాయని చింతించితిని. మఱల నాతఁడు వచ్చినంతనే, "మీ రిన్నాళ్ళుగా రాకుండుటకు కారణమే" మని యడుగఁగా, నాతఁడు కాలి నొప్పిచే రానైతినని తెలుపుచు, ఆ సంఘటన మును నా కెఱుకపఱిచెను. జనసమ్మర్దమున నొకనాఁడు తన కాలిని ఎవరో యొక భక్తుని కాలు తాఁకి, నడచుటకుఁ దన్నుఁ దాత్కాలిక ముగా అసమర్థునిఁ జేసెనఁట. ఆ సంఘటనమును గూర్చి యా సాధుసత్తముని మాటలను విని ముగ్ధుఁడనైతిని. ఎవఁడో కన్నుగానని వ్యక్తి తన కాలు త్రొక్కివేసెనని యాతఁడు చెప్పలేదు. ఆతని దృష్టిలో ప్రతిపాదమును భగవత్పాదమే. భగవంతుఁడే తన పాదమును దనపై మోపెనని యాతని భావము!

మీ రందఱును ఇంపితమైన వర్తనమును, హృదయమున ప్రేమయుఁ గలవారై యున్నచో, ఎంతయో సామరస్య మమరును. మీ ప్రేమాను రాగముల కన్నిఁటికిని భగవంతునే లక్ష్యముగా నొనరించుకొనుఁడు.

వివేకానందస్వామి కార్యమును ఆచరించుటకై మీ కీమఠమున నెన్నియో సదవకాశము లమరియున్నవి; మీరు సదా ధ్యానింపజాలరు.

నీ విపుడు యువకుఁడవు; నియమనిష్ఠల నవలంబించుటకు ఇదే తరుణము. ముసలితనమున నీ వేమి చేయఁగలవు? హృదయమున ప్రేమను బెంపొందించుకొంటివా, సర్వము సాధింపఁగలుగుదువు. శుష్క-హృదయుఁడవై యున్నావు! నీ ప్రారంభకాలపుటుత్సాహ మేమైపోయినది? నీ ప్రస్తుతావస్థలో సంతృప్తుఁడవై యున్నట్లు కనఁబడుచున్నావు, కాని యిట్లు సంతృప్తుఁడవై యుండరాదు సుమీ! అసంతృప్తుఁడవు గమ్ము! నీ యన్వేషణమున సదా ముందంజ వేయఁబూనుము. రత్నాలగని చేచిక్కు వఱకును ఆఁగకుము! *

* శ్రీ రామకృష్ణుఁడు చెప్పుచుండెడి నీతికథను స్వామి సూచించుచున్నాఁడు. కట్టెలుకొట్టువాఁ డొకఁడు వనమునుండి తెచ్చిన కట్టెలమోపుల నమ్ముకొనుచు బహుకష్టజీవియై కాలము గడుపుచుండెను. ఒకనాఁ డాతఁడు కట్టెలు కొట్టుచుండఁగా నొక సన్న్యాసి వనమునుండి పోవుచు

నీవు శ్రీ రామకృష్ణదేవుని శరణుచొచ్చి యున్నావు. చిన్నవాఁడవు, నిర్మలుఁడవు. మహోన్నతి నొందుటకు అనంతమైన యెట్టి దివ్యావకాశములు నీ కేర్పడియున్నవో? మా మాట విని మేము నీకుఁ జెప్పునట్టి కార్యములను ప్రీతిపూర్వకముగా ఆచరించుటకై యేల తీవ్ర ప్రయత్న మొనరింపరాదు? నీ హృదయమును

వానిని జూచి, "వనమధ్యమునకు సాగిపొమ్ము, దానివలన నీకు విశేషలాభము కలఁగుము" అని హితోపదేశముచేసెను. మఱునాఁ డాతఁడు సాధువు చెప్పినట్లే వనములోనికి సాగిపోఁగా నచ్చట నొకమంచి గంధపుఁజెట్టు గాన్పించెను. అతఁ డమితానందభరితుఁడై తాను మోయఁగలిగినన్ని గంధపుఁగట్టెలు కొట్టి యంగడిలోనికిఁ దీసికొనిపోయి విక్రయించి విశేషలాభముపొందెను. "నన్ను ముందునకు సాగిపొమ్మని యా మహానుభావుఁడు చెప్పినాఁడుగదా? కాని యీ గంధపుఁజెట్టుమాట చెప్పలేదేమి? ఇంకను ముందునకుఁ బోయి చూచెదను" అని మఱునాఁ డాతఁడు మంచి గంధపుఁజెట్లను దాఁటి మఱికొంతదూరము పోయెను. అంతట వాని కొక రాగిగని గాన్పించినది. ఈ విధముగా నానాఁడు ముందునకు సాగిపోఁగా, వెండిగనులును, బంగారు

మాటలను ఏక మొనర్ప నేర్చుకొనుము, నీ మనస్సు నిన్ను మోసగింపనీయకుము. "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ" యనునట్లు ఆత్మ మోక్ష జగత్కల్యాణము లనునదియే స్వామిజీ (వివేకానందస్వామి) యాదర్శము! ఒక చేతితో భగవత్పాదారవిందములను బట్టుకొని రెండవ చేతితో వాని కార్యము నాచరింపుము.

గనులను, రత్నాలగనులను లభించుటచే, ఆ కట్టెలమ్ము వాడు తుదకు కోటీశ్వరుఁ డయ్యెను.

బ్రహ్మజ్ఞానము పొందఁగోరువాని విషయముగూడ నిట్టిదే. ఏ కొలఁదిపాటి సిద్ధులనో, మహిమలనో, సంపాదింపఁగనే తాను సర్వము సాధించితి ననుకొనక, పూనికతో సాధన సాగించునెడల, తుదకు శాశ్వతబ్రహ్మానందలాభము నందితీరును.

# సమస్త కర్తవ్య కర్మములను ఏకాగ్ర చిత్తముతో నొనర్ప నేర్చుకొనుము

పేరుప్రతిష్ఠలను సంపాదించునట్టి ఘనకార్యములను జేయుట సులభము. కాని చిన్న చిన్న పనులను బట్టియే, నిత్యకృత్యములనుబట్టియే మానవుని శీలమెట్టిదో గ్రహింపనగును. నిజమైన కర్మయోగి పేరుప్రతిష్ఠలకోసము పనిచేయఁడు, తాపత్రయపడఁడు. తాఁజేయు కార్య మెంతటి యల్పమైనదైనను, కర్మ మాతనికి భగవదారాధనము కావున నాతఁడు మనఃపూర్వకముగా దాని నాచరించును.

ప్రతివ్యక్తియుఁ దన కత్యంత ప్రియమైన పనిఁ జేయగోరుచుండును కాని కర్మరహస్యము—కీలకము——అది కాదు. నీ వేపని చేయుచున్నను, అది నీకు ప్రియమైనదైనను, గాకున్నను, భగవత్కార్యమని గ్రహించి తదను గుణముగా ఆచరింపుము. సమస్త కార్యములును భగవదారాధన

బుద్ధితో నొనరింపఁబడవలయునని మది నుంచు కొనుము. మనస్సున మూఁడుపాళ్ళు భగవంతునిపై నిలిపి మిగిలినదానిని నీ కర్మాచరణమున వినియోగింపుము. ఇట్లు చేయఁగలిగితివా, నీ కార్యము నిజముగా ఆరాధనమై నీ హృదయము ఆనంద సంభరిత మగును.

ఎట్టి పరిస్థితులలోనైనను, నీ వేమి చేయుచున్నను, నీ సాధనలను మాత్రము విడువకుము. జపధ్యానములను విడిచిపెట్టి కేవలము కర్మమున నిమగ్నుఁడవైతివా, విధిగా అహంకారము తలయెత్తును, ఇఁక తన్మూలమున కలహములకును కలఁతలకును కారణభూతుఁడ వగుచుందువు.

(ఎవరో యొక సీసా పగులఁగొట్టిరి.) స్వామి యిట్లు బోధింపసాగెను: ఆహా! ఎంత అజాగ్రత్తగా ఉన్నావు! నీ మనస్సు ఎక్కడ నున్నది? ఇట్టి అవ్యవస్థితమనస్సుతో నేమియు సాధింపఁజాలవు. చిన్న పనులగుఁగాక, పెద్దపనులగుఁగాక, సమస్త కర్తవ్య కర్మములను ఏకాగ్రచిత్తముతో నొనర్ప నేర్చుకొనుము, కర్మాచరణ

సమయమున మనస్సు నేకాగ్ర మొనర్పఁ గల్గిననాడు ధ్యానసమయమునను ఏకాగ్ర మొనర్పగలుగును.

కర్మరహస్యమిది: మొట్టమొదట నీ కార్యము నెడ ప్రీతివహింప నేర్చుకొనుము, కాని, ఫలము లను ఆశింపకుము.* ప్రతికర్మమును ఈశ్వరారా ధనగాఁ జేయగలిగితివా. కర్మాచరణమున ప్రీతి గలిగినవాఁడవై కర్మఫలాసక్తుఁడవు గాకుందువు.

కర్మమూలముననే మోక్షము నందవచ్చునని శ్రీకృష్ణుఁడు గీతలోఁ జెప్పుచున్నాఁడు; * కాని దీనిని సాధించుటకు తీవ్రవైరాగ్యము ఉండ వలయును. మఱియు ముక్తావస్థ నొందనపిమ్మట మాత్రమే యెవ్వఁడైనను నిజమైన కర్మయోగి కాఁగలఁడని నీవు గ్రహింతువుగాక. శారీర మానసి

* శ్లో. "కర్మణ్యే వాధికార స్తే
మా ఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూ ర్మా తే
సంగో౽ స్త్వకర్మణి." —గీత, 2-47.

(నీకు కర్మాచరణమందేకాని, తత్ఫలములయం దధి కారము లేదు. నీవు కర్మఫలములకును కారణము కావలదు. కర్మముల నమష్ఠింపకుండుటయందును దగిలయుండవలదు.)

నీ కాధ్యాత్మిక శక్తులన్నియు ఏకాగ్రమొనర్పఁ బడవలయును. అప్పుడే నీవు భగవంతునిఁ బ్రాపింపఁగల్గుదువు.

కర్మాచరణపరుఁడవై యుండుము. కాని తోడ్తోడనే సదా భగవంతుని స్మరించుచుండుము. శ్రద్ధ! శ్రద్ధ లేనిదే యెవ్వరును భగవంతునిఁ బ్రాపింపఁజాలరు. నిశ్చలమైన శ్రద్ధ గలవాఁడు నిశ్చయముగా భగవంతునిఁ బొందినవాఁడే. శ్రద్ధ యున్నచో, గవ్వయైనను విలువగలదగును, శ్రద్ధ లేనిచో, కాసైనను నీకు విలువ లేనిదై; నిష్ప్రయోజనమై పోవును. భగవంతునియందు శ్రద్ధాభక్తులు గలవాఁడు సంశయవిరహితుఁ డగును. త్యాగవైరాగ్యములు లేనిదే శ్రద్ధాభక్తులు ఉదయింపఁజాలవు. వైరాగ్యము అత్యావశ్యకము. అది యహంకారమును అంతరింపఁ జేయును.

## భక్తుని హృదయము శాంతినిలయము

శిష్యుఁడు : స్వామీ, భగవత్పరితాపము కలుగు టెట్లు?

స్వామి : సాధుసాంగత్యమువలన నీ మనస్సు నిర్మల మొనర్చుకొని నియమనిష్ఠల నవలంబించుచో, భగవత్పరితాప ముదయించి పెంపొందును.

శిష్యుడు : స్వామీ! శాంతి నొందు టెట్లు?

స్వామి : భక్తుని హృదయము శాంతినిలయము. భగవత్ప్రాప్తి నొందనిదే నీ జీవితము శుష్కమని గ్రహింపుము. అందులకై పరితపింపుము. అంతట శాంతి లభించును. సంసారమున శాంతి నొందకుండు నపుడు హృదయమున వైరాగ్యము జనించును. అట్టివాఁడు భగవదున్ముఖుఁడగును. సంసారము నిస్సారమని గ్రహించినకొలఁదియు, భగవద్భక్తియు, దానితోఁ బాటు శాంతియు బెంపొందును. దప్పిక మిక్కు-

ష్టమైన కొలఁదియు నీరు తీసి యనిపించును గదా? ఈవిధమైన పిపాస నొందితివా, భగవంతుని యందు శాంతిఁ గందువు.

శిష్యుఁడు : ప్రేమ, లేదా, భక్తి కలుగు టెట్లు?

స్వామి : ధ్యానప్రార్థనాది సాధనల వలనఁ గలుగును.

శిష్యుఁడు : లోకమున మనుచు మానవుఁడు భగవంతుని దర్శింపగలడా?

స్వామి : ఎవ్వరైనను లోకమునకు వెలుపల నుందురా?

శిష్యుఁడు : కాదు, స్వామీ! 'సంసారమున వర్తించుచు' అని నా భావము.

స్వామి : ఔను, అట్టివాఁడును భగవంతుని దర్శింపఁగలఁడు. కాని యాతఁడు ప్రబల ప్రయత్నము చేయవలయును.

శిష్యుఁడు : వైరాగ్యము కలిగిన పక్షమున సంసారము త్యజింపవలయునా?

స్వామి : ఔను, తప్పక త్యజింపవలయును. నిజమైన వైరాగ్యము కలిగినంతనే యది కార్చిచ్చువలెవ్యాపించును. శ్రీ గురుదేవుఁడు (శ్రీ రామకృష్ణదేవుఁడు) వచించురీతిని, "వలనుండి తప్పించుకొనిన చేపవలె సంసారపరిత్యాగియగు విరక్తుఁడు మఱల బద్ధుఁడు గానొల్లఁడు."

శిష్యుఁడు : గురువు లేనిదే భగవత్సాక్షాత్కారము నొందుట యసాధ్యమా?

స్వామి : గురువు లేనిదే యంతగా సులభసాధ్యము కాదు. మంత్రోపదేశ ద్వారమున భగవత్ప్రాప్తి మార్గమును జూపువాఁడే గురువు. ఆతఁడు సాధనకీలకమును దెలుపును. శిష్యునిఁ గనుఁగొని మార్గభ్రష్టుఁడుగాకుండ గురువు గాపాడుచుండును. గురువు బ్రహ్మజ్ఞానియై యుండవలయును.

శిష్యుఁడు : స్వామీ! మనస్సు నేకాగ్రమొనర్చు టెట్లు?

స్వామి : సాధనవలన. క్రమము తప్పక పూజాజపధ్యానప్రార్థనల నొనర్పుము. దినమున

కొకటిరెండు గంటలసేపు ధ్యానించిన మాత్రము న జాలదు. సాధన చేసిన కొలఁదియు భగవదు న్ముఖమై మనస్సు ఏకాగ్రతఁ జెందుచుండును. నిత్యము క్రమము తప్పక సాధనచేయుచుండుము.

సాధకుఁడు తన యిష్టదైవమును—సగుణ సాకారదైవమును—గూర్చిన మానసికారాధ నతోఁ దన సాధన నారంభింపవలయును. అంతట దేదీప్యమానమగు నిష్టదైవస్వరూపమును ధ్యానించి క్రమముగా తత్స్వరూపమును నిరా కారమున లయింపవలయును. భగవంతుఁడు సగుణుఁడు, నిర్గుణుఁడు, మఱియు సగుణనిర్గుణా తీతుఁడు.

శిష్యుఁడు: స్వామీ! "బ్రహ్మ సత్యం జగ న్మిథ్యా" యను వేదాంతవాక్యమునకు అర్థ మేమి?

స్వామి: దృశ్యప్రపంచమును మిథ్యయని దాని తాత్పర్యము. సమాధిస్థితిలో ప్రపంచ మదృశ్యమగును. తత్త్వదర్శియగువానిని వాని యనుభవముఁ దెలుపుమని యడిగినయెడల, అతఁ

డిట్లు చెప్పెను: "అచ్చట అంతయు అఖండా నందము! 'నేను', 'నీవు' అనునదేమియు లేదు— సర్వము అఖండసచ్చిదానందబ్రహ్మము! ఆ యానందానుభూతి వర్ణనాతీతము."

శిష్యుడు: స్వామీ! భగవంతుడు కలడను టకు నిదర్శన మేమి?

స్వామి: "నేను భగవంతునిఁ గనుఁగొనినాను. నీవును గనుఁగొనగలవు" అని తత్త్వదర్శి తెలుపును.

"'గంజాయి' యనుమాట నుచ్చరించినంత మాత్రాన అది మత్తు గొలుపదు; గంజాయి తెచ్చి దానిని దగిన పదార్థములతోఁ గలిపి యా పానీయమును దాగితివా, కొంతసేపటికి నీకు మత్తెక్కును" అని శ్రీ రామకృష్ణదేవులు వచించువారు. సాధనల నవలంబింపుము. ఓరిమి వహించి వేచియుండుము. భగవద్దర్శనభాగ్యము నొందుదువు.

శిష్యుఁడు: నేను జపము చేయుచుండ నొక్కొక్కప్పుడు మనస్సు భావశూన్యమై యుండును. స్వామీ! అందులకు హేతు వేమి?

స్వామి: ఆత్మవికాసమార్గమున అది యొక యంతరాయము. ధ్యానమును జపముతోఁబాటు సాగింపవలయును. భగవత్పరమైన అవిచ్ఛిన్న భావవాహినియే ధ్యానము. ధ్యానము పరిపక్వమైనంతనే తన్మయత గలుగును. అంతట సమాధి సిద్ధించును. సమాధిస్థితియం దనుభూతమగు నానందము సుస్థిరము.

౪_౨

## లోకహితార్థమై జీవింపుము

లోకకల్యాణము నొనఁగూర్పవలయు నన్నచో, నీవు పూర్తిగ స్వార్థరహితుఁడవై యుండవలయును. నీవు హితమొనర్చినచో నందులకుఁ బ్రతిగాఁ దఱచు నీకు హానిచేయఁ బ్రయత్నించునట్టివారు లౌకికులు. (ఈశ్వర చంద్ర) విద్యాసాగరమహాశయునిఁగూర్చి నీవు వినియుందువు. పరహితార్థముగ నాతఁడు జీవయాత్రఁ గడపెను, కాని యాతనివలన మేలొందిన వారే యాతనిఁగూర్చి దుష్ప్రలాపము లాడుచు నాతనికిఁ గీడుసేయ బ్రయత్నించిరి. ఎవ్వరయినను దన్ను నిందించిరని విన్నచో, "నా కాతఁడీ హానిచేయుటకు నే నాతనికిఁ జేసిన మేలేమున్నది?" అని యాతఁడు పలుకువాఁడు. లోకస్వభావమిట్లుండును. స్వతస్సిద్ధముగ నే సజ్జనుఁ డొరులకు మేలుచేయుచుండుటయు, దుర్జనుఁడు కీడుచేయుచుండుటయు లోకస్థితి.

ఒకప్పు డొక సాధు వొక నదియొద్దునఁ గూర్చుండి ధ్యానించుచుండెను. నీటిపైఁ దేలు చుండిన యొక తేలాతని కకస్మాత్తుగ గోచ రించెను. అంత నాతఁడు జాలిఁజెంది తన యఱ చేతితో దానిని నీటినుండి తొలఁగించెను. కాని యటు లొనర్చుచుండఁ దే లాతనిఁ గుట్టెను. సాధువు విశేష బాధ నొందెను. కొన్ని క్షణము లైనంతనే తేలు మఱల నీటిలోఁబడుట తటస్థిం చెను. సాధువు మఱల దానికి నీటినుండి వెలు వడఁ దోడ్పడెను. అంతలోఁ దేలు మఱల, గుట్టెను. ఈ సంఘటనమే మూఁడుసార్లు జరిగెనుఁ దీనినంతయు గమనించుచున్న యొకఁడు సాధు వును సంబోధించుచు, "అదేపనిగా మిమ్ముఁ గుట్టు చున్న తేలు కెందుకు తోడ్పడెదరు?" అని యడి గెను. అందులకు సాధు విట్లు సమాధానించెను: "కుట్టుట వృశ్చిక స్వభావము, హితముచేయుట నా స్వభావము. తేలు తన స్వభావమును విడువకుండునపుడు నా స్వభావము నే నెందు లకు విడువవలయును?"

మనస్సునకు రెండు గతులు: ఒకటి యూర్ధ్వ గతి, రెండవది యధోగతి. అసూయ, స్వార్థపరత, భోగేచ్ఛ, సోమరితనము మున్నగు వానితోఁ గూడుకొనియుండునదే దాని యధోగతి; శ్రద్ధ, భగవద్భక్తి, ప్రేమ, సానుభూతి మున్నగువానితోఁ గూడుకొనియుండునదే దాని యూర్ధ్వగతి.

# అనుబంధము

## జపము

జపధ్యానప్రార్థనార్థము, తన్మూలమున భగవ
ద్దర్శనార్థము, గురువు శిష్యునకు మంత్రోపదేశ
మొనర్చును. భగవంతుని పవిత్రనామమే
మంత్రము. ఇష్టదైవముపై మనసు నిలిపి మంత్ర
మును బదేపదే స్మరించుటయే జపము.

భగవన్నామము లన్నియు సమానశక్తిమంత
ములే యని ఆర్యులు విశ్వసింతురు. అభిన్నుఁడగు
భగవంతున కనేకనామములు గలవనుట వానికి
విభిన్నత నాపాదించునట్లు తోఁచవచ్చును, కాని,
వాని నే నామమున, ఏ రూపమున, నుపాసించి
నను భగవదనుగ్రహమును, భగవత్ప్రాప్తిని
బడయనగునని గ్రహింపనగును.

శ్లో. "యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మానువర్తంతే
మనుష్యాః పార్థ సర్వశః.

అర్జునా! ఎవరెవ రేయేరీతుల నన్ను భావించి యుపాసించుచుందురో, వారివారి నాయారీతులు గనే అనుగ్రహించుచుందును. సర్వప్రకారముల చేతను మనుష్యులు నా మార్గమునే యవలంబించుచున్నారు" అని శ్రీ కృష్ణభగవానుఁడు భగవద్గీతయందు వక్కాణించియున్నాఁడు గదా?

"ఏకం సద్విప్రా బహుధా వదంతి—ఉన్నదొక్కటియే, ఋషులాపరతత్త్వము ననేక నామములచేఁ బిలుచుచున్నారు" అనునది వేద వచనము. సచ్చిదానందస్వరూపమగు పరతత్త్వము అద్వితీయము. కాని యది యనేక నామరూపముల వ్యక్తమగుచుండును, అనేకకళలతో భాసించుచుండును. ప్రతికళకును ప్రత్యంశమునకును ప్రత్యేకసాంకేతికనామ మేర్పడియున్నది. మంత్రద్రష్టలును తత్త్వదర్శులును నగు మహనీయుల — ఋషివరేణ్యుల — దివ్యానుభూతులనుండి యీ నామములును, మంత్రములును వెలువడియున్నవి. అట్టిమంత్రము సద్గురునిచే శిష్యున కుపదేశింపఁబడునప్పుడయ్యది దివ్యశక్తితో స్పందించుచుండును. ప్రతి

జీవియందును నివురు గప్పిన నిప్పువలె నణఁగి మణఁగియున్న దేవత్వము మంత్ర జపధ్యానా దులచే ప్రదీప్తమై యొప్పును. సాధకుఁడు ఉపాసించునట్టి ప్రత్యేకభగవద్రూపమే "ఇష్టదైవ" మనఁబడుచున్నది.

శ్రీ వివేకానందస్వామి యిట్లు చాటి యున్నాఁడు: "ప్రతిమతమును, ప్రతిసంప్రదాయమును ప్రత్యేకమగు స్వీయాదర్శమునుమాత్రమే లోకులకుఁ జూపుచుండ, దైవత్వమనెడి గర్భాలయమునఁ బ్రవేశ మొందుటకై సనాతన ధర్మము — వేదాంతమతము — మానవకోటి కనంతద్వారములఁ జూపుచు భగవత్స్వరూప నిరూపకములగు ననంతాదర్శములను బ్రకటించుచున్నది. పూర్వకాలముననే కాక, ప్రస్తుతకాలమునను అమృతపుత్రులు—అవతారమూర్తులు—మానవజీవన తాత్త్వికదుర్గమారణ్యమును ఛేదించి నిర్మించిన రాజమార్గములను వేదాంతము అత్యంతవాత్సల్యముతో ముముక్షువులగు స్త్రీపురుషుల కెల్లరకును జూపుచు, మాయావిముక్తమై జీవాత్మ యొందు శాశ్వతానందస్వాతం

త్ర్యాంబుధి నోలలాడునో అట్టి సత్యనిలయము నకు, అట్టి పరంధామమునకు, అట్టి బ్రహ్మానంద సాగరమునకు ఎల్లరను—భావిసంతతిని సైతము—తన దివ్యప్రేమహస్తములను జాచి యాహ్వానించుచున్నది."

కాని దీనినిబట్టి సాధకుఁడు నేఁడొక రూపము నను రేపు మఱియొక రూపమునను భగవంతు నుపాసించుచుండ వచ్చునని భావింపరాదు. సాధకుఁడు విధాయకముగాఁ దన యిష్టదైవమునెడ నిష్ఠ కలిగియుండవలయును. మొక్క పెరిఁగి ప్రమానుకట్టు పర్యంతము చుట్టును గంచెవేసి జాగ్రత్తగా సంరక్షించుచుండవలయును. ఆశయములను, ఆదర్శములను మార్చుకొనుటయనెడి—స్వధర్మత్యాగాదులనెడి—పశువుల బారిఁ బడినచో, పారమార్థికశీల మనెడి మొక్క నశించి పోఁగలదు. సాధనయం దేకాదర్శనిష్ఠ ప్రారంభకునకు అత్యావశ్యకము

ఇష్టదైవధ్యానము చేయునపుడు తోడ్తోడనే మంత్రజపము చేయఁదగును. ధ్యానసంయుక్తము గానిచో జపము నిస్సారముగను, నిర్జీవముగను

దోఁచవచ్చును. ఏమైనను జపము సత్ఫలప్రదా యకమనుటకు సందియము లేదు. పూనికతో సాగించినచో అరుచి పోయి భగవత్సాన్నిధ్య మనుభూత మగును. జపమూలమున అంతరానందమును, రసానుభూతియు నుదయింప, భగవదనుసంధాననిష్ఠఁబూనుట కర్తవ్యవి అధికాధిక ముగాఁ దోడ్పడును.

శ్రీ బ్రహ్మానందస్వామి తన యుపదేశము లందు జపావశ్యకతనుగూర్చియు, జపప్రయోజన మునుగూర్చియుఁ బదే పదే నొక్కి వక్కాణించి యున్నాఁడు. మంత్రదీక్షితులగు శిష్యుల కీ యుపదేశము లొనర్పఁబడియున్నవి. ఏ గురువివలనను నింకను మంత్రోపదేశము నొందనివారు తమకు నచ్చిన యేపవిత్రభగవన్నామమునైనను జపింప వచ్చును,

నియమానుసారము సంఖ్యను హెచ్చించుచు, తగ్గించుచుఁ బ్రతిదినముఁ గొన్నిసార్లు జపము చేయవలయుననెడి నియమముతోఁ గూడుకొని యుండునదే పురశ్చరణము. ఉదాహరణము నకు, సాధకుఁడు శుక్లపక్షపుఁ బాడ్యమినాఁడు

వేయిసార్లు మంత్రజపముతో పురశ్చరణ మారంభింపవచ్చును. మఱునాఁడు రెండువేలసార్లను, ఆ మఱునాఁడు మూఁడువేలసార్లను—ఇట్లు దినదినము హెచ్చించుచుఁబోయి పౌర్ణమికిఁ బదునైదువేల పర్యాయములు జపించును. మఱునటి పాడ్యమినాఁడు జపము పదునాలుగువేలకుఁ దగ్గింపఁబడును. ఇట్లు క్రమముగాఁ దగ్గించుచు, అమావాస్యనాఁడు వేయిసార్లు జపించును. సాధకుఁడు తన యభీష్టానుసారముగాని, గురూపదేశము ననుసరించికాని యీ సాధన నొకటి రెండు, లేదా, మూఁడేండ్లపాటు సాగింపవచ్చును. దానయాగాదులకును ప్రాయశ్చిత్తమునకును బదులుగా నొక్కొక్కప్పుడు అధికజపము విధింపఁబడుచుండుట పురశ్చరణయందలి విశేషము. జపసంఖ్యను సులభముగా నెంచు నిమిత్తము హిందువులును బౌద్ధులును క్రైస్తవులలో క్యాతొలిక్ సంప్రదాయస్థులును (Catholics) తఱచు జపమాల నుపయోగించుచుందురు.

ఓం తత్ సత్

శ్రీ రామకృష్ణార్పణ మస్తు